అంతర భారతీయ పుస్తకమాల

# విషకన్య

రచన

**ఎస్.కె. పొట్టెక్కాట్**

అనువాదం

**పి.వి. నరసారెడ్డి**



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-3685-1

ప్రథమ ముద్రణ 2002 (శక 1923)



Original Title in Malayalam : Vishakanyaka by S.K. Pottekkatt

*Telugu translation* : Vishakanya

రూ. 60.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,

న్యూఢిల్లీ-110 016 ద్వారా ప్రచురింపబడినది.

# ప్రథమ ముద్రణకు తొలిపలుకు

సుమారు నాలుగేళ్ల క్రిందట నాకు మలబారు కొండలమధ్య కొంతకాలం గడిపే అవకాశం లభించింది. నేను అక్కడ వున్న రోజుల్లో తిరువాన్కూరు[1] నుండి వయనాడుకు వలస వచ్చినవారి గురించి తెలుసుకోవడమే కాకుండా వారితో వ్యక్తిగత పరిచయం పెంచుకొనే అవకాశం కూడా నాకు కలిగింది. నా హృదయంలో వారి ప్రాచీన సభ్యత, పనిపాటలు, సంస్కృతి గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉత్పన్నమయింది. ఈ నవలకు నా యీ జిజ్ఞాసే ఆధారం.

తెలిసో-తెలియకో తిరువాన్కూరు ప్రజలు చేసిన ఈ సాహస ప్రయత్నం స్వావలంబన దిశలో కేరళీయుల ప్రథమ సోపానంగా భావించవచ్చు. వారు చేసిన ఈ ప్రయత్నం వల్లే నాకు వారి యెడల గాఢమైన అనురాగం ఏర్పడింది. ప్రభుత్వం నుండి యెలాంటి సహాయము, ప్రేరణ లేకుండా స్వయంకృషి, మొక్కవోని సాహసాన్ని ఫణంగాపెట్టి వీళ్లు తమ జీవితాన్ని పునఃప్రారంభించారు. ఈ ప్రయత్నంలో వీరు యెంతో శ్రమించాల్సి వచ్చింది. కృషి, పట్టుదల, పౌరుషం గల వీరు అభినందనీయులు. వీరి యెడల నాకు గౌరవభావమేకాదు సానుభూతి కూడా యేర్పడింది. ప్రశంస, సానుభూతి కలబోసుకొని నా చేత ఈ నవల రాయడానికి వివశుణ్ణి చేశాయి.

ఈ నవలలోని పాత్రలు లేదా ఘటనలు యే సజీవ వ్యక్తులకు సంబంధించినవి కావు. నా మనసులో ఉత్పన్నమైన ప్రశంస, సానుభూతి భావాలు యే సమాజం లేదా వ్యక్తుల యెడల అపహాస్యంగా రూపొందించలేదని గట్టి నమ్మకంతో చెబుతున్నాను.

ఈ నవలలో మలబారుకు వలస వచ్చిన వారి సమస్యలు, కష్టాలు, కఠోర

---

1. భాషా రాష్ట్రాలుగా విభజించక పూర్వం కేరళ మూడు భాగాలుగా వుండేది - తిరువాన్కూరు, కొచ్చిన్, మలబారు. స్వతంత్రం రాక పూర్వం తిరువాన్కూరు, కొచ్చిన్ ప్రాంతాలు దేశీయ సంస్థానాధిపతుల స్వాధీనంలో వుండేవి. మలబారు మాత్రం బ్రిటిషువారి పాలనలో వుండేది.

శ్రమ వర్ణించే ప్రయత్నం చేశాను. ఏ కోటనైనా ఆక్రమించడానికి వెళ్లినప్పుడు ముందువరుసలో వున్న సైన్యం అధిక ప్రమాదాల్ని ఎదుర్కోవలసి వస్తుంది. అదేవిధంగా కొత్తగా వలసలు వెళ్లిన వారికంటే వారి పూర్వీకులు చాలా భయంకరమైన ప్రమాదాలకు గురికావలసి వచ్చింది. మొట్టమొదటిసారి ఈ ప్రాంతానికి వలస వచ్చిన వారిలో తొంభైశాతం ప్రజలు - ఈ కొండలలో ఘోరమైన పేదరికంతో కష్టాలతో అకాల మృత్యువు పాలయ్యారు. సజీవులుగా మిగిలినవారు తమ సంపూర్ణ జీవితాలను భావితరాల కోసం త్యాగం చేశారు. అడవులు నరికేశారు. మలేరియా పూర్తిగా నిర్మూలనమైనది. సభ్య సమాజం వేళ్ళూని విస్తరించింది. అడవుల స్థానంలో పల్లెలు, పట్టణాలు వికసించాయి. ఈ నవ నిర్మాణం సంఘర్షణలో తమ ప్రాణాలను ఆహుతి ఇచ్చిన వేలాదిమంది అజ్ఞాతుల స్మృతికి ఈ నవలను సంతోషంతో సమర్పిస్తున్నాను.

**యస్.కె. పొట్టెక్కాట్**

'చంద్రకాంత'

పుతియరా

15 సెప్టెంబరు, 1948

# ఏడవ ముద్రణకు పరిచయం

విషకన్య మొదటి ముద్రణ ప్రచురించి యిప్పటికి పంధొమ్మిది సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పటినుండీ యిప్పటివరకూ ఈ నవలకు అధారక్షేత్రమైన 'వయనాడు'[1] లో యెన్నో మార్పులు పచ్చాయి. మొదట మద్రాసు ప్రెసిడెన్సీలో వున్న మలబారు ప్రాంతం స్వతంత్రం తర్వాత కేరళ రాష్ట్రంలో కలిసిపోయింది. వయనాడు ప్రాంతపు ఉత్పత్తుల గిరాకీ, వెల ప్రపంచ మార్కెట్టులో ప్రసిద్ధి చెందాయి. యిక్కడ యిప్పుడు రవాణా సౌకర్యాలు పెరిగాయి. చిన్నచిన్న పల్లెలు పెద్ద పట్టణాలుగా మారాయి. కొత్తపేటలు యేర్పడుతున్నాయి. కొండలమీద కొత్త కొత్త స్కూళ్లు, కాలేజీ భవంతుల నిర్మాణం జరుగుతోంది.

నేను 1962లో వయనాడు ప్రాంతానికి లోక్‌సభ సభ్యుడిగా ఎన్నుకోబడ్డాను. ఆ కారణంచేత అనేక పర్యాయాలు ఆ ప్రాంతంలో పర్యటించి ప్రజలను కలుసుకొనే అవకాశం లభించింది. ఈ కొత్త అనుభవాలు, పరిచయాల కారణంగా 'విషకన్య' రెండవ భాగం (వీరకన్య) రాసే సదవకాశం నాకు కలిగింది. అందుచేత నేను ఈ పుస్తకము యేడవ ముద్రణను మీకు అందిస్తున్నాను.

పంధొమ్మిది సంవత్సరాల తర్వాత కూడా 'విషకన్య' కు నిరంతరం గిరాకీ పెరుగుతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది.

**యస్.కె. పొట్టెక్కాట్**

'చంద్రకాంత'

పుతియరా

15 నవంబరు, 1967

---

1. వయనాడు లేక మలబారు

# పీఠిక

మలయాళంలో రాజశిల్పి, ఇందులేఖ, శారద మొదలైన సాంఘిక నవలలను శ్రీ ఒ. చందుమీనన్ రచించారు. మార్తాండవర్మ, ధర్మరాజు, రామరాజబహదూర్ మొదలైన చారిత్రక నవలలను శ్రీ సి.వి. రామన్ పిళ్లై సృజించారు. ఇందులేఖ మొట్టమొదట 1889లో ప్రచురించబడింది. ఆ తర్వాత చందుమీనన్, సి.వి.లకు అనుయాయులుగా, అనుసరణ రచయితలుగా అనేకమంది ఎన్నో దశాబ్దాలపాటు నవలలు రచించేవారు. కానీ ఆ తర్వాత తరానికి చెందిన కొంతమంది నవలా రచయితలు నవలను కొత్త పంథాలో నడిపించారు. రెండవతరం నవలా రచయితల్లో పి. కేశవదేవ్, తకషి శివశంకరపిళ్లై, వక్కమహమ్మద్ బషీర్, యస్.కె. పొట్టెక్కాట్, పి.సి. కుట్టికృష్ణన్ అగ్రగణ్యులు. ఈ నవలా రచయితలు తమ రచనల్లో ఒక వినూత్న పద్ధతిలో స్వతంత్ర వ్యక్తిత్వం, జీవిత తత్వం, శైలిని పరిచయం చేశారు. ఈ రచయితల్లో సమానమైన పోలికలను మనం చూడగలం. వాస్తవానికి ఈ నవలా రచయితలు మొదట కథానికలు రాసేవారు. ఈ రచయితలంతా తమ కథాసంకలనాల్లో కేరళ ప్రాకృతిక సౌందర్యాన్ని, జీవిత విధానాన్ని దృశ్యపరంగా లేదా అదృశ్యంగానో, స్థూలంగానో లేక సూక్ష్మంగా చిత్రీకరించగలిగారు. ఈవిధంగా ఈ నవలా రచయితలంతా మొట్టమొదట చిన్నకథల రచయితలుగా సాక్షాత్కరించి, ఆ తర్వాత నవలా ప్రపంచంలోకి అడుగుపెట్టారు. మొదటి ప్రపంచయుద్ధం, అక్టోబరు విప్లవం కారణంగా ఈ శతాబ్ది రెండవ దశకంలో పాత నమ్మకాలు వమ్ము అయ్యాయి. కొత్త విలువలు, ఆశయాలకోసం నిరీక్షించాల్సివచ్చింది. దేశాన్ని పర పాలననుండి విముక్తి చెందించడానికి తిలక్, గాంధీజీరేపిన స్వతంత్ర జ్వాలలు, మార్క్సు సామ్యవాదం మలయాళ రచయితలను గాఢంగా ప్రభావితం చేశాయి. ప్రతిభావంతులైన యీ నవలా రచయితలు తమ రచనల్లో ఒక కొత్త, అమూల్యమైన జీవిత విధానాన్ని ప్రతిబింబింప చేశారు. యీ నవలా రచయితలందరి ఆశయాలూ సమానమైనవే. పేదలయెడ దయ, కొత్త ప్రపంచాన్ని సృష్టించాలనే స్వప్నం, స్వతంత్రంకొరకు దృఢసంకల్పం, మనుషుల దుఃఖాన్ని దూరం చేయడం

మొదలైనవి. ఆశయాలు అందరివీ ఒకటే అయినా ప్రతిభా విశేషాల్లో ఎవరికి వారేసాటి. యీ నవలా రచయితల్లో యస్.కె. పొట్టెక్కాట్ కేవలం కథలు, నవలలు మాత్రమే రాయలేదు. వారు ఒక కవిగా, ప్రత్యేకించి ఒక యాత్రావృత్తాంతకారునిగా మంచిపేరు సంపాదించారు. వారు పద్యాన్ని, గద్యాన్ని సమాన ప్రతిభతో రచించారు. వారు ఒక్క ఆస్ట్రేలియా తప్పించి మిగిలిన ప్రపంచదేశాల్లో పర్యటించి సత్యాసత్యాలను పరిశోధించి శ్రేష్ఠమైన యాత్రా రచనలు చేశారు. మానవుడి జీవితంలోని వివిధ రూపాలను, భావాలతోపాటు దేశంలోని కులమత భావాలకు అతీతమైన మానవుణ్ణి శోధించారు. ఈ నిజమైన మనిషిని తన యాత్రావృత్తాంతాల్లోను, సాహిత్యంలోనూ మనకు చూపించారు. ఇలా ప్రతిభా వంతంగా యాత్రా వృత్తాంతాలను రచించి యితర నవలా రచయితలకంటే విశిష్ట వ్యక్తిత్వాన్ని ప్రదర్శించగలిగారు. శ్రీ పొట్టెక్కాట్ నిరంతరం వివిధ దేశాల్లో పర్యటించి ఆయా దేశాల సభ్యత, ఆచార వ్యవహారాల్లో మునిగి తేలినా తన సంస్కృతినీ, సభ్యతనూ ఎప్పుడూ మరవలేదు. ఈ సత్యం శ్రీ యస్.కె. పొట్టెక్కాట్‌గారి బృహత్ నవల ''ఒరు దేశాత్తింటె కథ'' (ఒక దేశం కథ) చదివితే స్పష్టమవుతుంది.

నాడన్, ప్రేమమ్, ప్రేమ శిక్ష, కరాంపు మొదలైనవి పొట్టెక్కాట్ చిన్న నవలలు. అవి అతి మనోహరమైన భావగీతాల్లాంటివి. ''మూడూ పడమ్'' నవలకు రాసిన పీఠిక కొద్దిగా పెద్దదయింది. ఈ నవలలో రచయిత కేరళలో తమ ఆస్తిపాస్తులు వదిలేసి బొంబాయి వెళ్లిన కడు నిరుపేద, నిస్సహాయ కుటుంబాల బాధాతప్త గాథలను వర్ణించడమైనది. పై నవలలో ''ఒరు దేశాత్తింటె కథ'' అటు కథలో ఒక భాగంగానే కాకుండా ఇటు రచయిత ఆధ్యాత్మిక తత్వం ప్రతిబింబిస్తుంది. వారి మరో బృహత్ నవల ''ఒరు తెరువింటె కథ'' (ఒక వీధి కథ). ఈ రచనలో శ్రీ పొట్టెక్కాట్ తాను చాలాకాలంగా నివసిస్తున్న వీధిలోని మనుషుల నిజ స్వరూపాన్ని పాఠకుల ముందుంచారు. సాధారణంగా వీరి నవలల్లో ఒకవైపు గ్రామీణుల అమాయకత్వం, లాలిత్యం, ధైర్య సాహసాలను మరోవైపు నగర ప్రజల శుష్కయాంత్రిక జీవితం, కృత్రిమమైన డాంబికాన్ని నిర్భయంగా చాటిచెప్పారు. వీరి యితర నవలలతో పోల్చి చూచిన ''విషకన్య'' భాషాశైలి చాలా సరళమైనది.

స్వతంత్రం రాకపూర్వం కేరళ రాజ్యం మూడు భాగాలుగా విడి వడి వుండేది - తిరువాన్కూరు, కొచ్చిన్, మలబారు. మొదటి రెండు ప్రాంతాలు స్థానీయ

సంస్థానాధీశుల అధీనంలో వుండేవి. మలబారు మద్రాసు ప్రెసిడెన్సీలో బ్రిటిషువారి పరిపాలనలో వుండేది. భారతదేశం కొద్ది సంవత్సరాల్లో స్వతంత్రం పొందే ముందు తిరువాన్కూరు ప్రాంతంనుంచి కొంతమంది పేద క్రైస్తవ రైతులు తమ చిన్న చిన్న తోటలను, కయ్యలను అమ్మేసి అక్కడికి దూరంగా వున్న మలబారు ప్రాంతపు వయనాడు కొండలలో నివాసమేర్పరచుకున్నారు. అక్కడి సారవంతమైన కొత్తమట్టి వారి యజ్ఞవేదిక అయినది. ఆ పొలాల్లో బంగారు పంటలు పండించాలని సాహసించారు. ఋతువుల మార్పుతో పక్షులు ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి వలస వెళ్లినట్లు తిరువాన్కూరు పేద ప్రజల గుంపులు తమ వూరూ వాడా వదిలి మలబారు కొండల్లో పొలాలూ తోటలూ పెంచడానికి వెళ్లారు. కాని మలేరియాజ్వరం, అడివి జంతువులూ కలిసి వాళ్ల ఆశయాలను అడియాసలు చేశాయి. అంతటితో ఆశ వదలక వారు శత్రుసైన్యంలా విజృంభించి వారి శత్రువులను ముందుకు సాగనివ్వలేదు. వాళ్లు అడవులను నరికి కొండలను తవ్వి సాగు భూములుగా మార్చారు. ఆ పొలాల్లో వాళ్లు కర్రపెండలం మొదలు యాలకులు, లవంగాలు మొదలైన సుగంధ ద్రవ్యాలను కూడా పండించసాగారు. కానీ కొంతమంది ఆ యజ్ఞ వేదికకు బలికాక తప్పలేదు.

వాళ్లు ఆ భూమి మీద ప్రకృతి తాలూకు క్రౌర్యాన్ని - ఔదార్యాన్ని రెంటినీ చవి చూశారు. శ్రీ పొట్టెక్కాట్ ఈ నవలలో మానవుడు - ప్రకృతికీ మధ్య జరిగిన సంఘర్షణ - కలయికలో గల మాధుర్యాన్ని కావ్యాత్మకంగా నాటకీయశైలిలో ఆవిష్కరించారు. ఆ వన్య ప్రకృతి ఒకవైపు తన సహజమైన సౌందర్యాన్ని ప్రదర్శించి ప్రజలను తనవైపు ఆకర్షిస్తూ మరోవైపు పాప పంకిలమైన కౌగిట బిగించి హతమారుస్తోంది. ఆ ప్రకృతి ఓ విషకన్యలా తన మాదక సౌందర్యాన్ని చూపించి ప్రజలను ఆకర్షిస్తోంది. కానీ వెంటనే వాళ్లని చంపడానికి యే మాత్రం వెనుకాడదు. మలబారు ప్రకృతి సౌందర్యము అక్కడి కొత్తనేల ఈ రెండింటి స్వభావం ఒకటే. ఈ నవలలో నాయిక మాధవి. ఇందులో ఆమెను రచయిత అటు ప్రకృతి ఇటు కొత్తనేల - రెండింటి స్వభావాలను ప్రతిబింబింపచేశారు. యీ విషకన్య విషపూరిత సాంగత్యం పొంది యెందరో తమ ప్రాణాలను కోల్పోయారు. మరెందరో విషకన్య సాంగత్యం నుండి తప్పించుకోవడానికి శాయశక్తులా ప్రయత్నిస్తారు. ఈ నవలలో పై రెండు రకాల పాత్రలు మన కళ్లముందు ప్రత్యక్షమౌతాయి. ఈవిధంగా యీ

నవలొక భూభౌగోళిక చరిత్ర కథ. శ్రీ పొట్టెక్కాట్ రచించిన ఈ నవల ఒక నృత్యగీతిక సౌందర్యాన్ని సంతరించుకుంది. మనం చాలా దూరం నుండి ఒక మహాసముద్రపు భీకర గర్జనని ఎలా వినగలమో అలాగే యీ నవలద్వారా మలబారులో తిరువాన్కూరు ప్రజలు సలిపిన మహాజీవన ప్రయాణ సంగీతాన్ని యెంతదూరం నుండైనా వినగలం.

వాస్తవానికి శ్రీ పొట్టెక్కాట్ గద్యం-గద్యం కాదు, అది కావ్యమయం. "అనువాదం వలన కవిత్వం అంతరిస్తుంది." అని ఒక సామెత వుంది. మూల రచనలో శ్రీ పొట్టెక్కాట్ తన భాషలో ఆవిష్కరించిన సంగీతాత్మకత బహుశా అనువాద రచనలో లోపించి వుండవచ్చు, కానీ యిందులో యదార్థ మానవుడి చిత్రీకరణ పదిలంగా వుంది.

ఏ భాషలోనైనా యీ నవల రూపు రేఖల చిత్రణలో గల సొగసు తరిగిపోదని నా విశ్వాసం.

ఒ.యన్.వి కురూప్పు

యూనివర్శిటీ కాలేజి
తిరువనంతపురం
1-12-1980

# ఒకటి

మధ్య తిరువాన్కూరు[1] లో ఓ వైపున కొండ వుంది. ఆ కొండలోయలో విశాలమైన మైదానం. ఆ మైదానానికీ కొండకీ మధ్య అతుకులు గతుకులతో వంకర టింకర రహదారి వుంది. ఆ రోడ్డుమీద ఎడ్లబండి నడక వింత వింత శబ్దాల్ని కలుగజేస్తోంది. కొంతసేపటికి ఎడ్లబండి మైదానం మధ్యకు చేరుకొని ముందుకు నడుస్తోంది. ఆ బండి ఇంటి సామాన్లు, వంటసామాన్లతో నిండివుంది. పెట్టెలు, బట్టలు, రాగిగిన్నెలు, కడవలు, లాంతరు, కోళ్లగూడు, బావిగిలక, తాడు, జల్లెడ వగైరా వగైరాలతో బండి పూర్తిగా నిండిపోయింది.

ఎడ్లబండి వెంట పిల్లలు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు, యువతీ యువకులతోపాటు చంటిపిల్లల్ని భుజాన వేసుకొన్న తల్లులు - యేదో తిరునాళ్లకు వెళుతున్నట్లు భ్రమ కలిగిస్తోంది. ప్రతిఒక్కరి నెత్తిమీద ఓ మూట వుంది. ఆ గుంపు నడుమ ఓ యువకుడు నడుస్తున్నాడు. అతడు కోటుపైన జలతారు కండువా, కళ్లకు పచ్చటి కళ్లజోడు వేసుకొన్నాడు. మాటిమాటికి బండిలోపలకు తొంగిచూస్తూ బండి వెనుక నడుస్తున్నాడు.

''పాచ్చు పిళ్లే! బండి ఒక వైపునకు వాలుగా వుంది. జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూండు. లేకపోతే సామానంతా క్రిందికి జారిపోతుంది.''

''పర్కీ బాబుగారు! మీరేమీ భయపడవద్దు, బండిముందు నేను కూర్చోనున్నాగందా. ఒకసారి యేమయిందంటే బండి నిండుకు కుండలు యేసుకొని పదిమైళ్లు తోలుకెళ్లా. అందులో ఒక్క కుండ పగిలితే ఒట్టు!...'' పాచ్చు పిళ్లె నవ్వుతూ

---

1. తిరువాన్కూరు - ఇది కేరళ రాష్ట్రంలోని ఒక ప్రాంతం. కేరళ రాష్ట్రాన్ని బ్రిటీషువారు మూడు భాగాలుగా విభజించారు. 1. తిరువాన్కూరు, 2 కొచ్చిన్, 3. మలబారు. తిరువాన్కూరు కేరళ రాష్ట్రంలోని దక్షిణ ప్రాంతంకాగా మలబారు కేరళకు ఉత్తరభాగంలో వుంది. కొచ్చిన్ - ఈ రెండు ప్రాంతాల మధ్యలో వుంది. ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో తిరువాన్కూరు, కొచ్చిన్ ప్రాంతాల్ని సామంత రాజులు పరిపాలించేవారు. కాని మలబారు బ్రిటిష్‌వారి పరిపాలన క్రింద వుండేది.

జవాబిచ్చాడు.

పాచ్చు పిళ్లె బండి ముందు కూర్చొని వక్కాకు వేసుకోవడానికి తమలపాకులు తీసి సున్నం రాస్తున్నాడు.

ఆ బండి వెనకాలే ఆ యువకుడు చెరియన్ టీ కొట్టు దగ్గరకు చేరుకున్నాడు. చెరియన్ తన దుకాణంలో కూచొని రోడ్డువైపు చూస్తున్నాడు.

ముండక్కయం[2] వర్కీ చెట్టన్ [3] తన స్నేహితుల్ని వెంటబెట్టుకొని వస్తున్నాడు. వాళ్లతోపాటు మీ అమ్మకూడ వస్తోంది. చెరియన్ తన భార్యతో చెప్పాడు.

చెరియన్ పెళ్లాం మరియమ్మ ఇంట్లో కూర్చొని కత్తితో 'కప్ప'[4] (కర్ర పెండలం) తొక్క తీస్తోంది.

చెరియన్ చెప్పిన వార్త చెవిలో పడగానే మరియమ్మ చేసే పని వదిలేసింది. సంతోషంతో తన చంటి బిడ్డనెత్తుకొని ఇంటిముందు వరండాలోకి చేరుకొంది.

"తాడుందా, తాడు?" [5] వర్కీ చెరియన్ వైపు చూస్తూ అడిగాడు.

"లేదు" చెరియన్ దిగులుగా సమాధానం చెప్పాడు.

"పదకొండుమంది మగాళ్లు, ఎనిమిది మంది ఆడాళ్లు, ఆరుగురు పిల్లలు మొత్తం ఇరవై అయిదు మంది." చెరియన్ కొడుకు జాన్ ఆ గుంపును లెక్కబెట్టాడు.

ఆ గుంపులో నుండి మరియమ్మ అమ్మ చెరియన్ ఇంట్లోకి వెళ్లింది.

"మరియమ్మా! నన్ను మలబార్ వెళ్లమంటావా?" ఆమె గొంతులోంచి బాధ వ్యక్తమౌతోంది.

"అమ్మా! నువ్వు మలబారు వెళ్లి మమ్మల్ని మరిచిపోవు కదా?"

"లేదు తల్లీ! అది ఎలా సంభవం? యేసు కృపవల్ల మేము క్షేమంగా

---

2. ముండక్కయం - ఓ పల్లె పేరు.
3. చెట్టన్ -పెద్దన్నయ్య. తిరువాన్కూరు క్రిష్టియన్లు తమకంటే పెద్దవారినందర్నీ 'చెట్టన్' అని గౌరవ సూచకంగా పిలుస్తారు.
4. కప్ప - కర్రపెండలం. కేరళలో విస్తారంగా పండిస్తారు. దీనివేళ్లని పుష్టికరమైన ఆహారపదార్థంగా వినియోగిస్తారు. ఇందులో స్టార్చి శాతం ఎక్కువ. మళయాళంలో మరచ్చీనీ, పూతా కిషడ్ అని కూడ అంటారు.
5. తాడు - దీనికి రెండర్థాలున్నాయి. 1. కొబ్బరిపీచుతో తయారైన తాడు, 2. వంటసారా. గట్టి తాడుతో సమానంగా మనిషి మెదడును కట్టి పడేస్తుంది.

మలబారు వెళ్తాంగాని, నిన్ను, పిల్లల్నీ తీసుకెళ్లకుండా వుండగలమా?''

''అమ్మా! పిల్లాళ్ల చిన్నాన్న మలబారు వెళ్లి మలేరియా జ్వరంతో చనిపోయిన సంగతి నీకు తెలుసుకదా? అందుకే పిల్లాళ్ల నాన్నకు మలబారు పేరు వింటేనే చిర్రెత్తుతుంది.''

''తల్లీ! అంతా యేసుప్రభువు దయ. వాళ్లంతా ముందుకు వెళ్లిపోయారు. నేను ఒక్కర్తినే నడుచుకెళ్లాలంటే కష్టంగా వుంటుంది.''

''అమ్మా! కొంచెం ఆగు.'' మరియమ్మ పరుగెత్తుకుంటూ దుకాణంలోకి వెళ్లింది. లోపల్నుండి మిఠాయీల పొట్లం తెచ్చియిచ్చింది.

ఆమె సంతోషంగా పొట్లం తీసుకొని చెరియన్‌కు వీడ్కోలు చెప్పింది. మరియమ్మ కొడుకు సైమన్ చేతిలో ఓ 'చక్రం'[6] నాణెం పెట్టి ఆశీర్వదించింది. ఆమె గుంపులో చేరిపోడానికి త్వరత్వరగా నడుచుకెళ్లింది.

పంటపొలాల గట్టు మీద ఎండలో నీడలా కదిలిపోతున్న బండిని, దాని వెంబడి నడుచుకెళ్లే జనాల్ని మరియమ్మ కనుమరుగయ్యేంత వరకూ చూస్తూండిపోయింది.

మరియమ్మ మనసంతా మలబారు వెళ్లేవాళ్ల గురించే ఆలోచించసాగింది. వీళ్లందరూ ఇల్లు-వాకిలీ వొదిలేసి యేమీ తెలియని కొత్త ప్రాంతానికి వెళ్లిపోతున్నారు. ఇకముందు వీళ్లని కలుసుకోగలమా? మలబారు గాలి, నీరు వీళ్లకి పడుతుందా?

మరియమ్మ వాళ్ల పయనం గురించి ఆలోచిస్తుంటే కళ్లముందు కారు చీకటి కమ్ముకున్నట్లు ఆమె మనసు మౌనంగా రోదించసాగింది.

# రెండు

ఒక గుంపు తర్వాత మరోగుంపు. ఈ గుంపులన్నీ మలబారు వైపే వెడుతున్నాయి. మత్తయి రెండో గుంపునకు చెందినవాడు. ఆ గుంపుకు పోటాక్యం వర్గీసు నాయకుడు. అతడు తన నలుగురు పిల్లలు, అయిదు పెట్టెలతోపాటు బయలుదేరాడు. తన ఆస్తినంతా యెనిమిది వందల రూపాయలకు అమ్మేశాడు. అతడు నలుగురు స్నేహితులతో కలసి మలబారు వెళ్లటానికి సిద్ధమయ్యాడు.

---

6. చక్రం - తిరువాన్కూరు ప్రాంతంలో ఆనాడు చలామణిలో వున్న నాణెం. ఇరవై ఎనిమిది చక్రాలు ఒక రూపాయితో సమానం

ఒక చేతిలో చిరిగిన గొడుగు, మరోచేత్తో చిమ్నీ పగిలిన లాంతరు పట్టుకున్నాడు. చివరిసారిగా తన ఇంటివైపు చూశాడు. తన చేతుల్తో నీళ్లు పోసి పెంచిన మొక్కలను బుజ్జగిస్తున్నట్లు చూశాడు. తనకి ముఖ్యులైన ఇరుగు పొరుగువారికి వీడ్కోలు చెప్పి తలవంచుకొని మలబారు బయల్దేరాడు. అతడి పిల్లలు కుక్కపిల్లల్లా అతడి వెంట నడవసాగారు.

దారి ఖర్చులకు కొంత డబ్బు పర్సులో వుంచుకున్నాడు. ఆరువందల రూపాయల్ని ఓ చిన్న డైరీలో పెట్టి గట్టిగా దారంతో చుట్టేసి దాన్ని కోటు లోపలి జేబులో వుంచుకున్నాడు. మనసులో యెన్నో ఆశలు, కోరికలు నింపుకొని ఇల్లు విడిచిపెట్టాడు. ఈ డబ్బుకు మలబారులో బంగారు పంటలు పండే నాలుగు వందల ఎకరాల భూమిని కొనడానికి భద్రపరిచాడు. అతడికి ఒకందుకు దుఃఖంగా కూడా వుంది. ఈ సమయంలో నా పెళ్లాం అన్నమ్మ వుండి వుంటే ఎంత సంతోషించేదో. అన్నమ్మ ఎనిమిది మాసాల క్రితం మశూచి వ్యాధి సోకి పరలోకం పాలైంది. మలబారు వెళ్లటానికి ఆమె ఎంతో వుబలాటపడింది. కాని భగవంతుడికి ఇష్టం లేదాయె. ఇలా తలపోస్తూ అతడు మార్టిన్ ఇల్లు చేరాడు.

మార్టిన్, అతడి భార్య, ఇద్దరు పిల్లలు మలబారు వెళ్లడానికి తయారై ద్వారం దగ్గర నిల్చొని ఎదురు చూస్తున్నారు.

మార్టిన్‌వద్ద కేవలం మూడొందల రూపాయలే వున్నాయి. మరియమ్మ వద్ద కొంత సొమ్ముందని అతడికి తెలుసు. కాని ధైర్యంచేసి ఆమె వద్ద ఎంత వుందో అడగలేకపోయాడు. అతడి నెత్తిమీద రెండు పెట్టెలున్నాయి. చేతిలో కర్ర పెండలం కాండం వుంది. మరియమ్మ తల మీదైతే ఒకదానిమీదొకటి మొత్తం మూడు పెట్టెలున్నాయి. వాటిపైన తురుముకొనే కత్తె వుంది.

మార్టిన్‌కు తొమ్మిదేళ్ల కూతురుంది. పేరు మేరీ కుట్టి. ఆ అమ్మాయి చంకలో యేడాదిన్నర తమ్ముడున్నాడు. మరో చేతిలో ఓ పొట్లముంది.

"మార్టిన్ అంతా రెడీగా వున్నారా?" మత్తయి అడిగాడు. మార్టిన్ మరియమ్మ వైపు చూశాడు.

"అన్నీ సిద్ధంగానే వున్నాయి. కాని తిరగలి, కోళ్లగూడు ఎలా తీసుకెళ్లాలి? మత్తయి బాబు! మలబార్లో తిరగలి దొరుకుతుందా?"అని మరియమ్మ అడిగింది.

"ఎందుకు దొరకదు, అక్కడ తిరగలికి కావల్సిన మంచి మంచి బండలు

దొరుకుతాయి.''

మార్టిన్, మరియమ్మ, మేరీకుట్టి మత్తయితో కలిసి అతడి పిల్లలున్న చోటికి వెళ్లారు. వీళ్లంతా ఏకమై వర్గీస్ ఇంటికి బయల్దేరారు.

వర్గీస్ తన తొమ్మిది మంద సహచరులతో మార్టిన్, మత్తయిల కొరకు ఎదురుచూస్తున్నాడు.

వర్గీస్ కోటు జేబులోంచి వాచీ తీసి టైమ్ చూశాడు. ''పదకొండున్నర గంటలయింది. సుమారు ఒకటిన్నర గంటకు బస్సు మెయిన్‌రోడ్డు వద్దకు వస్తుంది. అంచేత మనం వెంటనే వేగంగా నడవాలి.''

ఇలా పందొమ్మిది మంది కలిసి ఒక గుంపుగా మలబారు వెళ్లడానికి త్వరత్వరగా రోడ్డువైపు నడవసాగారు. వాళ్లు కొండలోయలో ఎత్తు పల్లాలతో మెలికలు తిరిగిన దారిలో పయనిస్తున్నారు. అక్కడక్కడా గుబురు పొదలు, చెట్లు, రాళ్లు కనిపిస్తున్నాయి. దారి నిర్మానుష్యంగా వుంది. అందుకే వాళ్ల మాటలు గాలిలో ప్రతిధ్వనిస్తున్నాయి. దారి వెంబడే పరస్పరం ఏవేవో మాట్లాడుకున్నారు. ఇక ఏమీ మాట్లాడడానికి లేకపోవడంతో అందరూ అకస్మాత్తుగా మౌనం వహించినట్లుంది. ప్రతి ఒక్కరి వద్దా ఏదో ఒక సామానుంది. తమ తమ బరువులు మోసుకుంటూ ప్రశాంతంగా నడుస్తున్నారు. వాళ్లంతా ఓ కొత్త ప్రదేశానికి తరలి వెళుతున్నారు. వాళ్ల మనసుల్లో ఆ ప్రాంతం గురించి రకరకాల అభిప్రాయాలేర్పడ్డాయి. కొందరికి సంతోషంగా వున్నా కొత్త ప్రాంతం ఎలా వుంటుందో యేమో! అన్న బెంగ ఒక వైపు పీకుతూనే వుంది. వాళ్లంతా పిత్రార్జితమైన ఆస్తిపాస్తుల్ని అమ్ముకొని జేబునిండా డబ్బులు వేసుకొని వెళుతున్నారు. మలబారు నేల వాళ్లకు స్వాగతం పలకడానికి ఎదురు చూస్తోంది.

మలబారులో ఎలాంటి మత కట్టుబాట్లు, కులతత్వ ఘర్షణలూ లేవు. అక్కడ మనుషులు స్వతంత్రంగా అన్నివిధాలా సంతోషంగా జీవిస్తారు. రాజకీయవేత్తల కుతంత్రాలుగాని, వారి తాలూకు చాడీకోరులుకాని అక్కడలేరు. అక్కడ శంఖు ముద్ర[1] ఎదుట తలవంచాల్సిన అగత్యం అసలే లేదు. మలబారులో స్వతంత్రంగా జీవించవచ్చని, నాలుగురాళ్లు వెనక వేసుకొని తమ హక్కులను తాము పొందవచ్చని అందరూ ఆలోచించసాగారు.

1 శంఖుముద్ర - తిరువాన్కూరు రాజముద్రిక

ఇలా వాళ్లు పగటికలలు కంటూ నదులూ కాలువలూ, పొలాలు, కొండలు దాటుకుంటూ ముందుకు వెడుతున్నారు. దారిలో ఎదురుపడే వాళ్లు వేర్వేరు భాషల్లో, అభిప్రాయాలతో వాళ్లని పలకరించి వెళ్లిపోతున్నారు.

మలబారు పల్లెటూళ్లు కూడా తిరువాన్కూరు పల్లెల్లాగా కొండలమధ్య, పొలాలమధ్య వుంటాయా? అక్కడి భాష అర్థం చేసుకోగలమా? అది మలయాళమై వుంటుందా లేక మరేదైనా భాషా? అక్కడ కూడ ఎలుకలబాధ, పోలీసులబాధ తప్పదా? కానీ ఒక్కటి మాత్రం నిజం. అక్కడ 'స్వామి'[2] కిరాతక చర్యలు బొత్తిగా వుండకపోవచ్చు.

వర్గీస్‌కి దారి మధ్యలో ఓ పిలుపు వినిపించింది "వర్గీస్‌బాబు మీరంతా మలబారు పోతే నేనిక్కడ ఎట్లా బతికేది?"

వర్గీస్ నాలుగుదిక్కులా చూశాడు. ఎవరూ కనిపించలేదు. కొంతసేపటికి ఎడ్లబండి వసారా లోపల్నుండి ఓ సన్నటి పొడవుపాటి ముఖం బయటికి కనిపిస్తోంది. చిరునవ్వుతో బయటికి వచ్చిన వరీతకుంజిని చూసి వర్గీస్ హాస్యంగా అన్నాడు. "ఎవరూ? వరీతకుంజా? నువ్వు మలబారొచ్చి ఏంచేస్తావయ్యా?"

"మలబారులో పొలాలన్నీ బంజర్లుగా పడి వున్నాయటగా!"

"కాని అంతదూరం వెళ్లటానికి జేబుఖర్చుకు డబ్బుందా? నీ దగ్గర ఎంత డబ్బుంది?"

"బాబూ! నేను రెండురోజులుగా వుపవాసం. యెవడో పరము పిళ్లె తోటలో పడి కొబ్బరి కాయలు దొంగిలించాడు. కాని పోలీసులు వచ్చి నన్ను పట్టుకున్నారు. మక్కెలిరగదన్ని శిక్ష వేశారు. అంతేకాదు ఇకముందు ఈ యిలాకాలో ఎక్కడ కొబ్బరికాయల దొంగతనం జరిగినా నడుములు విరగదన్ని పిడిగుద్దులతో శిక్ష వేస్తామని బెదిరించారు. బాబూ! నేనిక్కడ బతకటం కష్టమైపోయింది. నేను మలబారు చేరుకునే వరకూ దయచేసి తమరు నా ఖర్చులు భరించండి. దారి ఖర్చులకు మీరుపెట్టిన సొమ్మును కూలీ నాలీ చేసి తీర్చేస్తాను."

వర్గీస్ సిగరెట్టు రగిల్చాడు. మిగతా జనాలు పనసచెట్టు నీడలో నిల్చున్నారు.

---

2. స్వామి - డా॥ సర్ సి.పి. రామస్వామి అయ్యర్. ఆనాడు వారు తిరువాన్కూరు రాజాగారి ప్రధానమంత్రి. కొందరు క్రిష్టియన్ల అభిప్రాయం ప్రకారం స్వామిగారు క్రిష్టియన్ల యెడ బద్ధ విరోధి.

వరీతకుంజి సవినయంగా నిల్చొని వర్గీస్ వైపు ఆశగా చూస్తున్నాడు.

వర్గీస్ సిగరెట్టు పొగను ఒకేసారి నోరు, ముక్కులగుండా వదుల్తూ "దారి ఖర్చులు సుమారు ఇరవై రూపాయలు కావచ్చు. కాని ఇంత సొమ్ము నేను ఏ భరోసాతో నీకిచ్చేది?" అన్నాడు.

"బాబూ! వినండి, ఈ వరీత కుంజి ఛాతీ ఎంత గట్టిదంటే దానిమీద పెద్దపెద్ద బండల్ని కూడ పగలగొట్టొచ్చు. నాకు కేవలం ఉదయం, సాయంత్రం తిండి పెట్టండి చాలు, మీరు నాచేత యే పనైనా చేయించుకోవచ్చు. ఇక్కడ నా పరిస్థితి ఎంత అధ్వాన్నంగా వుందంటే బతకాలన్నా కష్టమే, చావాలన్నా కష్టంగానే వుంది."

వర్గీస్‌కు వరీతకుంజి పట్ల దయ కలిగింది. వరీత కుంజి విశ్వాస పాత్రుడని వర్గీస్‌కు తెలుసు. కూలీ-నాలీ లేక విసిగిపోయాడు పాపం. కాని అతడి కోసం ఇరవైరూపాయలు ఖర్చు చేయాలే? ఫరవాలేదు. తన పొలంలో పనులు చేయించుకోవచ్చు అనే నిర్ణయానికి వచ్చాడు.

"మలబారు వెళ్లింతర్వాత నీవు మరొకడి తోక పట్టుకుని పలాయనం చిత్తగిస్తే..."

"మరేం లేదు, మలబార్లో ఎందరో డబ్బున్న కామందులు కనిపిస్తారు. వాళ్లు నీకు ఎక్కువ కూలి డబ్బులిస్తామని ఆశ చూపించి తమ వైపుకు లాక్కోవచ్చు కదా?"

"వరీతకుంజి అలాంటి ఆశలకు లొంగేవాడు కాదు."

"అలాగైతే సరే, మంచిదే. నువ్వు తక్షణం తయారయ్యి బస్టాండు కొచ్చేయ్."

వరీతకుంజి సంతోషానికి అవధుల్లేకపోయాయి. అతడు ప్రత్యేకించి తయారు కావలసిన అవసరమే లేదు. అతడు తలపాగా తీసి నడుంకు కట్టుకున్నాడు. నడుంకున్న పంచె విప్పేసి తలకు కట్టుకున్నాడు. నడుంకు కట్టిన పంచెను కొంచెం కిందికి దింపి మడత వడిచా మడిచాడు. బీడీ తాగాలని మనసు లాగింది. చెవిలో బీడీ ముక్కకోసం చేయి తడిమాడు. కానీ లేదు. చివరకు వర్గీస్ నోట్లో వున్న సిగరెట్టు ముక్కను అడిగి తీసుకున్నాడు. ఆ సిగరెట్టు ముక్కను నోట్లో పెట్టుకుని వర్గీసు వెంట మలబారు బయల్దేరాడు.

వరీతకుంజి మత్తాయి పిల్లల నెత్తిమీదున్న పెట్టెల్ని బలవంతంగా లాక్కొని తన నెత్తిమీద పెట్టుకున్నాడు. మత్తాయి చేతిలోని పాతగొడుగు తీసుకొని తన

నెత్తిమీదున్న పెట్టెలపైకి చేర్చాడు.

"అలపాట్టాలం కోటె ఆకుట్టి - అవల ఎణపత్తెట్టోల కట్టెణ్ణి కెట్టా..."

(ఆలపాట పల్లె ఒ లింకోట యింటి సుందరి యెలికుట్టి యనభై యెనిమిది కొబ్బరాకులు యెంచి కట్టింది వారి కోసం)

వాళ్లు కొండలమధ్య నడుస్తున్నప్పుడు వరీతకుంజి పల్లె పాట అందుకున్నాడు. కొండలమధ్య అతడి పాట లయబద్ధంగా ప్రతిధ్వనిస్తోంది. పిల్లలు అతడిపాటకు కేరింతలు కొడుతూ గొంతు కలిపారు.

దాదాపు మధ్యాహ్నానికి వాళ్లు బస్సురోడ్డు చేరుకున్నారు. వర్కీ అతడి మిత్రులూ అప్పటికే అక్కడికి చేరుకొని స్పెషల్ బస్సుకోసం ఎదురు చూస్తున్నారు.

సుమారు మూడుగంటలకు ఆవిరితో నడిచే బొగ్గుబస్సు పొగలు కక్కుకుంటూ ప్రాకుతూ అక్కడికి చేరుకొంది. వర్గీస్ కండక్టరుతో మాట్లాడ్డానికి లోపలికి వెళ్లాడు. చాలాసేపటివరకూ వాళ్లిద్దరూ రహస్యంగా మాట్లాడుకున్నారు. చివరకు కండక్టరు వర్గీస్‌తో రాజీకొచ్చాడు. అతడు చిరునవ్వుతో బస్సుదిగి తన మిత్రుల్ని బస్సులోకి సామాన్లు చేర్చమని సైగచేశాడు.

వర్కీ, అతడి సహచరులు పెట్టెలు, మూటలు, సామాన్లన్నింటినీ బస్సుటాప్ మీదికి ఎక్కించారు. వర్గీస్ సహచరులు తమ సామాన్లు బస్సులోకి ఎక్కిస్తుంటే వర్కీ అడ్డగించాడు. కండక్టరు వర్కీని ప్రక్కకు తొలగమన్నాడు.

"ఈ బస్సులో కేవలం మేము, మా సామాన్లు మాత్రమే వెళతాయి" అన్నాడు వర్కీ.

"ఈ బస్సులో ఎవరెవరు వెళ్లాలో నేను చెబుతాను" కండక్టరు జవాబిచ్చాడు.

"నేను అలా జరగనివ్వను." వర్కీ మొండికేశాడు.

"మీరు మరో బస్సు మాట్లాడుకోండి. నేను మిమ్మల్ని ఈ బస్సులో ఎక్కనివ్వను." కండక్టరు తన నిర్ణయం తెలియజేశాడు.

వర్కీ కంగుతిన్నాడు. ఇక్కడ కోపతాపాలవల్ల లాభం లేదనే నిర్ణయాని కొచ్చాడు. ఆ బస్సులో వెళ్లకపోతే వాళ్లు అదేచోట మరో రెండు రోజులపాటు పడిగాపులు కాయాల్సి వుంటుంది. పైగా యాభైరూపాయలు జేబు ఖర్చవుతుంది.

చివరకు వర్కీ తన ఓటమిని అంగీకరించాడు. అతడు కండక్టరును నానా బూతులు తిడుతూ బస్సులోకి సామాను ఎక్కించాడు.

అలా ఆ చిన్న బస్సులో నలభైనలుగురు యాత్రికులు, ఇరవై కుటుంబాలకు సరిపడ్డ ఇంటి సామాన్లు కుక్కివేయబడ్డాయి. బస్సు క్షయ వ్యాధిగ్రస్తునిలా రొప్పుతూ రోజుతూ ముందుకు సాగింది.

గోధూళి వేళ తమ ప్రాంతానికి అంతిమ వీడ్కోలు చెప్పి ప్రస్థానమయ్యారు. వాళ్లు రాత్రికి ఆలువా రైల్వేస్టేషన్ చేరుకొని ఆ రాత్రి అక్కడే గడిపేశారు.

## మూడు

మలబారుకు తూర్పు దిక్కు కొండలోయలో ఓ చిన్న గ్రామం. లోయ మైదానంలో అక్కడక్కడ దట్టమైన గుబురు పొదలు. కొండ అరటి, వెదురు పొదల నీడల్లో గడ్డి, గాదంతో వేసుకొన్న కొన్ని గుడిశెలు కనిపిస్తున్నాయి.

ఆ పల్లెకు దక్షిణంవైపు పరచుకొన్న కొండలమధ్య ఓ విశాలమైన గుట్ట వుంది. ఆ గుట్టమీద ఓ ఎత్తైన మేడ. దాని పైకప్పు కొబ్బరి ఆకులతో కప్పబడి వుంది. ఆ మేడ ఆ ప్రాంతానికంతటికీ పెద్ద జమిందారైన ఆలత్తుం కాట్టిలకుంజిబుకు రూపుగారిల్లు. వెల్ల వేయని గోడలు, దుమ్ముపట్టిన కిటికీలుగల ఆ యింటిముందు విశాలమైన ముంగిలి. ముంగిలికి నాలుగువైపులా ఏడు అడుగుల ఎత్తున్న మట్టిగోడ కనిపిస్తుంది. దక్షిణపుమూల కల్లము, తూర్పుభాగాన మట్టి గోడంత ఎత్తున రచ్చబండ వుంది.

మేడకు తూర్పు, దక్షిణభాగాన వరండాలను కవరుచేస్తూ చిన్నగోడలు, ఆ గోడంత ఎత్తున అరుగులు కట్టించారు. దక్షిణంవైపు వరండా మధ్యలో మంటవేశారు.

ఈ వరండా అరుగుమీదే కుంజిబుకురూపు కూర్చొని తాంబూలం నములుతున్నాడు. అతడి గుమాస్తా కుంజిప్పనంబియార్ తన యజమాని ముందు తల వంచి నిలుచొని భూముల రిజిస్ట్రేషన్ పత్రాలు చదువుకు పోతున్నాడు.

"ఇక పాతరేటుకు భూమి అమ్మకూడదు," అన్నాడు గుమాస్తా.

"కాలం మారింది. ప్రతిరోజూ వేలసంఖ్యలో చట్టన్లు వలస వచ్చేస్తున్నారు. వాళ్ల దగ్గర బోల్డంత డబ్బు కూడ వుంటుంది. యిక్కడ వాళ్లు శాశ్వతంగా వుండిపోవడానికి వస్తున్నారు గనుక భూమిని ఏ రేటుకైనా కొనడానికి సిద్ధంగా వుంటారు. అలాంటప్పుడు వాళ్లకి చవగ్గా భూమిని ఎందుకు అమ్మాలి?"

జమిందారు దగ్గి కేకరించి అందమైన రాగి వుమ్మిపాత్రలో గంలం వూశాడు.

తన గుమాస్తావైపు తీక్షణంగా చూస్తూ యెంగిలి పాత్రను క్రిందపెట్టాడు.

"కుంజప్ప చెప్పింది నిజమే, భూమి ఖరీదు పెంచాలి. కాని ఎంత పెంచాలి?"

"భూమిని ఎకరా అయిదు రూపాయలకు బదులుగా పదిరూపాయలకు అమ్మాలి."

"ఈ ధర ఎక్కువ అవుతుంది. మనం పదికి బదులు ఏడు రూపాయలు చేయాలి. లేకపోతే వీళ్లు వేరే జమీందార్లను ఆశ్రయిస్తారు."

"మరేం పరవాలేదు, పదిరూపాయల చొప్పునే తీసుకొందాం మనం."

"వీళ్లు మరోచోటికి వెడితే వెళ్లనీ. మనకేమిటి బాధ? మనం కొంతకాలం ఓపిక పడితే చాలు. కొండ భూములకైనా కొంత హద్దు అంటూ వుంది కదా. వీళ్లేమో వేల సంఖ్యలో తరలి వస్తున్నారాయె."

"చెట్టన్లు[1] కులం తక్కువ వారని విన్నాను. వీళ్లు మన యిలాకాని పాడు చేస్తారు."

"ఇందులో మనకు నష్టమేముంది? వాళ్లు యెలా బ్రతికితే మనకెందుకు? కీకారణ్యాల్ని నరికి వ్యవసాయభూములుగా తయారు చేయాలంటే వీళ్ల అవసరం మనకుంది. అడవుల్ని నరికి సాగు చేయడంలో వీళ్లు చాలా నేర్పరులు. వళ్లు దాచుకోకుండా కష్టపడతారు. మనవాళ్లు నలుగురు చేసే పనిని వీళ్ళు ఒక్కరే చేయగలరు."

రామ కురూపు కలుగజేసుకొని "వీళ్ళంతా తిరువాన్కూరు నుండి బహిష్కరింపబడ్డవాళ్లట. ఇది నిజమేనా?" అని అడిగాడు.

"తెలీదు. వీళ్లలో చాలామంది పచ్చి మోసగాళ్లు పోకిరీ వెధవలని విన్నాను."

"కుంజప్పా! అందుకే నే చెప్పాను - వీళ్లు చొరబడ్డానికి అవకాశమిస్తే ఈ రాజ్యాన్ని కూడ పాడుచేస్తారు. వీళ్లు లావాదేవీలకు కూడ పనికిరాని మనుషులని తెలిసింది. మన పొరబాటు మూలంగా మెల్లమెల్లగా వీళ్లు మన దేశాన్ని ఆక్రమించి చివరకు మనమే పారిపోవాల్సిన పరిస్థితులు వస్తాయేమో! కొద్దిరోజుల క్రిందట

1. చెట్టన్ : ఈ మాటకు అర్థం పెద్దన్న. మధ్య తిరువాన్కూరు క్రిస్టియన్లు తనకంటె పెద్ద వయసుగల మగవారిని 'చెట్టన్' అని గౌరవ సూచకంగా పిలుస్తారు. మలబారుకు వలస వెళ్లిన వీళ్లని మలబారు వాళ్లు - 'చెట్టమార్' (చెట్టన్లు) అని పిలిచేవారు.

తిరువాన్కూరు నుండి ఓ పెద్దమనిషి వచ్చాడు. బహుశా పిళ్లే కావచ్చు. అతడే చెప్పాడు. ఈ కిరస్తానీలు తిరువాన్కూరులో నానా బీబత్సం చేశారట! వీళ్లు అక్కడి హిందువుల్ని బలవంతంగా క్రిష్టియన్లుగా మార్చేస్తున్నారట! అదే పని వీళ్ళు ఇక్కడా చేస్తే? వీళ్లు మన గుళ్లూ గోపురాల్ని మయిలపరచవచ్చు. ఇక్కడి పణియర్లు,[2] మలయర్లకు[3] ఆశ చూపించి కిరస్తానులుగా మార్చేస్తారేమో చూడండి. ఇదంతా ఆలోచిస్తుంటే భయమేస్తోంది.''

కుంజప్ప నంబియార్ బదులు మాట్లాడలేదు. అతడికి కావలసిన దస్తావేజులు దొరికాయి. అందుకే అతడు ఇంతవరకూ జరిగిన సంభాషణ మరచిపోయి వుత్సాహంగా దస్తావేజులు చదువసాగాడు.

''ఇది పులియోడెన్ కొండ తాలూకు దస్తావేజు. కాని ఇందులో పులియోడెన్ పొలాలగురించి ఒక్కముక్క గూడ రాయలేదు. ఒక్కటి మాత్రం నిజం. పులియోడెన్ కొండతో పాటే పొలం కలిసి వున్నట్లు విదితమౌతోంది. ఆ పొలమ్మీద కనాట్టు నంబియార్‌కు ఏమాత్రం హక్కులేదు. ఆ పొలం కలియంపారా కొండకు దగ్గరగా కూడా లేదు.''

''కుంజప్పే కదా చెప్పింది - కారనాట్టు నంబియార్ ఆ పొలం చుట్టూ కంచె వేశాడని?''

''సరే కానివ్వండి. భూ ఆక్రమణలక్రింద కారనాట్టు నంబియార్‌పైన కోర్టులో దావా వేయాల్సివుంది.''

దావాలు, కోర్టులు పేరు వినగానే ఆ జమీందారు ముఖం కోపంతో ఎర్రగా కందిపోయింది. వ్యాజ్యంలో గెలుస్తామా లేక ఓడిపోతామా అనేది ముఖ్యంకాదు, కాని కోర్టులో తమ కేసులు కొన్ని నడుస్తున్నందుకు జమిందారుకి గర్వంగా వుంది. గుమాస్తా తెలివితేటలు అతడు బనాయించే కోర్టు కేసుల సంఖ్య మీద ఆధారపడి వుంటాయని కుంజుబుకురూపుగారి నమ్మకం.

''కుంజిప్పా! అయితే రేపే కోర్టులో కేసు వెయ్యాలి. కారనాట్టు నంబియార్‌కి గట్టిగా బుద్ధి చెప్పాలి.'' జమీందారు ఆవేశంగా అన్నాడు.

2-3. పణియర్, మలయర్ - కేరళ అడవుల్లో నివసించే కొండజాతి వారు. వీళ్లు జమిందార్ల పొలాల్లో వ్యవసాయం చేసేవారు. బదులుగా కొద్దో గొప్పో డబ్బులు ముట్టేవి. వీళ్లకు ఎప్పుడైనా ఆపద వస్తే జమిందార్లు అన్నివిధాలా సహాయపడేవారు.

"బాబుగారు, ఏజంటు కొచ్చువరీత్ చెట్టన్ వస్తున్నాడు." కుంజిప్ప నంబియార్ తలుపువైపు చేయి చూపించాడు.

నల్లగా, లావుగా, పొట్టిగా వున్న బట్టతల మనిషి ముంగిలి దాటి వరండాలోకి చేరుకున్నాడు.

"కూర్చోండి కొచ్చువరీత్‌గారు." జమీందారు కుర్చీ చూపించాడు.

"ఏంటి, కొత్తవాళ్లెవరైనా వచ్చారా?"

"వచ్చారు, కాని పదిహేను మందే."

కొచ్చు వరీత్ నవ్వుతూ చెప్పాడు.

"అయితే తమ చేతికి బాగానే తగుల్తుంది." కొత్త ఆశలు ఫలించ బోతున్నాయనే సంతోషంతో అన్నాడు జమీందారు.

"జమీందారుగారు, మీరు అనుకున్నంతగా ముట్టకపోవచ్చు. అంతా పేదవాళ్లు. ఒక్కోడి దగ్గర రెండు - మూడు వందలే వుంటాయి. అంతకుమించి లేదు."

"యేమైతేనేం మీకు కనీసం మూడువేలైనా దక్కుతుంది."

వెంటనే వాళ్లు అసలు విషయంలోకి వచ్చారు. కుంజిప్ప నంబియార్ కూడ మధ్య మధ్యలో తన సలహాలందిస్తున్నాడు. ఎకరా ఏడు రూపాయలు చొప్పున మూడున్నర వందల ఎకరాల భూమి కొచ్చువరీత్ సహాయంతో అమ్ముడయ్యింది. దస్తావేజుల్లో ఎకరా పదిరూపాయల చొప్పున నమోదయింది. ఈ లావాదేవీలో కొచ్చు వరీత్‌కు వెయ్యిరూపాయలు లాభించింది. అతడు కుంజిప్ప నంబియార్‌కు వంద రూపాయలు లంచమిచ్చాడు. నియమానుసారంగా మధ్యవర్తిత్వం జరిపినందుకు కొనుగోలుదారుల నుండి నూట యాభైరూపాయల కమీషన్ లభించింది.

ఇలా భూమి లావాదేవీల ఏజంటుగా కొచ్చువరీత్ బాగా డబ్బు గడించాడు. అప్పుడప్పుడు అతడు తిరువాన్కూరు వెళుతుంటాడు. అక్కడ మలబారు భూముల ఫలసాయాన్ని గూర్చి, అక్కడి భోగభాగ్యాల గురించి ఉపన్యాసాలిస్తూ ఇతర ఏజెంట్ల ద్వారా ప్రచారం చేయిస్తుంటాడు. నిరుపేద ప్రజానీకాన్ని మలబారు తరలించేందుకు యెన్నెన్నో పేరాశలు గుప్పిస్తుంటాడు. అంతేకాదు మలబారు వెళ్లేందుకు అక్కడ భూములు కొనడానికి అప్పులు యిప్పించే ఊబిలో జనాల్ని ఇరికిస్తుంటాడు. ఆ తర్వాత కొత్త ఆసాముల కోసం తిరువాన్కూరు వెళతాడు. ఇలా అతడి పని నిరంతరం

నిర్విఘ్నంగా కొనసాగుతుంటుంది.

కొచ్చు వరీత్ ఒక దళారి కావడం చేత అతడు మలబారులో వుండటం జమీందారు కుంజిబుకురూపుకు, కుంజప్ప నంబియార్‌కు చాలా లాభసాటిగా వుండేది. అందుకే అతణ్ణి తమ దగ్గర వుంచుకోవడానికి శాయశక్తులా ప్రయత్నించేవారు. ఎవరూ కళ్లజూడని కొండభూముల్ని వేల రూపాయల్లో అమ్మించి వాళ్లకు ఎనలేని లాభాన్ని కలుగజేశాడు.

కొచ్చువరీత్ ఒక లక్షాధికారయ్యాడు. అతడి మాయలో పడ్డ తిరువాన్కూరు పేద కుటుంబాలు - ఆ కొండ భూముల్లో నలిగిపోతూ, వారి దురదృష్టాన్ని తిట్టుకుంటూ అక్కడే గడ్డీగాదంతో వేసుకొన్న గుడిసెల్లో బతుకులు వెళ్లబోసేవారు.

## నాలుగు

వర్కీ తన సహచరులతో పాటు తలరోరీ[1] నుండి ఒక స్పెషల్ ట్రక్కులో మలబారు కొండ ప్రాంతానికి చేరుకున్నాడు. వాళ్లు ట్రక్కు నుండి కింద కాలు మోపారో లేదో, ఓ వింత సంఘటన జరిగింది.

ఓ అల్లరి కుర్రాడు సిగరెట్టు పెట్టెలో వుండే కాకి బంగారం తీసి కొన్ని నాణేలకు చుట్టాడు. ఆ నాణేల్ని దోసిట్లో గిలకరిస్తూ అరుస్తున్నాడు. అతడు వర్కీని సమీపించి "బాబుగారు! 'కొంత'[2] కావలిస్తే తీసుకోండి. పావలాకు నాలుగు." అన్నాడు. వాడి మాటలు విని అక్కడ నిల్చున్న వారంతా గొల్లున నవ్వారు.

"అరె! చచ్చిన ఆవు మాంసం[3] వ్యాపారం మొదలెట్టండి. ఆ వ్యాపారం చాలా బాగ జరుగుతుందిక్కడ."

వర్కీ కుర్రవాడు చేసిన ఎగతాళిని జీర్ణించుకోలేకపోయాడు. చాలా కోపం వచ్చింది. వర్కీ ఈ ఎగతాళికి ప్రతీకారం తీసుకుతీరాలని పట్టేసుకున్నాడు.

---

1. తలరోరి - మలబారును ఆనుకొని వున్న కొచ్చిన్ రాజ్యపు చివరి జిల్లా.
2. కొంత - ఓ రకమైన లాకెట్టు. దానిమీద క్రాసు మరియు ఏసుక్రీస్తు చిహ్నం ముద్రించి వుంటుంది సాధారణంగా ఈ లాకెట్టు (కొంత)ను క్రిష్టియన్లు ధరిస్తారు.
3. చచ్చిన ఆవు మాంసం - ఇది ఓ అపహాస్యం. ఆ రోజుల్లో క్రిష్టియన్లు చచ్చిన ఆవు మాంసాన్ని తినేవారు. మలబారు హిందువులకు ఇది చాలా జుగుప్సాకరమైన విషయంగా వుండేది. అందుకే హిందువులు ఆవు మాంసం పేరుతో క్రిష్టియన్లను అపహాస్యం చేసేవారు.

"సమయం దొరికినప్పుడు వీళ్లకి సరైన గుణపాఠం చెబుతాను."

ఈవిధంగా వర్కీకి మలబారు మనుషులమీద పగ ఏర్పడింది.

సాయంత్రమయ్యింది. జనాలు ట్రక్కునుండి దిగి వారి వారి సామాన్లు దించుకున్నారు. ట్రక్కు వెనక్కి వెళ్లిపోయింది. వర్కీ తన సహచరులతో రోడ్డుప్రక్కన నిల్చున్నాడు.

వర్కీ బంధువు వరీత్ కుంజు చాలాకాలం క్రితం మలబారు వచ్చి సెటిల్ అయ్యాడు. వర్కీ తిరువాన్కూరు నుండి బయల్దేరడానికి రెండురోజుల ముందే తాను మలబారు వస్తున్నట్లు వుత్తరం రాశాడు, నీవు మెయిన్‌రోడ్డు మీదికి వచ్చి మా కోసం ఎదురుచూడమని కూడ తెలిపాడు. కాని వరీత్‌కుంజు రాలేదు. కనీసం తెలిసిన ముఖం కూడ కనిపించలేదు.

ఆ రోడ్డు ప్రక్కన ఓ సాయిబు టీ కొట్టుంది. వరీత్ కుంజు భార్య మలేరియా వ్యాధితో చచ్చిపోయిందని, అతడి ఇల్లు ఇక్కడికి తొమ్మిది మైళ్ల దూరంలో వుందని ఆ కొట్టువాడు చెప్పాడు. అతడి మాటలు వర్కీకి చాలా బాధ కలిగించాయి.

వర్కీ సహచరులు తమ సామాన్లన్నీ సర్దేసి అక్కడే కూర్చున్నారు. ఎక్కడికెళ్లాలి, ఏం చేయాలి దేవుడా, అని దిగులుగా ఆలోచిస్తున్నారు.

అందరూ చాలా అలసిపోయారు. వాళ్లు ఒక్క అడుగుకూడ ముందుకు వేయడానికి సిద్ధంగాలేరు. దారీతెన్నూ తెలియని ఆ క్రొత్త ప్రదేశంలో ఏమిచేయాలో తెలియక సందిగ్ధంలో పడ్డారు.

సూర్యుడు అస్తమించాడు. పొదళ్లలో దాగిన చీకట్లు మెల్లమెల్లగా నలువైపులా కమ్ముకోసాగాయి. అడవి జంతువుల అరుపులు భయాన్ని కలుగజేస్తున్నాయి.

కొంతసేపటికి కాకీ చొక్కా, తెల్లనిక్కరూ వేసుకొన్న ఓ యువకుడు నవ్వుతూ వర్కీకి దగ్గరగా వచ్చాడు.

"వరీత్ చట్టన్ ఇక్కడికి తొమ్మిది మైళ్ల దూరంలో వుంటున్నారు. మీరు ఈరోజు రాత్రికి నా గుడిసెలో బస చేయండి. ఇక్కడ నేను ఒక్కడినే వుంటున్నాను. రేపు ఉదయాన్నే నేను మిమ్మల్ని వరీత్ చట్టన్ ఇంటికి తీసుకువెడతాను."

వర్కీ ఆ యువకుడివైపు చూశాడు. అతడు చాలా అందంగా, చురుగ్గా పొడవైన యువకుడు. మాటల్ని బట్టి అతడు తిరువాన్కూరు నివాసి అని తెలుస్తోంది.

"మీది ఏ వూరు?" వర్కీ ఆ కుర్రవాణ్ణి అడిగాడు.

"మా వూరు కుములీ దగ్గరుంది. మీ వూరు?"

"మాది ముంటక్యం. ఇక్కడ నీవు ఒక్కడివే వుంటున్నావా?"

"ఔనండి! మా వూళ్లో మాకు కొంత పొలం వుంది. ఇక్కడి వ్యవసాయం నేను చూసుకుంటాను. మా చిన్నాన్నగారు ఇక్కడికి నాలుగు మైళ్ల దూరంలో వ్యవసాయం చేసుకుంటున్నారు. మీరంతా నా వెంటరండి."

అంతా లేచి అతడి వెంట నడిచారు.

నిజం చెప్పాలంటే అతడి ఆహ్వానం వాళ్లకు కొండంత శాంతిని సమకూర్చింది. వాళ్లు పెట్టే, బేడా తీసుకొని ఆ యువకుడి వెంట నడిచారు.

"నీ పేరేంటి?"

"ఏంతోని."

"ఏంతోనీ, నీ వయసెంత?"

"పదిహేడేళ్లు."

ఏంతోనీ కొంచెం సిగ్గుపడుతూ మందహాసం చేస్తూ వాళ్లకు ముందు నడుస్తున్నాడు.

"మీ గుడిసె చేరడానికి ఇంకా చాలాదూరం వెళ్లాలా?" వర్కీ అడిగాడు.

"లేదండీ! ఎదురుగ్గా వున్న కొండ దాటుతూనే మా తోట వచ్చేస్తుంది."

ఆ కొండమీద చిక్కని చీకట్లు కమ్ముకున్నాయి. చీకట్లో దారి వెదుక్కుంటూ ఓ కాలిబాట పట్టుకొని మెల్ల మెల్లగా ముందుకు నడవసాగారు.

"ఇక్కడ పులులూ-గిలులూ ఏమైనా వున్నాయా?" వర్కీ భయపడుతూ అడిగాడు.

"వుంటే వుండొచ్చు. కాని మీరు భయపడాల్సిన పన్లేదు. అవి మనుషులమీద పడవు."

వర్కీ టార్చిలైటు వేశాడు. పిల్లల్నీ, ఆడవాళ్లనీ మధ్యలోకి చేర్చాడు. అతడు సంచిలోంచి ఓ పొడవుపాటి కత్తి బయటికి తీశాడు. అందరికంటే ముందు ఏంతోనీ, చిట్టచివర వర్కీ నడుస్తున్నారు.

అర్ధగంట నడిచిన తర్వాత వాళ్లంతా ఏంతోనీ ఇంటికి చేరుకున్నారు.

ఏంతోనీ గుడిసె లోపలికి వెళ్లి దీపం వెలిగించాడు. వాళ్లు తమ సామాన్లన్నీ

వరండాలో వుంచారు. అక్కడే పడుకొనే ఏర్పాటు చేసుకోసాగారు.

ఏంతోనీ గుడిసెకు పడమటివైపు వరండాలోకెళ్లి అన్నం వండే ప్రయత్నం చేస్తున్నాడు.

"ఏంతోనీ, అక్కడ ఏం చేస్తున్నావు?" వర్కీ నడుంవాలుస్తూ అడిగాడు.

"కొద్దిగా గంజి వండుతున్నాను."

"నీకు మాత్రమే చేసుకో, మాకు ఆకలిగా లేదు."

"ఏం ఫరవాలేదు. మీరు చాలాదూరం ప్రయాణంచేసి అలసిపోయారు."

"అలసిపోవడం మాట నిజమే, కానీ ఆకలిగా లేదు, మేము ట్రక్కు ఎక్కబోయేముందు తలరోరీలో ఓ హోటల్లో బాగా భోంచేసి వచ్చాం."

"మీ కంటే ఆకలిగా వుండకపోవచ్చు. కానీ పిల్లలకు ఆకలేస్తుంటుంది. వాళ్లకి రాత్రిపూట తినడానికి ఏదో ఒకటి కావాలి కదా. ఏమైనా నేను మిమ్మల్ని నా గుడిసెలో ఆకలి కడుపుతో పడుకోనివ్వను. ఇక్కడ కావలసినన్ని బియ్యమున్నాయి. కర్రలున్నాయి. వండడానికి మాత్రం కొంత టయిమ్ తీసుకుంటుంది." ఏంతోనీ పొయ్యి రాజేస్తున్నాడు.

"సరే అలాగైతే ఏంతోనీ, నీవొక్కడివే శ్రమ పడొద్దు. అనికుట్టీ! నీవు కూడ వెళ్లి ఏంతోనీకి సహాయం చెయ్యి."

ఆడవాళ్ల మధ్యనుండి ఓ అందమైన యువతి మెల్లగా లేచి నిలబడింది. సుమారు పధ్నాలుగేళ్లుండొచ్చు. కాని చూడ ముచ్చటగా వుంది. లేచి తలవెంట్రుకలు ముడి వేసుకొంది. అరవిచ్చిన కన్నులతో చిరునవ్వును దాచుకుంటూ ఏంతోనీ దగ్గరకు చేరింది. ఏంతోనీ వంట వండమని చెబుతాడని ఆమె ఎదురు చూస్తోంది.

ఏంతోనీ ఆమె వైపు చూశాడు. ఆమె చిర్నవ్వుతో పెదవుల మధ్య ముత్యాల్లాంటి పలువరుస దర్శనమిచ్చింది. క్రిందికి చూపులు మరల్చి "అన్నం నేను వండుతాను" అంది.

మరోవిధంగా చెప్పాలంటే మీరు దయచేసి అక్కడి నుండి లేచి వెళ్లండని ప్రార్థిస్తున్నట్లుంది. ఏంతోనీకి ఆమె లేచి రావడం బాధాకరంగా వుంది. ఎందుకంటే ప్రయాణంలో ఆ అమ్మాయి కూడ అలసిపోయుంటుంది. అలాంటప్పుడు ఆమెచేత వంట వండించడం అతడికి యిష్టంగాలేదు. కానీ ఆమె చేసే సహాయాన్ని నిరాకరించలేక పోయాడు. పొయ్యి దగ్గర్నుండి మాట్లాడకుండా వైదొలిగాడు.

అనికుట్టి తన అందమైన కళ్లతో ఏంతోనీని చూసింది. మరోమారు చిరునవ్వు నవ్వింది. అందమైన పలువరుస తళుక్కుమంది. తలవంచి పొయ్యి వూదసాగింది. అనికుట్టి కళ్లల్లో ప్రయాణం తాలూకు అలసట కనిపిస్తున్నప్పటికీ ఆమె ముఖంలో దయ, భీతి భావాలు ప్రస్ఫుటించాయి. ఆమె ముఖం ఓ లేడిపిల్ల ముఖంలా అమాయకంగా వుంది. ఆమె వుంగరాల జుత్తు మాసి చిక్కుపడిపోయింది. పొయ్యి మంట వెలుతురులో ఆమె ముఖానికి ఎడమభాగాన ఓ చిన్న నల్లటి మచ్చ ఆమె ముఖానికి ఎంతో అందాన్నిచ్చింది.

ఎంతోనీ ఓరకంట గమనిస్తున్నాడు. ఎదుటివ్యక్తికి తెలియకుండా దొంగచాటుగా చూట్టం తప్పని అతడికి గ్లాని కలిగించింది.

ఏంతోనీ వంటగది దగ్గర కూర్చొని త్వరత్వరగా కర్రపెండలం తొక్క తీయసాగాడు.

"గరిట ఎక్కడుంది." అనికుట్టి ఏంతోనీని అడిగింది.

"ఎదురుగా వున్న ఎదురుబొంగు దగ్గర గోడమీద వుంది." అనికుట్టి లేచి గరిట తెచ్చింది.

"బియ్యం ఎక్కడున్నాయి?" ఆమె మళ్లీ అడిగింది.

"ఎదురుగ్గా రాగి గిన్నెలో వున్నాయి."

రాగిగిన్నె తీసుకొని బియ్యం కడగడానికి ఇంటి ముంగిలివైపు వెళ్లింది. బియ్యం కడిగి తిరిగి వచ్చింతర్వాత యథాప్రకారం తలవంచుకొని కూర్చొంది. కర్రపెండలం కోస్తున్న ఏంతోనీ మనసులో యేవేవో కొత్త వూహలు చెలరేగాయి.

వాళ్లిద్దరూ ఒకే వూరు, ఒకే కులం వాళ్లైనా అతడు అనికుట్టిని చూసిందిప్పుడే. వాళ్లు పుట్టింది ఒకచోటే, కాని కలుసుకున్నది తమ వూరికి రెండువందల మైళ్ల దూరంలో మలబారు కొండ ప్రదేశంలో. వాళ్ళ కలయిక ఎలా వుందంటే విడిపోయిన భార్యా భర్తలు అనుకోకుండా ఓ నాట్యశాలలో కలుసుకున్నట్లుంది.

వర్కీ, అతని సహచరులు గాఢనిద్రలోకి జారుకున్నారు. కేవలం వాళ్ళిద్దరూ యువతీ, యువకుడూ మేల్కొని వున్నారు. నిజం చెప్పాలంటే వాళ్లిద్దరి హృదయాల్లో ఎన్నో చెప్పుకోవాలనీ, వినాలనీ కోరికగా వున్నా ఏమీ మాట్లాడుకోలేక పోయారు. వాళ్ల మనసులు చెప్పుకోలేని ఆవేదనకు గురయ్యాయి.

వాతావరణం అంతా ప్రశాంతంగా వుంది. మండే కర్రల తాలూకు చప్పుళ్లు

కూడ స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"వర్కీగారు మీ నాన్నగారా?" చాలాసేపటికి తర్వాత ఏంతోనీ నోరు విప్పి అనికుట్టీని అడిగాడు.

"కాదు," తలవూపి క్రిందికి చూస్తూ అంది.

"వీళ్లు మా తల్లిదండ్రులు కాదు. దూరపు బంధువులౌతారు."

"నాకూ తల్లిదండ్రులెవ్వరూ లేరు." ఏంతోని కరుణస్వరంతో అనికుట్టికి తనను పరిచయం చేసుకున్నాడు.

"మా చిన్నాన్నే నన్ను పెంచి పెద్ద చేశాడు."

అనికుట్టి దయాభావంతో ఏంతోనీని చూసింది.

ఏంతోనీ కూడ అనికుట్టిని కన్నార్పకుండా చూస్తూ వుండిపోయాడు.

"మా చిన్నాన్న నన్నొక్కడినే ఇక్కడ వదిలేసి ఆయన వేరేచోట వుంటున్నారు."

"అమ్మో! మీరు ఈ కొండల్లో ఒక్కరే వుంటున్నారా?" అనికుట్టి కళ్లల్లో ఆశ్చర్యంతో పాటు కరుణ తొణికిసలాడింది.

వాళ్లిద్దరూ అనాథలు. అందుకే రెండుగంటల పాటు తమ దీన గాథల్ని చెప్పుకున్నారు.

అన్నం, కర్రపెండలం వుడుకుతూనే వర్కీని అతడి సహచరులను భోంచేయడానికి నిద్ర లేపాడు.

వాళ్లు వరండాలో కూర్చుని అన్నం, కర్రపెండలం తినసాగారు. వర్కీ అన్నం తింటూ ఎదురుగా కనిపించే కొండలోయలో వున్న గుట్టవైపు చేయి చూపించి ఏంతోనీని అడిగాడు. "అక్కడ కూడ మనవాళ్లే వుంటున్నారా?"

"లేదు." ఏంతోనీ జవాబిచ్చాడు.

"అక్కడ జమీందారు ఇల్లుంది. అతడి గుమాస్తా కృష్ణన్ నంబియార్ ఇల్లు కూడా అక్కడే వుంది."

మరుసటిరోజు తెల్లవారక ముందే వర్కీ అందర్నీ నిద్రలేపి వరీత్ ఇంటికి బయల్దేరారు. ఎంతోనీ వాళ్లకు దారి చూపిస్తున్నాడు.

అక్కడి ప్రకృతి దృశ్యాలు వర్ణనాతీతంగా వున్నాయి. పచ్చని పంట పొలాలు, పాలు పోసుకున్న వరిపంట ప్రకృతి సౌందర్యానికి వన్నె తెస్తున్నాయి. సశ్యశ్యామల మైన పొలాల్ని చూసి వర్కీ ఏంతోనీని అడిగాడు.

"ఇదంతా మీ పొలమేనా?"

"ఔను," ఏంతోనీ వినమ్రంగా చిరునవ్వుతో తలవంచుకొని జవాబు చెప్పాడు. "అంతా దేవుని దయ. మాకు మొత్తం ముప్పై ఎకరాల భూమి వుంది. అందులో పదిహేను ఎకరాల భూమి చాలా సారవంతమైంది."

ఏంతోనీ వెనుకవైపు చూశాడు. అనికుట్టీ కళ్లు కలిశాయి. పదిగంటలకల్లా వరీత్ గుడిసె చేరుకున్నారు. గుడిసె ముందు మంచం మీద ఓ మనిషి పడుకొని వున్నాడు. అతడే వరీత్. మాటలు వింటూనే వరీత్ లేచి నిల్చున్నాడు. కాని జబ్బుపడ్డాడు. జబ్బు మూలంగా చాలా చిక్కిపోయాడు.

పాపం వరీత్ పదిరోజులుగా మలేరియాతో బాధ పడుతున్నాడు. పాలిపోయిన కళ్లు తెరచి బాధగా అన్నాడు. "చూడు నాగలి, నేను పది రోజుల్నుంచీ జబ్బు పడ్డాను"

## ఐదు

వరీత్ ఆ భూమిని ఆనకధం యూసఫ్ వద్ద కొన్నాడు. యూసఫ్‌కు చాలా భూమి వుండేది. అందులోనుండి కొద్దికొద్దిగా భూమిని కొత్తవారికి అమ్మేవాడు. సాగు చేసుకోవడానికి కావలసిన డబ్బు కూడ అప్పుగా ఇచ్చేవాడు.

యూసఫ్ తన కుటుంబంతో పాటు 1940లో మలబారు చేరుకున్నాడు. ఇప్పుడతడు చాలా ధనవంతుడయ్యాడు.

1938లో తిరువాన్కూరు సంప్రదాయ హిందువులు క్రిష్టియన్లను నానా బాధలు పెట్టేవారు. ఆ బాధలు భరించలేక వాళ్లు తిరువాన్కూరు నుండి పారిపోయి మలబారు చేరుకున్నారు. అదేవారి పాలిట వరమై కూర్చొంది.

యూసఫ్ మొదట అడివిలో భూమిని కొన్నాడు. దాన్ని తవ్వించి, నాగలితో దున్నించి సారవంతమైన సాగుభూమిగా తయారుచేశాడు.,కొంతభూమిలో చెట్లూ, తోటలూ పెంచాడు. మరికొంత పొలంలో పైర్లు పండించేవాడు. ఓ తోట మధ్యలో బంగళా కట్టించుకున్నాడు. ఏమైతేనేం యూసఫ్ నేడు ధనవంతుల్లో ఒకడుగా గుర్తింపు పొందాడు.

వరీత్ సలహా మేరకు పర్కీ అక్కడ నివసించడానికి యూసఫ్ సహాయాన్ని అర్థించాడు. యూసఫ్ అందుకు అంగీకరించాడు.

"నేను నీ విషయంలో ఆలోచిస్తాను." యూసఫ్ చెప్పాడు. "రామకిటావును పిలిపించి మాట్లాడతాను."

"పాతంగ కోట జమీందారుగారి భూములు అమ్మకానికి వున్నట్లు విన్నాను."

"మేము భూమి కొనేంతవరకూ వుండేందుకు కొంత స్థలం చూపించండి."

"అట్లే చేద్దాం. పడమటివైపు కొండలోయలో కొన్ని గుడిసెలు ఖాళీగా వున్నాయి. మీరు అక్కడ వుండొచ్చు."

ఇలా వర్కీ తన కుటుంబంతో పాటు పడమటివైపు కొండలోయలో వున్న ఓ వెదురు గుడిసెలో బసచేశాడు.

వర్కీ స్నేహితుడు చాకో, యూసఫ్ వద్ద యాభై ఎకరాల భూమికొని వ్యవసాయం చేస్తున్నాడు. వర్కీ మరో స్నేహితుడు ఆరువందల ఎకరాల భూమిని కొన్నాడు. తక్కిన వాళ్ళంతా వర్కీతోపాటే వుండేవారు.

## ఆరు

వర్కీ మలబారు చేరుకున్న మరసటిరోజే వర్గీసు అతడి సహచరులు ఆ కొండ ప్రాంతాన్ని చేరుకున్నారు. మొదటి వాళ్లు యూసఫ్ తోటకు రెండు మైళ్ల దూరంలో నున్న ఓ కొండ మీదికి వెళ్లారు. అక్కడ వాళ్లకు స్వాగతం పలకడానికి జాన్ మనుషులు ఎదురుచూస్తున్నారు.

జాన్ తిరువాన్కూరులో కూడ బాగా ఆస్తి పాస్తులున్న వ్యక్తి. అక్కడ కొంత భూమిని ఓ లక్షరూపాయలకు అమ్మి, ఆ డబ్బుతో మలబారులో ఐదువందల ఎకరాల భూమిని కొన్నాడు. కోటిరూపాయలు ఖర్చుపెట్టినా ఆ అడవిని నరికి శుభ్రంచేసి పొలంగా తయారుచేయడం సాధ్యపడదని వూహించాడు. అందుకే ఓ మంచి ఉపాయం ఆలోచించాడు. తిరువాన్కూరు పేద కుటుంబాలకు భూమి ఆశ చూపించి మలబారు రప్పించుకోవడం చాలా సులువుకదా అని వూహించాడు. వర్గీస్, అతడి సహచరులు జాన్ ప్రలోభాలకు లొంగిపోయి మలబారు చేరుకున్నారు.

జాన్ ఓ కొండపైన విశాలమైన బంగళా కట్టించాడు. అతడు ఇంకా పెండ్లికూడ చేసుకోలేదు. తొమ్మన్ అతడి సేవకుడు, ఈప్పన్ గుమాస్తా, వారితో పాటు కొంతమంది జాన్ బంధువులు కూడ అక్కడే వుండేవారు. కలకుషి వర్గీస్ అతడి బంధువుల్లో ఒకడు. వర్గీస్ ఆరువేల రూపాయలతో మలబారు చేరుకున్నాడు.

అక్కడ ఓ పెద్ద తోట వేయించాలనుకున్నాడు. వర్గీస్ జాన్ పెద్దమ్మకొడుకు. ఇద్దరూ ఒకే స్కూల్లో చదివారు. అందుకే జాన్, వర్గీస్‌కు సహాయపడాలని ఆదుర్దా చెందాడు. ఇలా అతడు అక్కడ ఓ అతిథిగా వుంటున్నాడు.

జాన్, వర్గీస్ సహచరులందరికీ పొలం అమ్మాడు. కలియన్ పారా కొండలోయలో వున్న ముప్పై అయిదు ఎకరాల భూమిని మార్టిన్, మత్తయీలకు అమ్మేశాడు. తూర్పుదిక్కు పొలం మార్టిన్, పశ్చిమాన వున్న భూమి మత్తయీ కొన్నాడు.

మత్తయీ తన పొలం చుట్టూ కంచె వేసి వ్యవసాయం చేయాలనుకున్నాడు. అతడు అక్కడికి ఒకటిన్నర మైలు దూరంలో మరికొంత భూమిని కొని ఇల్లు కట్టించాడు. అక్కడే తన కుటుంబంతో సుఖంగా గడిపేవాడు.

మార్టిన్ మాత్రం తన పొలంలోనే కుటుంబంతోపాటు వుండాలని నిశ్చయించుకున్నాడు. మూడురోజులపాటు శ్రమించి అక్కడ ఓ వెదురు పాక వేశాడు. ఆ తర్వాత జాన్ ఇంటిలో వుంచిన తన సామాన్లు, పెట్టే బేడా తన పాకలోకి చేరవేశాడు.

ఆ పచ్చని అడవి మధ్య ఆ వెదురుపాక రెక్కలు విప్పి నిల్చున్న గద్దలా కనిపిస్తోంది. ఆ పాక నీడలో మార్టిన్ కుటుంబం కొత్త జీవితం ప్రారంభించింది. గుబురు పొదలు, చెట్టూ చేమల్నీ నరికి పారేసిన తర్వాత వాళ్లకి సారవంతమైన నల్లరేగడి నేల కనిపించింది ఆ బంగారు భూమి పచ్చగడ్డి, చెట్ల పొదలతో పూర్తిగా కప్పబడింది. వాళ్ల దృష్టిలో ఆ భూమి బంగారు పళ్లెరాన్ని పచ్చటి గుడ్డతో కప్పేసినట్లుగా వుంది.

ఓ సాయంకాలం పూట మరియమ్మ తన బంగారు భూమిని చూసుకొని పులకించిపోయింది. ఆమె కళ్లముందు ఎన్నో దృశ్యాలు ఒకదానివెనుక ఒకటి కనిపించసాగాయి. వేలకొలది కోరికలు, లక్షల కొలది ఆకాంక్షలు! వాళ్లు తిరువాన్కూరులో వున్నప్పుడు యింత పెద్ద భూమి తమకు చెందుతుందని కలలోకూడ వూహించలేదు. మలబారులో భూముల వెల చాలా తక్కువని అంటూండేవారు. ముప్పావు చక్రానికి మూడెకరాల భూమి దొరుకుతుందని బండివాడు పాచ్చుపిళ్లై అనేవాడు.

మరియమ్మ తర్పుదిక్కుగా చూసింది. పాకకు నాలుగువైపులా కాయగూరల మొక్కలు వేయాలనుకొంది. పొలం గట్లమ్మటే అరటి మొక్కలు, కొండను పైభాగాన

జీడిమామిడి, కొండలోయలో ఓవైపు వరి, మరో వైపు కర్రపెండలం, పెసర, మినుము వగైరా వేయాలనుకుంది. ఓ సంవత్సరం తర్వాత జనాలు మా భూమిని చూసి ఈర్ష్య పడిపోవాలి. అది మార్టిన్ భూకామందు తోట సుమా! అని చెప్పుకోవాలి.

# ఏడు

ప్రజలు ఏకధాటిగా మలబారు వస్తూనే వున్నారు. వున్నంత మటుకు కొద్దోగొప్పో డబ్బు చేత బుచ్చుకొని ఇంటి సామాన్లు బండ్లకు వేసుకొని వచ్చేవారు. పేదవాళ్లవద్ద డబ్బు ఏమాత్రం వుంటుంది. మాసిన బట్టలు వేసుకొని కాలినడకన బయలు దేరేవారు. అదే డబ్బున్న మహరాజులు మోటారు బండ్లలో యెడతెరిపి లేకుండా వచ్చేవాళ్ళు.

1943వ సంవత్సరం చివర్రోజులు. రెండవ ప్రపంచయుద్ధం చివరి అంకానికి చేరుకొంది. ప్రపంచమంతా ఫిరంగి గుళ్ల పొగతో కప్పబడిపోయింది. మానవజాతి మొత్తం మంటల్లో మాడి మసైపోతోంది. విజయలాలస మానవత్వాన్ని తొక్కిపట్టింది. సృష్టి మొదలు ఆనాటివరకు అంతటి భయంకరమైన రోజుల్ని ఎవ్వరూ ఎప్పుడూ చూసి వుండరు.

బర్మా, మలయా దేశాలు శత్రువుల పరమయ్యాయి.

భారతదేశంలో కూడ స్వాతంత్రోద్యమం వువ్వెత్తున లేచింది. దేశమంతా కరువుతో విలవిలలాడిపోతోంది. తిండి పదార్థాలన్నీ యుద్ధభూమికి తరలిస్తున్నారు. ప్రపంచ ప్రజల అవసరాలు తీరడంలేదు. ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. అన్నివైపుల నుండీ వత్తిళ్లు ఎక్కువయ్యాయి.

చివరికి ఇసుక రేణువు ఖరీదు కూడా పెరిగిపోయింది. కేవలం మనుషుల విలువే పాతాళంలోకి పడిపోయింది.

ఎనిమిది రూపాయలకు క్వింటాలు బియ్యం దొరికేవి. అవే అరవై అయిదు రూపాయలిచ్చినా నల్లబజార్లో దొరకడంలేదు. కొండ భూముల ఖరీదు కూడా పెరిగిపోయింది. ఆరోజుల్లో తిరువాన్కూరు రైతులు చాలా కష్టాలకు గురయ్యారు. అక్కడిపొలాల్లో పండే ఫలసాయానికి లాభాలకు బదులు నష్టాలు ఎదురయ్యాయి.

ఈ విపత్కర పరిస్థితుల్లో వారి ముందు కేవలం రెండే మార్గాలు మిగిలాయి - సైన్యంలో చేరిపోవడం లేదా మలబారుకు తరలి వెళ్లడం.

యువకులుగా వున్నవాళ్లు సాధారణంగా సైన్యంలో చేరిపోయేవారు. తక్కినవాళ్లలో చాలామంది మలబారు చేరుకున్నారు. తిరువాన్కూరు ప్రజలు మలబారు వెళ్లటానికి మరో కారణం కూడ వుంది.

కొద్ది సంవత్సరాల పూర్వం క్రిష్టియన్ మతస్తులంతా ఏకమై తిరువాన్కూరు హిందూరాజుకు వ్యతిరేకంగా అంతర్యుద్ధాన్ని నడిపించాలని ప్రణాళిక వేసుకున్నారు. కాని వాళ్ల వ్యూహం బెడిసికొట్టింది రాజదండనకు భయపడి చాలామంది మలబారు వెళ్లిపోయారు. వాళ్లల్లో అనేకులు మలబారులో రబ్బరు తోటలు పెంచి యీరోజు లక్షాధికారులయ్యారు. కొన్నేళ్ల తర్వాత వాళ్లు తిరువాన్కూరుకు వచ్చినప్పుడు అక్కడి వాళ్ళంతా ఆశ్చర్యచకితులయ్యారు. ఆ లక్షాధికార్ల చేతుల్లో బంగారు గడియారాలు, మెళ్లో గొలుసులు, వజ్రాలు పొదిగిన వుంగరాలు, వంటిమీద పట్టుబట్టలు ప్రత్యక్షమయ్యాయి. వాళ్లు కార్లలో విదేశీ మద్యాన్ని తెచ్చుకొనేవారు. వాళ్లు నేలమీద అడుగుపెట్టిన చోటల్లా జనం గుమిగూడిపోయేవారు. వారి వేష భాషలు, హావభావాలు చూసి సాధారణ ప్రజలు మలబారు గురించి అద్భుతంగా వూహించుకోసాగారు.

ఆ లక్షాధికారుల్లో చాలామందికి మలబారులో రబ్బరు తోటలుండేవి.1940 తర్వాత రబ్బరు ఖరీదు రోజురోజుకూ పెరిగిపోవడంతో వీళ్లు అకస్మాత్తుగా లక్షాధికారులైపోయారు. ఈ రహస్యం సామాన్యులకు ఏమాత్రం అర్థంకాలేదు. కాని వారితోపాటు మలబారు వెళ్లిన ఇతరులు అక్కడ ఎలా వున్నది, ఏ పరిస్థితిలో వున్నదీ తెలుసుకోవడానికి ఎవరూ ప్రయత్నించలేదు. మలబారువెళ్లిన వాళ్లంతా లక్షాధికారులౌతారని వాళ్లు భావిస్తున్నారు. అంతేకాదు మలబారు నేల బంగారం పండిస్తుందని అనుకున్నారు.

అందుకే వాళ్లకీ మలబారు వెళ్లాలనే తలంపు కలిగింది.

వాళ్లంతా గుంపులు గుంపులుగా మలబారు బయల్దేరారు. వాళ్ల దగ్గరున్న స్థిరాస్తులన్నీ అమ్మేసి కేవలం నోట్ల కట్టలతో మలబారు చేరుకోసాగారు.

ఇలా మలబారుకు తూర్పువైపు కొండలమీద వేల సంఖ్యలో గుడిశలు లేచాయి. క్రితం కొండచిలువలు నివసిస్తుండే రాతి గుహలు నేడు వ్యవసాయపు పనిముట్ల కొట్లుగా మారాయి. ఎప్పుడూ బంజరుభూముల్లా కనిపించే పర్వత శిఖరాలు నేడు యే దేవకన్యకో తన చేతిలో పూలు పండ్లతో అలంకరించిన పళ్లెరం

పట్టుకొని నిల్చున్నట్లు పచ్చని పైర్లు, పండ్ల తోటలతో కళకళలాడుతున్నాయి.

## ఎనిమిది

మరియమ్మ తెల్లవారకముందే వంట చేసింది.

బాలభానుడు మెల్లమెల్లగా తన కిరణాలను వెదజల్లుతున్నాడు. కొద్దిసేపట్లోనే ఆ బాలభానుని అరుణకిరణాలు అడివినంతా వ్యాపించాయి. మరియమ్మ తన గుడిసె వసారాలో కూర్చొని తూర్పువైపుకు చూస్తోంది. ఆమె తియ్యతియ్యని కలలప్రవాహంలో కొట్టుకుపోతోంది.

పొద్దు మొలిచి చాలా సేపయింది. కానీ మార్టిన్ ఇంకా లేవలేదు. అతడు గుఱకపెట్టి నిద్రపోతున్నాడు. మరియమ్మకు అతడిపై కోపం కలిగింది. ఆమె అతణ్ణి తట్టి లేపింది, కాని అతడికి మెలకువరాలేదు.

మరియమ్మకు బాగా కోపం వచ్చింది. గుమ్మడికాయలా వున్న మార్టిన్ తలకాయ పైకెత్తి నేలకేసి కొట్టింది. 'ధాం' అని శబ్దం వినిపించింది. ఆ చప్పుడుకి మార్టిన్ నిద్రలేచాడు. కళ్లు పెద్దవి చేసి ఆమెను చూడసాగాడు.

అతడు కోపంతో ఉగ్రరూపంలో వున్న మరియమ్మ కళ్లను చూశాడు. మెల్లగా లేచి పక్కమీదే కూర్చున్నాడు. పంచె చుట్టుకుంటూ నలువైపులా చూశాడు.

"అరే! ఇదేంటి? అప్పుడే మధ్యాహ్నం అయిందా? నాకు తెలీనేలేదే!"

"యేమిటి?" అన్నట్టు మార్టిన్ మరియమ్మకేసి చిరునవ్వుతో చూశాడు.

"నీవు యీమాదిరి మధ్యాహ్నందాకా నిద్రపోయి, విశ్రాంతి తీసుకోడానికేనా ఇక్కడికొచ్చింది?"

"త్వరగా తిండి తిని పాఱ, గొడ్డలి, కత్తి తీసుకొని చెట్లు నరకడానికి అడివికి బయల్దేరు."

యుద్ధరంగంలోకి వెళ్లమని ఆదేశాలు వచ్చినట్లు ఫీలయ్యాడు. శరీరాన్ని కష్టపెట్టడం అతనికిష్టంలేదు. తన శరీరాన్ని కరగని వెన్నముద్దలా వుంచుకోవడంలోనే అతడికి సంతోషముంది. కానీ మరియమ్మ ముందు తన ఆటలేమీ సాగడంలేదు. ఆమె ఒక ఉగ్ర రక్కసిలా వుంది.

మార్టిన్‌కి సూర్యుడిమీద కోపం వచ్చింది. ఇంత త్వరగా పొద్దు పొడవకుండా వుంటే తను మరికొంతసేపు నిద్రపోయేవాడు. చివరికి లేవక తప్పలేదు. అతడు

వళ్లు విరుచుకొని బట్టలు సర్దుకున్నాడు.

మరియమ్మ వసారాలో పెట్టిన పార, గొడ్డలిని కాతర భావంతో చూశాడు. తర్వాత మరియమ్మవైపు చూశాడు. ఆమె ముఖ కవళికలు చూస్తుంటే పని ఎగవేయడానికి ఏమాత్రం అవకాశం లేనట్టు కనిపిస్తోంది.

మరియమ్మ వంటగదిలో నుండి భోజన సామాగ్రి తెచ్చి మార్టిన్ ముందు పెట్టింది.

మార్టిన్‌కు పళ్లు తోమడం, ముఖం కడుక్కోవడం అంత అవసరమనిపించదు. మరియమ్మ ముఖం కడుక్కోమని బలవంతం చేయడమో లేక కోప్పడ్డప్పుడే అతడు కడుక్కుంటాడు.

భోజనం ముందు పెట్టగానే ఎలుగుబంటిలాగా విరుచుకుపడ్డాడు. కొద్ది నిముషాల్లో కంచం ఖాళీచేసి చేయి కడుక్కున్నాడు.

తర్వాత పాన్ వేసుకున్నాడు. కొద్దిపాటి ఆకు, వక్క, పుగాకు మూట గట్టుకున్నాడు. వసారాలోకి వచ్చి పార తీసుకొని భుజాన పెట్టుకొని మరియమ్మ వెనక పనికి బయల్దేరాడు.

ఎండవేడి పెరగసాగింది. ఆకులమీద మంచు బిందువులు కనిపిస్తున్నాయి. తూర్పువైపు కొండలు సూర్య కిరణాల వెలుగులో చాలా అందంగా కనిపిస్తున్నాయి. ఈ రమణీయమైన ప్రకృతిలో వాళ్లిద్దరూ కొండపైకి మెల్లమెల్లగా ఎక్కసాగారు.

మరియమ్మ తన పొలాన్ని చూసుకొని గర్వంగా భావించుకొనేది. ఆ పొలానికి ఒకవైపు సెలయేరు ప్రవహిస్తుంటుంది. మరోవైపు కాయగూరల తోట.

మరియమ్మ పొలంలో గడ్డి దోకుతోంది. మార్టిన్ కూడ పార తీసుకొని తవ్వుతున్నాడు.

ఎండవేడి మెల్లమెల్లగా పెరిగిపోతోంది. కొండనేల నల్లగా కనిపిస్తోంది.

మరియమ్మ విరామంలేకుండా పనిచేస్తోంది. మిసమిసలాడే గడ్డి అన్నివైపులా పెరిగిపోయింది. దాన్ని తవ్వడం అంత సులువైన పనికాదు. మరియమ్మ తలపైకెత్తకుండా పని చేసుకుపోతోంది. ఆమె పార లయబద్ధంగా నేలమీద పడుతోంది. ఆమె ఎర్రటి ముఖం చెమటతో తడిసిపోయింది. ముఖం మీద మట్టి ఎగిరి ఎగిరి పడుతోంది. దుమ్ము కొట్టుకుపోయిన ఆమె జుత్తు ఎంతో అందంగా వుంది. ఆమె వుంగరాల జుత్తు చెమటబట్టిన ముఖానికి అంటుకుపోయింది. పార

నేల తగిలి చప్పుడు చేసినప్పుడల్లా ఆమె వక్షస్థలం ఎగిరి పడుతుండేది.

గడ్డి తవ్వుకుంటూ మరియమ్మ ముందుకు సాగిపోతోంది.

మార్టిన్ పనిచేస్తున్నా మధ్యమధ్యలో దొంగ వేషాలేస్తున్నాడు. ఓసారి మెడలు విరుచుకోవడం, నాలుక నాలుగు అంగుళాలు బయట పెట్టడం, మరోసారి పార నేలకేసి దభేల్‌మని కొట్టి మరియమ్మకేసి చూసేవాడు. అలాగే మరోమారు మెడలు విరుచుకొని, పార నేలకేసి కొట్టేవాడు. పారకర్ర చేతి నుంచి జారుతూనే పార నేలమీద నిల్పోబెట్టి చేతుల్లోకి వుమ్మివూసి రెండు అరచేతులూ కసకసా రుద్దుకొనేవాడు. మళ్లీ చేతుల్లోకి పార తీసుకొని మళ్లీ పని ప్రారంభించేవాడు. పారను రిపేరు చేస్తున్నట్లు నేలమీద పడేసి చాలాసేపు అలుపు తీర్చుకొనేవాడు. ఇలా వుండేవి అతడి దొంగవేషాలు.

మార్టిన్ వేషాలవైపు మరియమ్మ ఏమాత్రం దృష్టి మళ్ళించేదికాదు. ఆమె తన పనిలో పూర్తిగా నిమగ్నమై వుండేది. ఆమె జీవితం సంఘర్షణమయం. ఆమె అదృష్టం ఆ కొండపొలాల ఫలసాయం మీద ఆధారపడి వుంది.

మేరీకుట్టీ జాన్‌ని ఎత్తుకొని కొండమీదికొచ్చింది. తల్లినిచూసి పిల్లవాడు చేతులు చాపి గట్టిగా ఏడవసాగాడు. మరియమ్మ పార నేలమీద ఆనించి పిల్లవాడివైపు చేతులు చాపి ముందుకు నడిచింది. ఆమె బిడ్డను చేతుల్లోకి తీసుకొని ప్రేమగా ముద్దులు కురిపించింది. ఓ పెద్దబండరాయి మీద కూర్చుని బ్లౌజును పైకెత్తి పిల్లవాడి నోటికి స్తన్యం అందించింది.

జాన్ కాళ్లు వూపుకుంటూ పాలు తాగుతున్నాడు. మరియమ్మ చూపులు నేలమీదికి వాలివున్నాయి.

మార్టిన్ పార నేలమీద వుంచి వక్కాకు మూట చేతిలోకి తీసికొని మరియమ్మకు దగ్గర్లో బండరాయి మీద కూర్చున్నాడు.

మార్టిన్ మెల్లగా వక్కాకు నమలసాగాడు. అలా వక్కాకు నములుతుండగానే మరియమ్మ పిలుపు వినిపించింది. "చూడు, ఆ చెట్టు నరకాలి. దాని వేళ్లు పూర్తిగా పెళ్లగించిన తర్వాతే ఆ నేల శుభ్రమౌతుంది."

మార్టిన్ అలానే అన్నాడు. అతడు అనుకోకుండా మరియమ్మవైపు దృష్టి మరల్చాడు. మరియమ్మ అతడికి చాలా అందంగా కనిపించింది. అతడు ఆశ్చర్యపోయాడు, ఇంత అందంగా ఆమెను గతంలో ఎప్పుడూ వూహించలేదు.

మనసులో అనుకున్నాడు. "మరియమ్మ ఒక్కసారిగా ఇంత అందంగా ఎలా మారింది" అని. ఆమెను కన్నార్పకుండా చూడసాగాడు.

మరియమ్మ నల్లని కళ్లలో అతడికి ఓ వింత ఆకర్షణ కనిపించింది.

అతడి దృష్టి ఓసారి చెమటతో తడిసిన మరియమ్మ స్తనాలవైపు మరోసారి అందమైన ఆమె పొట్టవైపు పడేది.

మరియమ్మను పెండ్లైతే చేసుకున్నాడుగాని ఎప్పుడూ ఇంత అందంగా వుంటుందని వూహించలేదు. ఒకవైపు మార్టిన్ కామ వాసనలు తన పెళ్లాం శరీరం మీద వ్యాపించి ఆమెను అనుభవించాలనే కోరికలు విజృంభించసాగాయి. మరోవైపు మరియమ్మ మనసులో తన పొలంలో బంగారు పండాలనే దివ్య స్వప్నాల్ని కంటోంది. మిసమిసలాడే కర్రపెండలం తోట, ధాన్యంతో నిండిన కళ్లం ఇలా ఎన్నో చిత్రాలు ఆమె నల్లటి కళ్ల ముందు తిరుగాడేవి.

మార్టిన్ మరియమ్మను ఆనుకొని కూర్చున్నాడు. ఆమె వంటి స్పర్శతో మార్టిన్ హృదయం అలలతో కొట్టుమిట్టాడుతున్నట్లు కోరికలతో విజృంభించింది. అతడు తన పెళ్లాంవైపు యెంతగా ఆకర్షితుడయ్యాడంటే ఆమెతో గత యేడేండ్లుగా శారీరక సంబంధం కలిగివున్నట్లు నమ్మలేకపోతున్నాడు. మరియమ్మ మార్టిన్ మనసులో భావాన్ని పసిగట్టింది. ఆమె మార్టిన్‌వైపు చూస్తునే లజ్జతో సిగ్గుపడ్డాడు. కాని ఆ సమయంలో కామంతో దహించుకుపోతున్న మార్టిన్ చూపులు, స్పర్శ ఆమెకు యెంతో ఆనందాన్ని కలిగించాయి. ఆమె తన బ్లౌజును కప్పుకుంటూ తన మనసులోని సంతోషాన్ని దాచుకోవడానికి ప్రయత్నించింది. కాని దాచుకోలేక పోయింది. ఆమెకూడ కామంతో నిండిన కన్నులతో మార్టిన్ మీద కోపం ప్రదర్శించింది. "యేమయ్యా! అమ్మాయిల్ని ఇలా గుచ్చి గుచ్చి చూడ్డానికి సిగ్గులేదూ?" ఈ హాస్యం వింటూనే మార్టిన్ గట్టిగా నవ్వాడు. అతడు ధైర్యం తెచ్చుకొని మరియమ్మను తన బాహువుల్లోకి తీసుకొని కౌగిలించుకున్నాడు.

మరియమ్మ వెంటనే లేచి నిల్చుంది.

"మేరీకుట్టీ, ఎక్కడున్నావ్?" గట్టిగా కేకవేసింది.

"ఓ మేరీ కుట్టీ?"

ఆ పిలుపు విని మేరీకుట్టీ కొండపొదల్లో నుండి పరుగెత్తుకొచ్చింది. ఆశ్చర్యపోతూ "అమ్మా! మనుషులు ఒక శవాన్ని చర్చివైపు తీసుకెళుతున్నారు."

"ఏమిటీ శవమా! ఎవరు చచ్చిపోయారు?"

"యెవరో తెలీదు."

"మలేరియా సోకి చచ్చిపోయుంటారు." మార్టిన్ గొంతెత్తి చెప్పాడు. "నిన్న కూడ ఒక మనిషి మలేరియాతో చచ్చాడు."

"పద, ఇంటికి వెళ్లి అన్నం తిని మళ్లీ వద్దాం. "మరియమ్మ లేచి నిల్చొంది.

మేరీకుట్టీ జాన్‌ని ఎత్తుకోవడానికి చేతులు చాపింది. మార్టిన్ తల వంచుకొని ఒక మదగజంలా మరియమ్మ వెంట నడవసాగాడు.

మరియమ్మ వెంట నడుస్తుంటే అతడి మనసులో ఎన్నో కొత్త కొత్త ఆలోచనలు ముసురుకున్నాయి. మార్టిన్ గతంలో యెప్పుడూ ఇలా ఆలోచించలేదు. కాని ఇప్పుడు అతడి జీవితవిధానంలో మార్పు వచ్చింది. అందుకే అతడి హృదయంలో యెన్నో కొత్త కొత్త ఆలోచనలు మొలకెత్తసాగాయి. ఈ కొత్త పరిస్థితులే అతడి హృదయంలో దాగిన కోర్కెల్ని మేల్కొల్పాయి.

నిజం చెప్పాలంటే అతడికి మరియమ్మంటే భయం. అతడి జీవిత నౌకకు మరియమ్మ చుక్కానిలాంటిదని మార్టిన్‌కు బాగా తెలుసు.

మరియమ్మ బలవంతంతోనే వాళ్లు మలబారుకు చేరుకున్నారు. మొదట్లో మార్టిన్‌కు మలబారు రావడం బొత్తిగా యిష్టంలేదు. కాని మరియమ్మ పట్టుదల ముందు అతడు లొంగిపోక తప్పలేదు, మలబారు రావడమూ తప్పలేదు. ఈ రోజు వాళ్లు మలబారులో ముప్ఫై యెకరాల భూకామందులు. ఏసుప్రభువు దయవుండాల్నేగాని, మరో అయిదేళ్ళలో వెయ్యి యెకరాల పొలం ఖరీదు చెయ్యొచ్చు. కోరికలకూ ఆశలకూ హద్దంటూ ఏముంది. తిరువాన్కూరులో వుండగా కర్రపెండలం తిని మంచినీళ్లు తాగి కాలం గడిపేవారు. ఆ కాలం గడిచిపోయింది. ఇప్పుడు తమ స్వంత తోటలూ, వనాలూ, పొలాలు, పెద్దయిల్లూ వున్నాయి. ఒక కుటుంబానికి కావలసిన హంగులన్నీ ఏర్పడ్డాయి. "మార్టిన్ యజమాని, కలియన్ మల్పతోట"కు తిరువాన్కూరు నుండి వుత్తరాలొస్తుంటాయి, అని లోకులు అంటారు. ఎంత గౌరవమైన విషయం. ఇదంతా మరియమ్మ ప్రయత్నంవల్లే జరిగింది.

అతడు కుక్కే అయివుంటే మరియమ్మ పాదాలు నాకేవాడే.

వాళ్లు కొండ దిగి ఇల్లు చేరుకొని అందరూ భోజనానికి కూర్చున్నారు. భోజనం

వుదయం చేసిందే. కర్రపెండలం అందులోకి చేపల పులుసు. చాలా రుచిగా వుంది.

భోంచేసిం తర్వాత మార్టిన్ మేరీకుట్టీని పిలిచి "నువ్వు మాత్తచ్చన్ యింటికెళ్లి గొడ్డలి తీసుకరా." అని చెప్పాడు. మేరీకుట్టీ పాట పాడుకుంటూ అక్కడికి రెండు మైళ్ల దూరంలో వున్న మాత్తచ్చన్ ఇంటివైపు బయల్దేరింది. మరియమ్మ పక్కవేసి జాన్‌ని పరుండబెట్టింది. ఆమెకూడ ఆ పక్కమీదే పడుకుంది.

బయట చచ్చేంత ఎండ కాస్తోంది. కాని గుడిసెలోపల చాలా చల్లగా వుంది. పిల్లలు నిద్రించారు. మరియమ్మకు తియ్యటి నిద్ర పట్టింది.

మార్టిన్ ఆమెను అంటుకొని పడుకున్నాడు. దాంతో ఆమె మేల్కొంది. మార్టిన్ వేడి శ్వాస, వింత అరుపులూ గమనిస్తోంది. కాని యేమీ ఎరగనట్లు పడుకుంది.

సాధారణంగా మరియమ్మ మార్టిన్‌కు ఇలాంటి స్వతంత్రం చాలా తక్కువగానే ఇచ్చేది. అప్పుడప్పుడు తన కోరిక మేరకు మార్టిన్‌ని కలుసుకోనిచ్చేది. అతడు చాల ఓర్పుగా ఈ అవకాశం కోసమే ఎదురుచూసేవాడు. దొరికిన ఆనందానికి సంతృప్తి పడేవాడు. కాని నేటి పరిస్థితి వేరు. నేడు వాళ్లు కొత్త జీవితాన్ని ఉల్లాస భరితంగా ప్రారంభించదలచారు. తన ఆనందమయ జీవితంలో అతణ్ణి ఒక భాగస్వామిగా స్వీకరించాలనుకొంది.

మార్టిన్ ఈరోజు చాలా పనిచేశాడు. అందుకే దాని ప్రతిఫలంగానైనా సరే, అతణ్ణి సంతృప్తి పరచాలి.

మరియమ్మ మార్టిన్‌వైపు తిరిగిపడుకొంది. ఆమె మార్టిన్ రోమాచ్ఛాదిత ఛాతీపై మెల్లగా నిమరసాగింది.

## తొమ్మిది

ఓ నెల గడిచిపోయింది. వర్కీ ఇంతవరకూ తన స్వంతానికి కొనాలనుకొన్న పొలాన్ని యెన్నుకొనేలేదు. అతడికి తొందరకూడా లేదు. కావలసినంత డబ్బుండగా కొనడానికి తొందరేమి వచ్చింది? అన్నిటికంటే మంచి కొండ ప్రాంతం ఎన్నుకోవాలి. అందుకోసం ఎన్నో వుపాయాలు పన్నాలి. ఆ సమయం వచ్చినప్పుడు అన్నీ సర్దుబాటౌతాయి. ఈలోపల ఈ ప్రాంతాన్ని, యిక్కడి మనుషుల్ని సరిగా అర్థం చేసుకోవాలి.

వర్కీతోపాటు చెరియన్‌కూడ పొలం కోసం వెదుకుతున్నాడు. ఇప్పటివరకూ చెరియన్ యాభై యకరాల పొలం కొన్నాడు. మరో వంద యెకరాలు కొనే తలంపులో వున్నాడు. అతడితోపాటు అతడి అన్న కుమారుడు ఏంతోనీ కూడా వున్నాడు. అతడు తను కొన్న పొలంలో ఒక వెదురు గుడిసె వేయించి ఏంతోనీని అక్కడ వుంచాడు. తనేమో జాన్ బంగ్లాలో వుంటున్నాడు.

చెరుకాట్టిల్ వర్కీ పేరుగల మరోవ్యక్తి తనకు సరైన భూమి దొరికేంతవరకూ మీ బంగ్లాలోనే వుండనివ్వమని జాన్‌ని అడిగాడు. అతడిదగ్గర సుమారు ఏడువేల రూపాయాలున్నాయన్న సంగతి జాన్‌కి తెలుసు. అందుకే తన బంగ్లాలో వుండవద్దని చెప్పలేకపోయాడు.

ఇలా పై నలుగురు వ్యక్తులూ తమ సమయాన్ని పేకాడ్డంలో, విందు భోజనాలు, వేటాడ్డం, మద్యం సేవించి నిద్రపోవడంతో ఆనందంగా గడిపేవారు.

వర్కీ వుదయం సుమారు పదకొండింటికి నిద్ర లేచాడు. వాళ్ళు రాత్రంతా మద్యం సేవించారు. మద్యంతోపాటు సాధారణంగా పంది మాంసం కూడా తినేవారు. తను నిన్న పట్నం వెళ్లి ఆరుసీసాలు సౌత్‌ఆఫ్రికన్ మద్యం 'టివ్‌ఫిష్' తెచ్చాడు.

నిద్ర మేల్కొనికూడా వర్కీ పక్కమీదే పడుకున్నాడు. అతడు మెల్లగా చేయిచాచి సిగరెట్టు పెట్టె తెరిచి చూశాడు. అందులో ఒక్క సిగరెట్టు కూడా లేదు.

అతడి శరీరం బాగా అలసిపోయింది. తల భారంగా వుంది. అతడికి గత రాత్రి విందు విశేషాలన్నీ గుర్తున్నాయి. నిన్నటిరోజు జాన్ పట్నం వెళుతుంటే మద్య మాంసాదులు తీసుకరమ్మని అతడి చేతికి వంద రూపాయాల నోటు ఇచ్చాడు. కాని మిగిలిన డబ్బు వాపసు ఇవ్వలేదు.

ఫరవాలేదు. కేవలం వంద రూపాయలేకదా? మిత్రులకు తనకూ నిన్నటి విందు చాలా ఆనందాన్ని కలిగించింది.

వరండాలో ఎవరివో అడుగుల చప్పుడు వినిపించింది. వర్కీ కిటికీనుండి తొంగిచూశాడు. బనియన్ వేసుకొని పైన టవల్ కప్పుకొని ఓ యువకుడు వరండాలో నిల్చుని వున్నాడు.

"ఎవరూ?" గట్టిగా పిలిచాడు వర్కీ.

అతడు తలుపు దగ్గరగా వచ్చాడు.

"జాన్‌గారు యిక్కడ లేరాండీ?"

"తెలియదు. బహుశా తోటలోకి వెళ్లుండవచ్చు. ఏంకావాలి?"

"ఇక్కడ యెవరికో పొలం కావాలని విన్నాను. నేను పుల్లంకోట నంబియార్ గుమస్తాను."

"లోపలకి రండి. ఎదురుగ్గా వున్న కుర్చీలో కూర్చోండి."

"వచ్చిన యువకుడు ఆ కుర్చీలో కూర్చున్నాడు.

"నాకే పొలం కావాలి. మీ అడవి ఎటువైపుంది?" వర్కీ అతణ్ణి అడిగాడు.

ఇక్కడికి నాలుగుమైళ్ల దూరంలో వుంది. కావలిస్తే మనం ఈరోజే వెళ్లి చూడొచ్చు."

"ఈరోజు నాకు వీలుపడదు. రేపు వెళదాం. ఒక యకరాభూమి షుమారుగా ఎంత వుంటుంది?"

"వెల గురించి మీరేమీ బాధపడకండి. మొదట నేల చూడండి. నేల ఖరీదు ఆ నేలమీద పండే ఫలసాయంమీద ఆధారపడి వుంటుంది. ఆ నేల గురించి చెప్పాలంటే దాని చుట్టూ దట్టమైన అడవుల్లేపు, రాతినేల అంత కంటేకాదు. అది లోయలో వున్న మైదానం. మొదట ఆ నేల మీద వ్యవసాయం చేసేవారు. కానీ తర్వాత బంజరుగా పడివుంది.

అక్కడ యేడాదికి ఒక పంట పండించేవారు. ఆ నేలమీదికి చాలామంది దృష్టిమళ్లింది. యజమాని అమ్మివేయాలనుకుంటున్నాడు. ఈలోగా జాన్‌గారు కబురు పంపారు."

"మీ పేరేమిటి?"

"ఓతెనక్కురూపు."

"సరే, మీరు రేపు వుదయం ఇక్కడికి రండి. మనమిద్దరం వెళ్లి ఆ పొలాన్ని చూసి వద్దాం."

"అలాగే, నేను రేపు వుదయాన్నే మీ దగ్గరకొస్తాను. కానీ ఒక్క విషయం గుర్తుంచుకోండి, ఈరోజుల్లో తాము జమీందార్లమని, గుమాస్తాలమని లేదా ఏజంట్లమని చాలామంది మిమ్మల్ని కలుసుకోవచ్చు. వాళ్లంతా పచ్చి మోసగాళ్లు. మీకు చూపించిన నేల మీ స్వంతం యేనాటికీ కాదు, మీరు ఇచ్చిన సొమ్ము మళ్లీ యెట్టి పరిస్థితుల్లోనూ వెనక్కిరాదు."

"అలా జరుగుతుందా? ఇక్కడ అంతటి మోసగాళ్లున్నారా?"

"బాబూ ఈరోజుల్లో అలాంటి వాళ్లిక్కడ చాలామంది వున్నారు."

"అలాగైతే సరే, నేను మొదట అలాంటివాళ్లనే కలుసుకుంటాను. అలాంటివాళ్లని మొదట మలబారు నుంచి తరిమేస్తాము. అప్పుడే యిక్కడి ప్రజలు సుఖంగా వుండగలుగుతారు."

నౌకరు తొమ్మన్న టీ తెచ్చి బల్లమీద వుంచాడు. వర్కీ టీ తాగుతూ "వీళ్లకి తిరువాన్‌కూరు ప్రజలగురించి యేమీ తెలియదు. తిరువాన్కూరు మహారాజునే యెదిరించి ఆ క్రిష్టియన్లు అంతర్యుద్ధం చేసి అతణ్ణి ముప్పతిప్పలు పెట్టారు. మా ముందు వీళ్లెంత." అని మెల్లగా చెప్పాడు.

గుమస్తా ఓతెనక్కూరూపు అతడికి నమస్కరించి నిల్చున్నాడు.

"అయితే రేపు వుదయం కలుసుకుందాం. ఇంతకీ మీ పేరేమన్నారు?"

"ఓతెనక్కురూపు."

"మంచిది కురూప్పుగారు. యెవరైనా దొంగ ఏజెంట్లు దొరికితే వాళ్లను కూడా మా దగ్గరకు తీసుకురండి. ఏమిటి?"

"అలాగేనండి."

గుమస్తా నవ్వుకుంటూ గొడుగు చేతబట్టుకొని బయల్దేరాడు.

## పది

కుషిమాడత్తిల్ ఓసేపు తిరువాన్‌కూరుకు చెందిన కాంజిరపల్లి నుండి వచ్చాడు. అతడు పక్షం రోజులముందే పెళ్లాం, నలుగురు పిల్లలతోపాటు మలబారు చేరుకున్నాడు. ఎద్దులబండిలో ఇంటిసామాన్లు వేసుకొని, చేత మూడువేల అయిదు వందల రూపాయల నగదు తీసుకొని వచ్చాడు.

మరుసటిరోజు నుండే అతడు పొలం వేటలో పడ్డాడు. చివరకు యెవరో అతడికి పాలకోట జమీందారు గుమస్తా రామకిటావుతో పరిచయం చేశారు.

కిటావు ఓసేపుని వెంటబెట్టుకుని కొండల్లో అమ్మకానికున్న భూమిని చూపిస్తున్నాడు.

తెలతెలవార్తుండగా కొండలోయల్లో మంచుతెరలు మెల్లమెల్లగా తొలగిపోతున్నాయి. ప్రాతఃకాలాన సూర్యకిరణాలతో పచ్చని అడవి స్నిగ్ధంగా కనిపిస్తోంది.

కిటావు ఓ పెద్ద బండరాయి మీదికి ఎక్కి తన చేతనున్న కర్రతో తూర్పువైపు భూమిని చూపిస్తున్నాడు.

"ఈ నేలంతా అమ్మకానికుందా?"

అక్కడ అన్నివైపులా అడివిని చూసి జోసఫ్ ఆశ్చర్యపోయాడు.

"మీకు ఎంత కావలిస్తే అంత నేలవరకూ అడివి నరికేసుకోండి."

ఓసేపు మౌనంగా అతడి మాటలు వింటూ ఆ అడివిని చూస్తున్నాడు. అతణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేసింది ఆ అడివి బాహ్య సౌందర్యంకాదు, దాని హద్దులు లేని వైశాల్యం. ఆ అడివి కూర్గు కొండలవరకూ వ్యాపించివుంది. నేటివరకూ ఆ అడివిని కొలిచినవారుగాని, అక్కడ వ్యవసాయం చేసినవారు గాని యెవరూ లేరు. ఇంతవరకూ ఆ భూమిని ప్రభుత్వం కూడా సర్వే చేయలేదు. దీన్ని ముట్టుకున్న నాథుడే లేడు.

ఎంతోదూరం వరకూ వ్యాపించిన పొలాన్ని చూసి ఓసేపు హృదయం భావావేశంతో ఉక్కిరి బిక్కిరి అయింది. అతడి కళ్ళముందు ఓ సుందర స్వప్నం ప్రత్యక్షమైంది. ఆ నేలంతా పరిపైరుతో మిసమిసలాడుతోంది. కర్రపెండలం సువాసనలు నలువైపులా వ్యాపిస్తున్నాయి.

ఆ పవిత్రభూమికి ఏనాడూ ధాన్యపుగింజ స్పర్శకూడా తగల్లేదు. అతడికి ఆ నేలమీద అమితమైన అనురాగం కలిగింది.

ఓసేపు వంగి నేలను తవ్వి పిడికెడు మట్టి చేతిలోకి తీసుకున్నాడు. ఎంతటి మంచి నేల యిది. పూర్తిగా సారవంతమైన నేల. యుగయుగాలుగా చెట్లు, మొక్కలనుండి రాలిన ఆకులు నేలమీద పడి కుళ్ళిపోయి ఎరువులుగా మారిన నేల. కొండలనుండి ప్రవహించిన నీటితోపాటు ఎన్నో లవణాలు కలిసి, ప్రకృతి, కాలం ప్రయోగాలతో సారవంతమైన ఖరీదైన నేల. ఈ నేలను కొలిచికాదు, తూకం వేసి వెల నిర్ణయించాలి.

"ఒక యకరం వెల ఎంత వుంటుంది?" ఓసేపు ఆర్ద్రతతో అడిగాడు.

కిటావు తన లాఠీని నేలమీద ఆనించాడు.

"మీరు ఎన్ని ఎకరాలు కొంటారు?"

"అది మీరు అమ్మే రేటును బట్టే నిర్ణయించాలి కదా?"

"ఒక యకరా భూమి తొమ్మిది రూపాయలు పడుతుంది. ఆపైన మీకు

ఈ బేరం తెచ్చినందుకు నాకు ఇవ్వాల్సింది వేరే వుంటుంది.''

ఓసేపు లెక్కవేయసాగాడు. ఇప్పుడు తనవద్ద 3,200 రూ॥ వున్నాయి. రెండువందల యకరాలు కొంటే నేల ఖరీదు 1800 రూ, కచేరీ ఖర్చులు రూ. 200, ఇతర ఖర్చులు రూ. 800లు. పొలం సాగు చేసుకోడానికి రూ. 500. ఓ సంవత్సరంపాటు తిండీ తిప్పలకు ఆ డబ్బు చాలు. వచ్చే యేడాదినుండి ఆదాయం యెటూ చేతికందుతుంది.

''ఇప్పుడు నాకు 200 యకరాలు కావాలి.'' ఓసేపు గట్టిగా చెప్పాడు.

'పది సంవత్సరాల్లో ఈ యిలాకా అంతా నా యేలుబడిలోకి వస్తుంది!' అని మనసులో వూహించుకున్నాడు.

కిటావు తల వూపాడు. ''ఆ యేర్పాట్లన్నీ నేను చూసుకుంటాను. రేపు సాయంత్రానికల్లా రెండు పిడికెళ్లు ఆకులూ, వక్కలూ, ఓ పిడికెడు పుగాకు, రెండు సీసాలు నాటు సారా కొనుక్కొని మా యజమాని యింటికిరండి. నేను ఆ సమయానికి అక్కడే వుంటాను.

ఓసేపు అందుకు ఒప్పుకున్నాడు. వాళ్లిద్దరూ ఆ కొండ ప్రదేశంలో చాలాసేపటి వరకూ తిరిగారు. తనకు కావలసిన నేలను ఎన్నుకోవడంలో ఓసేపు తన తెలివిని వుపయోగించాడు.

ఎలాగైతేనేం రెండు కొండలమధ్య నుండే సమతల ప్రదేశాన్ని ఎన్నుకున్నాడు.

''మీరు చాలా మంచి భూమిని కోరుకున్నారు.'' గుమాస్తా నవ్వుతూ అన్నాడు. ''రాళ్లు వెదజల్లినా పంట పండుతుంది. క్రింద ఒక సెలయేరు కూడా వుంది. ఇక వెంటనే ఇక్కడ ఒక గుడిసె వేయించండి.''

కిటావు భూమిని చూడ్డానికి మరోమారు తూర్పువైపుకు నడిచాడు. ఓసేపు విజయం సాధించినట్లు సంతోషంగా తన గుడిసెవైపు బయలుదేరాడు. లోయభూమి నుంచి తీసిన మట్టి ఇంకా తన చేతిలోనేవుంది.

## పదకొండు

కలియంపారా కొండమీద తన పొలంలో పని చేసుకొనే మరియమ్మ దూరంనుండి యేవేళప్పుడైనా కనిపిస్తుంది.

ఆమె పొద్దు పొడవక ముందే వంట వండుతుంది. పిల్లవాడికి పాలిచ్చి

తండ్రి పక్కన పడుకోబెడుతుంది. తనేమో వసారాలో వున్న గడ్డిపార భుజంమీద వేసుకొని సైనికుడిలాగా పొలానికి బయల్దేరుతుంది. గునపంతో గోతులు తవ్వడం గడ్డి తవ్వటం, చెట్లవేళ్లు పెకిలించడం మొదలైన పనులు చేసి శరీరమంతా చెమటతో తడిసిపోతుంది. కానీ రవ్వంత కూడా అలసట చెందేదికాదు. పనిచేస్తూనే వుండేది. సుమారు పదిగంటల వేళకు మార్టిన్ అక్కడకు చేరుకునేవాడు. మధ్యాహ్నం పని ఆపి భోజనానికి వచ్చేవారు. భోంచేసి ఓ అరగంటపాటు విశ్రాంతి తీసుకొని మళ్లీ పనికి బయల్దేరేవారు.

చిమ్మచీకట్లు కమ్మేంతవరకూ మరియమ్మ తన పొలంలో పనిచేసేది. ఇలా అడివి మెల్లగా శుభ్రం కాసాగింది.

మార్టిన్‌కి కొద్దిరోజుల తర్వాత తన పుట్టుకతో వచ్చిన జబ్బులా సోమరితనం పెరిగిపోయింది. అతడు ఒక పూటకంటే ఎక్కువ పనిలోకి వెళ్లేవాడు కాదు. ఇంటివద్దే వుండిపోయేవాడు. అప్పుడప్పుడు రోజులు తరబడి ఫ్రెంచిలీవులు కూడా పెట్టేవాడు. ఏ పనీ చెయ్యకుండా తలవంచుకొని నిర్వికార సమాధిలో వున్నట్లు రోజంతా ఓకేచోట కూర్చుని వుండటం అతడికి యెంతో హాయిగా వుండేది.

మార్టిన్ పనిచేసినా, చేయకపోయినా మరియమ్మదగ్గర వుంటే చాలు. అతడికి యెంతో స్ఫూర్తి లభించేది. మార్టిన్ పొలం పనులకు రానందుకు ఆమెకు నిరాశ కలిగేది. మార్టిన్‌పై కోపం కూడా వచ్చేది. రేపట్నుండీ వుదయాన్నే భోంచేసి తన వెంట రమ్మని మార్టిన్‌కి చెప్పింది. మార్టిన్ యేరోజూ వుదయాన్నే లేచేవాడు కాదు. ఒకవేళ అతడు తొందరగా మేల్కొన్నా నిద్ర తక్కువయిందని బద్ధకంగా పడి వుండేవాడు. మరియమ్మకు అతడి బుద్ధి బాగా తెలుసు. అతడు లేవకపోతే మరియమ్మ అతడి చెవిలో నీళ్లు పోసేది, లేదా జుట్టు గుంజేది. అప్పుడప్పుడు అతడి ముక్కులో ముక్కుపొడుం చల్లేది. ఇలా యేదోవిధంగా అతణ్ణి నిద్రలేపి కొండమీదికి తీసుకెళ్లేది. కానీ అతడికి గడ్డి ముట్టుకోవడం అంటే అసహ్యం.

మరియమ్మ యధాప్రకారం గడ్డికోస్తోంది. ఇంతలో ఆమె కిందివైపు నేలను చూసింది. "ఓవారం రోజుల్లో తక్కిన భాగం కూడ శుభ్రమైపోతుంది." అని మనసులో అనుకొంది.

"ఓరి దేవుడా! ఓ ఏసుప్రభువా!" మార్టిన్ గట్టిగా ఏడ్వడం మొదలుపెట్టాడు. మరియమ్మ అతడివైపు చూసింది. నేలమీద పడివున్నాడు.

మరియమ్మ పార విసిరికొట్టి అతడివైపు పరుగుపెట్టింది. మార్టిన్ రెండు చేతుల్లో కాలు పట్టుకొని ఏడుస్తున్నాడు.

"అయ్యయ్యో! నా కాలు తెగిపోయింది. నేను చచ్చిపోతాను."

మార్టిన్ కాలునుంచి రక్తం కారుతోంది. పార కాలుమీద తగిలింది. కాని గాయం చెప్పుకోదగ్గదేమీ కాదు. కానీ మార్టిన్ విలవిల లాడిపోతున్నాడు. పూర్తిగా కాలే తెగిపోయినట్లు.

మరియమ్మ మార్టిన్‌ని పైకెత్తి బండమీద కూర్చోబెట్టింది. అతడి గాయానికి యేవో ఆకులు పిండి పసరు వేసి కట్టుకట్టింది. తర్వాత మార్టిన్‌ని ఇంటికి తీసుకెళ్లి పడుకోబెట్టింది. మళ్లీ మరియమ్మ పనిలోకి వెళ్లిపోయింది.

"అతడు కావాలనే కాలు గాయపరుచుకొని వుంటాడు. పనిదొంగ" అనుకుంది మరియమ్మ మనసులో. "అయినా మరియమ్మ పనికి యేనాడూ బెదిరిపోలేదు."

## పన్నెండు

మట్టి, అంతా మట్టిమయం.ఈ మట్టి ఎంత అమూల్యమైనదో! ఈ మట్టితోనే మనిషికి కావలసిన అవసరాలన్నీ తీరిపోతాయి. మరోలా చెప్పాలంటే ఈ మట్టే మానవత్వానికి ఆధారమైన అంశం.

మనిషి ఈ మట్టిలో ఒక భాగంగా జన్మిస్తాడు. మట్టిలోనే బ్రతుకుతాడు. చివరికి ఈ మట్టిలోనే మాయమైపోతాడు.

ఈ నేలకోసమే రక్తపాతాలు, కొట్లాటలు, యుద్ధాలు జరుగుతాయి. ప్రపంచపు మహాకావ్యాలు ఈనేల కోసం జరిగిన రక్తపాతాల వర్ణనలతో నిండివున్నాయి.

మరియమ్మ ఒక పిడికెడు తాజా అడివి మట్టిని చేత్తో తీసుకొంది. మట్టి తాలూకు ఒక్కోకోణంలో సుషుప్తావస్థలోనున్న జీవితపు అనేక దశలను పరికించింది. ఆ ఆడమనిషి ఆశలు, ఆకాంక్షలు ఆ అడివి మట్టిలోనే దాగివున్నాయి. ఆమె రక్తమాంసాలు, స్వేదం, ఖేదం అన్నీ ఆ మట్టిలోనే కలిసివున్నాయి.

మరియమ్మ తవ్విన నేల ఎండ తగలడంతో పసుపుపచ్చగా మెరుస్తోంది. కొద్దిరోజుల తర్వాత వర్షం వస్తుంది, ఆ మట్టిలో ధాన్యపు విత్తనాలు మొలకెత్తుతాయి.

ఆ మెలకెత్తడమే తమ సౌభాగ్యానికి సంకేతాలని ఆలోచించసాగింది. వేలకొలది విత్తనాలు మోసులెత్తి మొలక రూపంలో ఈ భూమిమీద తన అందాల్ని ఎలా పాటమరిస్తుందో, అట్లే మరియమ్మ హృదయంలో ఆ మొలకలు ఆ తర్వాత బంగారు వర్ణంలో పెరిగే పైరుగురించి యెన్నో కోరికలు మొలకలెత్తసాగాయి. గాలి, నీరు, ఎండ స్పర్శతో ఆ మొలకలు పెరిగి బంగారు రూపం దాల్చనున్నాయి.

గతంలో ఆ కొండమీద భూముల్లో సాగుచేసేవారు. ఆ పొలాలు అందుకు అనువైనవే. తను రెండురోజుల్లో పిచ్చిమొక్కల్ని వేరేస్తుంది. ఆమె కొండ శిఖరం మీదకు ఎక్కి పొలాన్నంతా పరికించింది. రెండు చేతులతో తలపట్టుకొంది. "ఓరి దేవుడా! ఓ ఏసుప్రభూ! సైతాను మమ్మల్ని మోసగిస్తున్నాడు."

కష్టించి తవ్విన పొలమంతా మళ్లీ గడ్డి పెరిగింది.

మరియమ్మ నిరాశ చెందింది. మరసటిరోజు తెల్లవారుఝామునే లేచి పార, గునపం తీసుకొని కొండవైపునకు నడిచింది.

చేసిన పనినే మళ్లీ చేయాల్సివచ్చింది. ఇంతకంటే మరో మార్గం లేదు. ఆమె ఆ రాక్షసి గడ్డిని సర్వనాశనం చేసిగాని నిద్రపోలేదు. ఆమె ఆ గడ్డి కుదుళ్ళను ఒక్కోదాన్ని పెళ్లగించి పారేసింది. అంతేకాదు కుప్పబోసి నిప్పంటించింది. ఇలా పదిహేనురోజులు కవ్వించి తన పొలాన్నంతా శుభ్రం చేసింది.

ఇక సాగు చేయడానికి ఏ అడ్డంకీ వుండదు. ఒకటీ రెండుసార్లు వర్షం పడితే మరీ మంచిది.

చాలారోజులు గడిచాయి. కాని మార్టిన్ ఇంకా పక్కమీదే పడివున్నాడు. అతడి గాయం పూర్తిగా యెండిపోయింది. కాని చాలా నొప్పి వుందని వంక చెబుతున్నాడు. చంటిపిల్లాణ్ణి తండ్రి దగ్గర పడుకోబెట్టి మరియమ్మ రోజూ పొలం పనికి వెళ్ళేది. ఇంటి పనంతా పూర్తిచేసుకొని మేరీకుట్టీ కూడ వాళ్లమ్మకు సహాయంగా పొలం పనికి వెళ్లేది. సాయంకాలానికే వాళ్ళిద్దరూ తిరిగివచ్చేవారు. తిరిగ వచ్చేటప్పుడు పొయ్యిలోకి కట్టెలు కొట్టుకొని కట్టెలమోపు నెత్తిమీద మోసుకొచ్చేది. కత్తి,పార మేరీకుట్టీ తెచ్చేది.

ఇల్లు చేరుకున్నాక మార్టిన్‌తో ఇకముందు చేయాల్సిన పొలం పనులగూర్చి చర్చించేది. "తూర్పువైపు కర్రపెండలం వేద్దాం" అంది మరియమ్మ. "అలాగే" మార్టిన్ పడుకొనే తన అంగీకారాన్ని తెలిపాడు.

"మంచిరకం కర్రపెండలం విత్తనాలు ఇస్తానని పొత్తచ్చన్ చెప్పాడు."

"సరే మంచిదే."

"కుంజమాయన్ వద్ద పెసర విత్తనాలున్నాయి. సేరు అర్ధరూపాయట."

"అలాగే."

"పొలంలో అల్లం, పసుపు వగైరా వేసి చూద్దాం. పొలం పెద్దదికదా. పొత్తచ్చన్ పొలంలో పండిన కాకరకాయలు చూశావా? చాలా పెద్ద సైజున్నాయి. అతణ్ణి విత్తనాలడగాలి. చామదుంపలు కూడ సాగుచేస్తున్నాడు."

ఎలియమ్మ చామదుంపల కూర వండి కొంచెం తినడానికిచ్చింది. ఎంత రుచిగా వుందనుకున్నావ్, వెన్నలా వుంది. అరటిమొక్కల మధ్య చామదుంపలు నాటాలి. కుంజిమాయన్ దగ్గర మిరప విత్తనాలున్నాయి. మిరపపైరు కూడా వేద్దాం."

మార్టిన్ మరియమ్మ ప్రతిమాటకూ "అలాగే" అంటున్నాడు.

అతడివద్ద కొత్త సలహాగాని, ఆలోచనగానీ ఏమీ లేవు.

"మేరీకుట్టీ! నువ్వు తట్ట తీసుకొని పొలాల్లో పేడ ఏరుకొని వచ్చేయ్." ఆమె కూతుర్ని ఆదేశించింది.

మేరీకుట్టీ కొబ్బరి ఆకులతో సంచి తయారుచేసింది. అమ్మచెప్పిన మాటవిని కొబ్బరి ఆకుల సంచిని తీసుకొని పొలాలవెంట పిడకలు ఏరుకోడానికి బయల్దేరింది. నిప్పు ముట్టించడానికి పిడకలు చాలా అవసరం. వాటిని పోగు చేయడం మేరీకుట్టీ పని.

## పదమూడు

రెండు నెల్ల తర్వాత చెరియన్ మరికొంత పొలం కొన్నాడు. అతడు కొన్న పొలంలో అడివిలేదు. కాని దట్టమైన అడవుల్ని గుర్తుకు తెచ్చే నిర్మానుష్య ప్రదేశం అది.

టిప్పుసుల్తాను దండయాత్రకు ముందు సార్థక సంఘంవారు అక్కడి నుండి కూర్గువరకూ ప్రయాణించేవారు. ఆ అడివి నుండి ప్రయాణించేవారికి ధర్మసత్రాలు నిర్మించబడ్డాయి. అలాంటిదే ఒక ధర్మసత్రం తాలూకు శిధిలాలు చెరియన్ పొలం దగ్గర పడివున్నాయి. ధర్మసత్రం చాలాపరకూ శిధిలమైపోయింది. కాని దారికి ఇరువైపులా నాటిన చెట్లూ ఇప్పటికీ అలాగే వున్నాయి. ఆ చెట్లవెనుక ఓ కూలిపోయిన దేవాలయం వుంది. దేవాలయంగోడలు విరిగిపడి వున్నాయి. వాటికింద విగ్రహాలు,

దీపస్తంభం పడివున్నాయి. అక్కడికివెళ్లి వాటిని చూసే ధైర్యం ఎవరికీ లేదు. అక్కడ వాసుకి కంటే పెద్దపాములు వున్నాయని ప్రతీతి. టిప్పుసుల్తాను దండయాత్రకు పూర్వం అక్కడ చాలామంది బ్రాహ్మలు ఇళ్ళు కట్టుకొని వుండేవారు. దండయాత్ర సమయంలో చాలామంది పారిపోయారు. దొరికిపోయినవారిని ముస్లింలు చంపేశారు. అక్కడిబావుల్లో పారిపోయిన బ్రాహ్మణులు బంగారు, వజ్రాలు మొదలైన అమూల్య సంపద పడవేశారు. కాని అక్కడి ప్రజలు పట్టపగలు ఆ ప్రాంతాలకు వెళ్ళడానికి కూడా భయపడతారు.

అక్కడికి తూర్పుదిక్కుగా ఎత్తైన కొండ వుంది. ఆ కొండలోయలో విశాలమైన పొలం వుండేది. ఆ పొలాన్ని కొని చెరియన్ దేవాలయానికి దగ్గరగా ఓ చిన్న ఇల్లు కట్టుకొని అక్కడే ఒంటరిగా నివసించేవాడు. ఆ దేవాలయం తాలూకు కలప, ఇటుకలు, రాళ్లు తెచ్చుకొని ఆ ఇల్లు కట్టుకున్నాడు.

అక్కడికి నాలుగుమైళ్ల దూరంలో తొండియన్ కొండకు రెండవవైపు పొలాలు సాగులోకి వచ్చాయి. వాటిని చూసుకోవడానికి ఏంతోనీని వుంచాడు. చెరియన్ ఏంతోనీ వద్దకు వారానికి ఒకసారి వెళ్లివచ్చేవాడు. అప్పుడే కూలీలకు కూలి డబ్బులిచ్చి పొలంలో చేయించాల్సిన పనులు తెలిపి వెంటనే వాపసు వచ్చేవాడు.

చెరియన్‌కి దగ్గరి స్నేహితుడంటూ ఎవరూ లేరు. కాని అప్పుడప్పుడూ జాన్ బంగ్లాకు పేకాడ్డానికి వెళ్లేవాడు.

## పధ్నాలుగు

కొండలపైన చెట్ల కొమ్మలపైన వ్యాపించిన నీలిఆకాశంలో ఇప్పుడు అక్కడక్కడా మబ్బులు కనిపిస్తున్నాయి.

కొద్దిరోజులపాటు ఆకాశంలో మేఘాలు అటూ ఇటూ పరుగులు తీయ సాగాయి. కాని చివరకు యుద్ధభేరిని మోగిస్తున్నట్లు మేఘాలు గర్జించసాగాయి.

గాలి చెట్లచేత నాట్యం చేయిస్తోంది. గాలితోపాటు కుండపోతగా వర్షం కురవసాగింది. ఎండవేడికి మండిపోయిన కొండలు ఒక్కసారిగా చల్లబడ్డాయి. ఎండిపోయిన పొలాలు, సెలయేర్లు వర్షంతో జీవం పోసుకున్నాయి. కొండలపైనుండి ప్రవహించే నీరు తనతోపాటు ఎరువు, లవణాలు, ఆకులు తెచ్చి కొండలోయ భూముల్లో నింపేసింది.

నల్లమబ్బులతో నిండిన ఆకాశం నుండి ఏకధాటిగా కుండపోత వర్షం కురుస్తోంది. ఆ సమయంలో బయట ఏ ప్రాణీ కనిపించడం లేదు. అడవి జంతువులు కొండగుహల్లో, పక్షులు చెట్ల తొ్రల్లోను, దట్టమైన ఆకులు లోపల దాక్కున్నాయి. గాలి గట్టిగా వీచినప్పుడల్లా చిన్నచిన్న పక్షులు గాలితో పాటు అటూ ఇటూ ఎగిరేవి. మళ్లీ యథాస్థానంలోకి చేరుకునేవి. ఇలా ఒకవైపు ప్రకృతి తనకేళీ కార్యక్రమాన్ని కొనసాగిస్తోంది, మరోవైపు మనిషి తమ తమ పనులకు వెళ్లటానికి వర్షం ఎప్పుడు ఆగిపోవునా అని ఎదురు చూస్తున్నాడు.

మరియమ్మ మనసులో చాలా సంతోషంగా వుంది. ఎందుకంటే తను తవ్విన పొలంలో వర్షం కురుస్తోంది. ఇప్పుడు ఆ నేల విత్తడానికి అనువుగా తయారయింది. వర్షం కురవడంచేత మట్టిరంగు బంగారంలా ఎర్రగా మారింది. ఆ మట్టినుండి మత్తుగొలిపే సువాసన గాలితో వ్యాపించింది.

వర్షం ఆగిపోయిన మరుసటిరోజు వుదయాన్నే మరియమ్మ పొలంలోకి వెళ్లి విత్తడం ప్రారంభించింది.

విత్తనాలు నాటడం, సాళ్లు, మళ్లు, గట్లు వేయడం, ఎరువు చల్లడం, కాలువలు తీయడం, గోతులు పూడ్చడం మొదలైన పనులన్నీ తనకు తెలుసు. మరియమ్మ నైపుణ్యంతో ఆ కొండ ప్రాంతం ఓ చిత్రశాలగా మారింద. పొలాల అంచులు ఖచ్చితంగా లేవు, పొలం గట్లు ఎత్తు పల్లాలుగా వున్నాయి. కాలువలు వంకర టింకరగా వున్నాయి. ఏమైనా మరియమ్మ చాలా తెలివిగా పనిచేసింది. ఆమె కల్పనా చాతుర్యం అనితరసాధ్యం.

పార చేతబట్టి తలవంచుకొని తన పొలంవైపు చూసింది. చూసే కొద్దీ మనసులో ఎంతో సంతోషంగా వుంది. అంతేకాదు తన పనిలో అక్కడక్కడా లోటుపాట్లు కనిపించసాగాయి. ఓసారి గట్టు వెడల్పు చేసేది, మరోసారి మళ్లు పెద్దవిగా చేసేది.

గట్టిగా వర్షం కురవడంతో గట్లన్నీ తెగిపోయాయి. కొండనుంచి వేగంగా ప్రవహించే నీరు మళ్లన్నిటినీ మాయం చేసింది. వర్షం ఆగిపోతూనే మరియమ్మ మళ్లీ మళ్లు గట్టింది. అప్పుడప్పుడూ జల్లులు కురుస్తున్నా నెత్తిమీద చెరుగు కప్పుకొని పనిచేసేది.

వర్షం తెరిపి ఇస్తూనే కప్పలు, కొండ కీచురాళ్లు చప్పుళ్లు చేసేవి. రాత్రిళ్లు-

మిణుగురు పురుగులు మిలమిలా మెరిసిపోయేవి. అప్పుడప్పుడూ విరిసే మెరుపులు చీకటిగదిలో విద్యుత్ బల్బు వెలిగించినట్లు అడివంతా వెలిగిపోయేది. చెవులు చిల్లులు పడేటట్లు కీచురాళ్ళ చప్పుళ్లు వినిపించసాగాయి.

ప్రకృతి సహస్ర కుంభాభిషేకం కొఱకు బాజాబజంత్రీలతో, దీపోత్సవంతో పాటు కృషి దేవతకు స్వాగతం పలుకుతున్నట్లుంది.

మరియమ్మ ఆ వుత్సవాన్ని చూసుకొని పూర్తిగా నీళ్లలో తడిసిపోయి పార భుజాన వేసుకొని తన ఇంటికి చేరుకుంటూనే ఆమె స్వాగతం కొరకు జాన్ పరుగెత్తుకు వచ్చేవాడు.

ఆమె బట్టలు మార్చుకొని చలిమంట కాచుకుంటూ జాన్‌కి పాలు కుడుపుతున్నప్పుడు కూడ ఆమె మనసులో తన పొలాలగురించే ఎన్నో ఆలోచించేది.

మార్టిన్ నిర్వికార సమాధిలో కూర్చున్నట్లు ఓ మూల మౌనంగా కూర్చున్నాడు.

రాత్రి గట్టిగా వర్షం కురవడంతో గుడిసె లోపల పరిస్థితి చాలా అధ్వాన్నంగా మారింది. ప్రతి మూల ఒక ఎదురుబొంగు, చెట్లకొమ్మలు లేపి తాటాకు చాపలతో కప్పి ఆపైన గడ్డీగాదం పరచి గుడిసె వేశారు. ఆ గుడిసెకు వేగంగా వీచేగాలి, జోరున కురిసే వర్షాన్ని తట్టుకోగల శక్తి ఏమాత్రంలేదు. వర్షం నీరు రంధ్రాల నుంచి కారడంతో చాపలూ, పక్కలూ, బట్టలూ అన్నీ తడిసిపోయాయి. అన్నివైపుల నుండి నీళ్లు లోపలికి కారసాగాయి. మరియమ్మ తాటాకు చాపముక్కలు వేసి కప్పు మరమ్మత్తు చేయడానికి శాయశక్తులా ప్రయత్నించింది.

ఆమె ఓ పెద్ద బూరుగాకు నెత్తిమీద పెట్టుకొని జానీకి బట్టలుకప్పి వళ్లో దాచుకుంది. మేరీకుట్టీ ఓ మూల కూర్చొని ఏదో పాట పాడుతోంది.

## పదిహేను

పాల్ ఆ ప్రాంతం చేరి కేవలం పదిహేనురోజులైంది. కాని ఇంత తక్కువ సమయంలో అతడి పేరు ప్రఖ్యాతులు నాలుగువైపులా వ్యాపించాయి. పాల్ ఓ యువరాజులాగా జల్సాగా గడిపేవాడు.

పలంగకోట జమీందారు గుమాస్తా రామకిటావ్, పాల్‌ని తీసుకొని యజమాని దగ్గరకొచ్చాడు.

పలంగకోటవారి కుటుంబంవారు ఓ పాత మేడలో నివసిస్తున్నారు. పాత

గోడలకున్న సున్నం రాలిపోయింది. వరండా అంతా విరిగి పడివుంది. ముంగిలిలో చాలా ఏళ్ళుగా గడ్డి పెరిగిపోయింది. చూడ్డానికి అక్కడక్కడ చాలారోజులుగా ఎవరూ నివసిస్తున్నట్లనిపించదు. ఆ మేడ ఓ మురికి కూపంలావుంది. నిజానికి ఆ మేడ ఆ ప్రాంతానికంతటికి పెద్ద జమీందారు నివాసస్థానం.

కుంజిరామ్ కురుప్పుగారు వరండాలో ఓ మూల పెద్ద బల్లమీద కూర్చుని దంతధావనం చేసుకుంటున్నారు. ఆ సమయంలోనే పాల్, రామకిటావ్ లోపలికి రావడం వారు చూశారు.

పాల్‌కు వరండా ఎక్కి వెళ్లటానికి ధైర్యం చాలటంలేదు. అతడు ముంగిలి ప్రక్కగా నిల్చున్నాడు.

"అక్కడకూర్చో" అయ్యగారు వరండాలో వున్న ఈజీఛైరువైపు చేయి చూపించారు. అదే చేతిలో వున్న మామిడాకు నోట్లో వేసుకొని నమలసాగాడు.

పాతకుర్చీలో కూర్చొని నలువైపులా చూడసాగాడు. అక్కడి మురికి చూసి అతడి మనసులో అసహ్యం వేసింది.

దంతధావనం చేసుకుంటున్న అయ్యగారు ఓరకంట ఆ యువకుడి ముఖంలో మెదిలే భావాల్ని గమనిస్తున్నాడు. చూడ్డానికి ఆ యువకుడు ముచ్చటగాను, మంచివాడుగాను వున్నాడు. అతడు తన మెరిసే బుగ్గలకు కూటికూరా పౌడరు అద్దాడు. అతడి వుంగరాల జుట్టు చక్కగా దువ్వబడి అందంగా వున్నది. అతడి కళ్ళద్దాల ఫ్రేముపై బంగారు కోటింగ్ మెరుస్తోంది. పెదవులపై మెరిసే మీసాలు నల్లని పట్టుదారాల్లా వున్నాయి. మృదువైన పట్టుచొక్కా లోపల వేసిన అల్లిక బనియన్ రంధ్రాలు మెరిసిపోతున్నాయి. మెడలో వేసుకొన్న బంగారు చైను చూడముచ్చటగా వుంది. ఎడమచేతి మణికట్టుకు బంగారు గడియారం కట్టుకున్నాడు. చేతివేళ్లకు వజ్రాలు, వైడూర్యాలు పొదిగిన వుంగరాలు మెరిసి పోతున్నాయి. కట్టుకున్న పట్టుపంచె, జలతారు, పట్టు వుత్తరీయం, నల్లని జోళ్లు నిగనిగలాడుతున్నాయి.

అయ్యగారి దంతధావనం మరికొంత సమయం తీసుకొంది. కళ్లు వార్తా పత్రిక కోసం వెదకసాగాయి. కానీ అతడికి ఎక్కడా పత్రిక కనిపించలేదు. అతడు ఒక జేబునుండి బంగారు సిగరెట్టు కేసు బయటికి తీశాడు. అందులోంచి ఓ సిగరెట్టు తీసి అమెరికన్ సిగార్ లైట్‌తో వెలిగించాడు. సిగరెట్టు దమ్ములాగుతూ నోటినుండి

పొగ రింగులు వదలసాగాడు.

పళ్లు తోముకున్నాక అయ్యగారు వరండాలోకి వచ్చారు.

గుమాస్తా రామకిటావ్ అయ్యగార్కి పాల్‌ని పరిచయం చేశాడు.

"పాల్ బాబుగారు కొంత భూమి కొనాలనుకుంటున్నారు. తమరి వద్ద భూమి కొనడానికి వచ్చారు."

అయ్యగారు గంభీరంగా ఈజీఛైర్లో కూర్చున్నారు. పాల్ జమీందారును బిడియపడుతూ అణకువతో చూశాడు. అతడి వయసు సుమారుగా అరవై, అరవై అయిదేళ్లుంటుంది. ముఖ మండలం తేజస్సు నిండివుంది. అతడి యెద రోమాచ్ఛాదితమై వుంది. ముక్కు పెద్దది.

"నీకు ఎంత భూమి కావాలి?"

"ప్రస్తుతం నాలుగువందల ఎకరాలు కొనాలనుకుంటున్నాను."

"సరే, ఆమాత్రం ఇచ్చేస్తాం."

"భూమి ఖరీదెంత?" పాల్ చిరునవ్వుతో అడిగాడు.

"భూమి వెల రోజురోజుకూ పెరుగుతున్న సంగతి మీకు తెలిసేవుంటుంది. ఎకరా పది రూపాయలు పడుతుంది."

"చాలా ఎక్కువే చెప్పారు."

"రామ్‌కిటావ్ నాకు ఎనిమిది రూపాయల చొప్పున ఇప్పిస్తానని చెప్పాడు. అందుకే నేను అతడి వెంట వచ్చాను."

"ఏమి రామకిటావ్? నీవు వీరికి ఆ రేటే చెప్పావా?" అయ్యగారు గుమస్తావైపు చూశాడు.

"ప్రస్తుతం ఎనిమిది రూపాయలు చొప్పున అమ్ముతున్నారు. ఇప్పుడు రోజురోజుకీ భూమి వెల పెరుగుతున్న సంగతి అందరికీ తెలిసిందే కదా, అని మాత్రం చెప్పాను."

రామ్‌కిటావ్ క్షమించమని కోరుతున్నట్లు ఆగి ఆగి సమాధానం చెప్పాడు.

"సరే, అతడు మీకు అలా చెప్పివుంటే నేను ఆ రేటుకే ఇచ్చేస్తాను. నాలుగువందల ఎకరాల భూమి ఖరీదు మూడువేల రెండు వందలు అవుతుంది. కచేరీ ఖర్చులు మరో మూడువందలు. మొత్తం మూడువేల అయిదువందలౌతుంది మరి, డబ్బు తెచ్చారా?"

"తెచ్చానండీ"

"సరే, నేను మీకు ఓ మంచి సలహా చెబుతాను. మీరు మాకు కావలసినవారు అయినందున మీకు మరో లాభం చేకూర్చాలనుకుంటున్నాను. నేను మీకు ఇదే సొమ్ముకు అయిదువందల యకరాలు ఇస్తాను. అంచేత ఎకరా ఆర్రూపాయలుగా భావించండి."

పాల్‌కి ఆ పెద్దాయన చెప్పేది ఏమీ బోధపడలేదు. పాల్ కళ్లజోడు తీసి చొక్కాతో ముఖం తుడుచుకొని అతడివైపు చూశాడు.

"మిస్టర్, నేను చెప్పిన విషయం మీకు ఏమాత్రం బోధపడినట్లు లేదు? నేను మీరు ఇచ్చే మూడువేల అయిదువందల రూపాయలకు అయిదువందల ఎకరాలు ఇచ్చేద్దామనుకున్నాను. ఆర్రూపాయలు చొప్పున అయిదువందల ఎకరాల ఖరీదు మూడువేలు, కచేరీ ఖర్చులు అయిదువందలు. మొత్తం వెరసి మూడువేల అయిదువందలు. ఇప్పటికైనా నేను చెప్పింది మీకు అర్థమైందా?"

జమీందారు పళ్లు విరిగిన వక్కపలుకుల్లా వున్నాయి. అతడు తన పళ్లను బయటపెట్టి మొదటిసారి పాల్‌ఎదుట నవ్వాడు.

పాల్ కొంతసేపు యోచించాడు. జమీందారు చెప్పిన మాటకు ఒప్పుకొని ధన్యవాదం తెలిపాడు.

గుమాస్తా రామ్‌కిటావ్ ఆశ్చర్యంలో మునిగిపోయాడు. "భూమిని పంట పొలాలుగా తీర్చాలి. మీరు చాలాదూరం నుండి వచ్చారు. మిమ్మల్ని ప్రోత్సహించడం మా కర్తవ్యంగా భావిస్తున్నాము. మీరు చాలా కష్టించి పనిచేస్తారు. అడవుల్ని నరికి బాగా సాగుచేయండి. ఈ ప్రాంతాన్ని వృద్ధిలోకి తీసుకురండి. ఒకవేళ మీకేదైనా కష్టం కలిగితే వెంటనే ఇక్కడికొచ్చి చెప్పండి."

"మీది ఏ వూరు?"

"మధ్య తిరువాన్కూరులో వుండే కుత్తాట్టుకులమ్." పాల్ వినయంగా చెప్పాడు.

"మీతోపాటు ఎవరెవరున్నారు?"

"ఇక్కడ నాతోపాటు ఎవరూ లేరు. నేను ఒక్కణ్ణే. నా నలుగురన్నలూ, చిన్నాయనా ఇంటివద్దే వున్నారు."

"మంచిది, మమ్మల్ని మీ అయిదవ అన్నయ్యగా భావించుకో. ఈ ప్రాంతాన్ని

మీరు మీదిగా భావించండి.''

"జమీందారుగారిచ్చిన సలహాకు, ఆశీర్వాదాలకు నేను సదా కృతజ్ఞుణ్ణి".

"సరే ఇక మీరు వెళ్లండి. దేవుడు మీకు మేలు చేయునుగాక. భూమిని వచ్చే సోమవారం రిజిస్ట్రేషన్ చేయిస్తాము. డబ్బు తీసుకొని రిజిస్ట్రార్ ఆఫీసుకురండి. రిజిస్ట్రేషన్ రాత కోతలన్నీ రామకిటావ్ రాసిస్తాడు.''

పాల్ వెళ్లిపోయాడు. వెంటనే రామకిటావ్ యజమాని ఎదుటికివచ్చి వినయంగా అడిగాడు "మీరు మేల్కొనే వున్నారా? ఆ చట్టన్‌కి వంద ఎకరాల భూమిని వుచితంగా ఎందుకు యిచ్చారు? మీరు అలా ఎందుకు చేశారు?''

జమీందారు నవ్వుతూ చెప్పాడు "రామా, దీనికి జవాబు ఇప్పుడు చెప్పను. రెండేళ్ళ తర్వాత నీకు ఈ ప్రశ్నకు జవాబు దొరుకుతుంది... పాన్ తీసుకరా.''

## పదహారు

మరియమ్మ వేసిన కర్రపెండలం అంట్లు చిగురించాయి. పెసరకూడ మోసులెత్తింది.

మరియమ్మ కొండ క్రింది భూముల్లో పనిచేస్తోంది. పొలంలో విత్తిన వరి విత్తనాలు చక్కగా మొలకెత్తాయి. పొలంచుట్టూ కంచె వేయించాలని లేకపోతే అడివి జంతువులు పొలాన్ని పాడు చేస్తాయని ఆమె ఆలోచిస్తోంది. ఒకే రోజులో పొలం చుట్టూ కంచె వేయించాలి.

రోజుకు అర్ధరూపాయి చొప్పున ఇద్దరు కూలీలను పిలిపించింది. కూలి వాళ్ళు బద్ధకంగా పనిచేయడం చూసి మరియమ్మకు కోపం వచ్చింది. ఆమె మార్టిన్‌ను పిలిపించింది. మార్టిన్ కాలిగాయం ఏనాడో మానిపోయింది. కానీ కాలుకు కట్టిన కట్టు ఇంకా విప్పలేదు. కాలికి ఏదో ఆభరణం ధరించినట్లుగా అందంగా కట్టుకున్నాడు.

మార్టిన్ కుంటుకుంటూ మరియమ్మ దగ్గరకొచ్చి నోరు తెరుచుకొని చూస్తున్నాడు.

"కూలీలు పని దొంగల్లావున్నారు. నీవు వాళ్లచేత బాగా పని చేయించు. నేను ఇక్కడ ఈ గోడ కట్టేస్తాను.'' అంది పనిచేస్తున్న మరియమ్మ.

మార్టిన్ కూలీలవద్ద కెళ్లాడు. ఇలా మొత్తం ముగ్గురి సోమరిపోతులు ఒకచోట కలిశారు.

మరియమ్మ పొలానికి కొండకు మధ్య రాళ్లతో గోడ కడుతోంది. మేరీకుట్టీ పొలం బంకమన్ను తట్టతో తెచ్చి రాళ్ళ మధ్య వేస్తూ పోతోంది.

ఆ పొలానికి ఆగ్నేయంవైపు ఓ కాలి బాట వెళుతుంది. అక్కడ వున్నట్టుండి మనుషుల అలికిడి వినిపించడంతో అటువైపు చూసింది. ఎవరో కొత్తవాళ్లు దారివెంట వస్తున్నారు.

పెట్టెలు, చాపలు, చీపుళ్లు వగైరా నెత్తిమీద వేసుకొని వస్తున్నారు. అంతా బాగా అలిసిపోయివున్నారు. దుమ్ముగొట్టుకుపోయిన బట్టలు, మాసిన జుట్టు, అలసిపోయిన శరీరాలు, కళ్లు గుంతల్లోకి చొచ్చుకుపోయాయి.

వాళ్ల ముఖాలు చూసి మరియమ్మకు జాలి కలిగింది. వేలసంఖ్యలో తరలివచ్చినా హద్దులులేని కొండ ప్రదేశంలో భూమికేమీ కొరతలేదు. యుగ యుగాలుగా బంజరుగా పడివున్న భూమి ఇప్పుడు మనుషులు పంచుకొని దానిమీద తమ హక్కులు ఏర్పరచుకుంటున్నారు. ఇంతవరకూ నిద్రావస్థలో పడివున్న భూమిని మనుషులు సారవంతమైన నేలగా మారుస్తున్నారు.

మరియమ్మ ఇలా ఆలోచిస్తూ వాళ్లను చూస్తుండిపోయింది.

"వర్కీ మనుషులై వుంటారు. ఈవారంలో నలభైమంది వస్తారని వర్కీగారు చెప్పారు." అనుకుంటూ మరియమ్మ ఓ పెద్దరాయి తీసి గోడమీద అమర్చి దానిపైన బంకమట్టి కప్పింది.

## పదిహేడు

జాన్ బంగళా

చెరుక్కాటు వర్కీ పక్కమీద లేచి కూర్చున్నాడు. ఆరోజు వుదయం వర్షం పడలేదు. సూర్యుని స్వర్ణకిరణాలు కొండలను అలింగనం చేసుకుంటున్నాయి. అడివికోయిల కుహూ కుహూ అని అరుస్తోంది.

వర్కీకి వింత వుత్సాహం కలిగింది. చేయిచాచి బల్లమీదున్న టెలిస్కోపును అందుకున్నాడు. కంటికి చేర్చి కిటికీ వెలుపలికేసి దూరంగా చూడసాగాడు.

అక్కడక్కడా కొండలమధ్య అడివిని నరికి ఎన్నో పొలాలుగా మార్చారు. కొండల ఆకారాలు అద్భుతంగా కనిపిస్తున్నాయి. కొన్ని క్రిస్టమస్ కేక్‌లాగా, మరికొన్ని బన్నులాగా వున్నాయి. మరకొన్ని గుమ్మడికాయల్లాగా వున్నాయి. ఇలా అనేక

ఆకారాల్లో చెల్లా చెదురుగా పడివున్నాయి కొండలు.

వర్కీ టెలిస్కోపును రెండోవైపునకు మళ్ళించాడు. దూరంగా కొండలోయలో కూలీల గుడిసెలు కనిపించాయి. తెల్లని బుర్ఖా ధరించి ముస్లిం స్త్రీలు గుంపులు గుంపులుగా పొలం పనులకు వెళుతున్నారు.

మరోవైపు ఓ మావటివాడు ఏనుగును తోలుకొని నదిలోకి దిగుతున్నాడు. ఇంకోవైపు ఓ చిన్న గుట్టమీద తెల్లని ఆకారం కదుల్తోంది. ఆ గొట్టంలోంచి చూస్తే పిల్లిలాగా కనిపిస్తోంది. బాగా గమనిస్తే ఎవరో స్త్రీ పొలంలో ఒంటరిగా పని చేసుకొంటోంది.

"ఆమె మరియమ్మ అయివుండవచ్చు. అది మార్టిన్‌కొండ." అనుకున్నాడు వర్కీ.

అతడు ప్రకృతిలోని ఒక్కోరంగును మార్చిమార్చి సినిమాలాగా చూస్తున్నాడు. పచ్చని ఆకులతో, ఎర్రని మట్టితో, నల్లని కొండచరియలు, తెల్లని యెండు గడ్డితో తయారుచేసినట్లుగా వుంది ప్రకృతి పాన్పు. అది శాంతికి ఆటపట్టు. ఏయే ధనసంపదలు అక్కడ దాచబడివున్నాయో?

వరండాలో ఎవరివో పాదాలచప్పుడు విని అతడు తిరిగిచూశాడు.

ఓతెన కురూప్పు మళ్లీ వచ్చాడు. అతడు అక్కడికి నాలుగోసారి వచ్చాడు. పులంగక్కోట నంబియార్ పొలం చూట్టానికి వర్కీకి ఇంకా సమయం దొరకలేదు.

"యేమండీ టైగర్! ఈరోజైనా వెళ్దామా?" అని నవ్వాడు ఓతెన కురూప్పు.

"అలాగే, నేనూ ఆలోచిస్తున్నాను, ఈరోజు వెళ్దామా అని. లోపలికి వచ్చేయి."

ఓతెనకురూప్పు లోపలికి ప్రవేశించి ఓ చిన్న పడక కుర్చీలో కూర్చున్నాడు.

"నేను గడ్డం చేసుకోవాలి. టీ తాగాలి. మరో గంట సమయం తీసుకొంటుంది " అన్నాడు వర్కీ.

"నేను అందాకా ఎదురుచూస్తుంటాను ' అన్నాడు కురూప్పు. వర్కీ బద్ధకంగా పక్కమీదే కూర్చుండిపోయాడు. అయిదు నిమిషాల తర్వాత మళ్లీ టెలిస్కోపును కళ్లదగ్గర పెట్టుకొని మరోవైపు చూడసాగాడు.

కొంతదూరంలో ఒక కొండ వికృతంగా వుంది. దానిమీద పెద్ద పెద్ద బండరాళ్లున్నాయి. ఆ రాళ్ళమధ్య ఎదురుపొదలు. ఆ బండరాళ్ళకు దగ్గరగా నది ఒడ్డున ఓ అందమైన స్త్రీ దాదాపు నగ్నంగా స్నానం చేస్తోంది.

వర్కీ ఎంతో ఆదుర్దాగా ఆ దృశ్యాన్ని తీక్షణంగా చూస్తూ కూర్చున్నాడు.

వనదేవతలా జల క్రీడలాడే ఆ స్త్రీ ప్రతి కదలిక వర్కీని కామాతురుణ్ణి చేస్తోంది.

వర్కీ ఓవైపు వనదేవత జలక్రీడలు చూస్తుంటే మరోవైపు ఓతెన్‌కురూప్పు ఆ గది సౌందర్యాన్ని తిలకిస్తున్నాడు.

చాలా పెద్దగది. నేలమీద అందమైన కంబళి పరిచివుంది. గోడలకు పెద్దపెద్ద కిటికీలు, రెండు కిటికీలకు అద్దాలు అమర్చారు. గది అంతా ఖరీదైన ఫర్నిచర్ పరిచారు. రౌండ్‌టేబుల్, రోజ్‌వుడ్‌తో చేసిన కుర్చీలు, సోఫాసెట్, అల్మారాలు, బల్లలు, చాపలు. అల్మారాలో ఒక సొరుగులో ఓ కోటు మడిచిపెట్టి వుంచారు. బల్లమీద కొన్ని ఇంగ్లీషు పత్రికలు, పుస్తకాలు, షేవింగ్‌సెట్ అన్నీ చెల్లాచెదురుగా పడివున్నాయి. వేటాడ్డానికి వుపయోగించే పొడవాటి టార్చిలైటు బల్లమీద వుంది. ఖాళీ బ్యాటరీలు అల్మారాపైన కుప్పబోసి వున్నాయి. అల్మారాకు ఓ మూల తుపాకి కూడ వుంది. ఖరీదైన వున్నిబట్టలు, శాలువ, కంబళి వేలాడుతున్నాయి. ముందుగదిలో ఓ ఎదురుబుట్టలో మైలబట్టలు కుక్కారు. నేలమీద కాల్చిన సిగరెట్టు ముక్కలు, కాల్చిన అగ్గిపుల్లలు పడివున్నాయి. మొత్తానికి ఆ గదంతా చాలా మురికిగా వుంది. అక్కడ పడివున్న వస్తువుల్ని బట్టిచూస్తే ఆ యజమాని బాగా డబ్బున్న వ్యక్తిలాగా వున్నాడు.

"కురూప్పు, ఇలా వస్తారా?" టెలీస్కోపు గొట్టం కంటికి చేర్చుకుంటూ అడిగాడు.

కురూప్పు అతడి దగ్గరకు వస్తూనే టెలిస్కోపును అతని చేతికిచ్చి "ఆ నదివైపు జాగ్రత్తగా చూడు. ఓ ఆకారం కనిపిస్తుంది." అన్నాడు.

కురూప్పు టెలీస్కోపును కంటికి చేర్చి కొంతసేపు చూశాడు.

"ఏం చూశారు?"

వర్కీ చిరునవ్వుతో అడిగాడు.

"చాలా వస్తువులు కనిపిస్తున్నాయా?"

"ఆ నది వడ్డున..."

"ఎవతో స్నానం చేస్తోంది."

"ఎవరో గుర్తు పట్టగలవా?"

"స్పష్టంగా కనిపించడం లేదు. కాని ఓ ఆడమనిషి స్నానం చేస్తున్నట్లు మాత్రం తెలుస్తోంది."

"ఒక... ఆడది..." వర్కీ నవ్వాడు. "ఆవిడ ఎవరో నీవు చెప్పగలవా?"

కురూప్పు టెలిస్కోపును కంటినించి తొలగించి సందేహంగా వర్కీవైపు చూడసాగాడు.

"గుర్తు పడితే మాత్రం మీకేమిటి లాభం?"

"ఊరకనే అడుగుతున్నా."

"చూడ్డానికి కృష్ణన్ నంబియార్ మరదల్లా వుంది."

"కృష్ణన్ నంబియార్ ఎవరు?"

"కాలియాబ్ జమీందారు గుమాస్తా."

"ఇక్కడ కేవలం జమీందార్లు, గుమాస్తాలు మాత్రమే వున్నట్లుంది. కాని ఈ నంబియార్ ఎక్కడుంటాడో చెప్పు చాలు?"

"ఆ కాలువకు అవతలివైపు ఒక ఎత్తైన ప్రదేశం వుంది. దాన్నే రాసికనమూల అంటారు. అక్కడే కృష్ణన్ నంబియార్ ఇల్లుంది. మనం చూడ్డానికి వెళ్లే కొండ రాసికనమూల నుండి ఒకమైలు దూరం వుంటుంది.

"సరే" వర్కీ మళ్లీ టెలిస్కోపును కంటిదగ్గర చేర్చాడు. ఇంతలో ఆ వనదేవత కనుమరుగైంది.

"పద మనం త్వరగా వెళదాం." వర్కీ టెలిస్కోపును ప్రక్కన పెట్టి పక్కమీదినుండి లేచాడు.

"టీ, స్నానం, షేవింగ్ ఏమీ వద్దు, త్వరగా వెళదాం పదండి."

వర్కీ నైట్‌గౌను తీసి పక్కమీద వేశాడు. కూనిరాగం తీస్తూ బాత్‌రూమ్‌లోకి వెళ్లిపోయాడు. కురూప్పు కొంత సేపటివరకూ మౌనంగా కూర్చున్నాడు. తరువాత టెలిస్కోపును కంటికి చేర్చి దూరంగా చూడసాగాడు.

అతడికి ఆ స్త్రీ ఆకారం మరోచోట కనిపించింది. ఆమెతోపాటు ఓ యువకుడు కూడా వున్నాడు. కురూప్పు ఆ యువకుణ్ణి జాగ్రత్తగా చూశాడు. కానీ అతణ్ణి గుర్తించలేకపోయాడు. ఆ యువకుడు తెల్లటి చొక్కా నిక్కరు ధరించాడు. ఆ ప్రాంతంలో నిక్కరు ఎవరూ వేసుకోరు. బహుశా చట్టన్లు అయి వుండొచ్చును అనుకున్నాడు కురూప్పు. కాని మాధవికి చట్టన్లతో ఏకాంతంగా కలుసుకొనే ధైర్యం

ఎలా వచ్చింది? కురూప్పుకు సందేహం కలిగింది.

గంటన్నర గడిచింది.

వర్కీ టీ తాగి, గడ్డం చేసుకొని, స్నానం చేసి కొత్తబట్టలు వేసుకొని వచ్చేశాడు. అతడు పొడువాటి పైజామా, నీలిరంగు చొక్కా వేసుకున్నాడు. చొక్కాముందు భాగం కోటులా తెరుచుకొని వుంది. కాని దానిమీద పది, పదిహేను ముత్యపు ముక్కలు బటన్లమాదిరి కుట్టివున్నాయి. గుండ్రటి నీలిరంగు కళ్ళద్దాలు వేసుకున్నాడు. అతడి భుజానికి కెమెరా తగిలించుకున్నాడు. నల్లగా మెరిసే బూట్లు కాళ్లకు వేశాడు.

వర్కీ శరరీం కారు నలుపు. ముఖంమీద కాట్లు పడివున్నాయి. ఆ నల్లని ముఖానికి అతడి తెల్లని తలవెంట్రుకలు కొంత అందాన్నిచ్చాయి.

"మనం ఆ రాసికనమూలా నుండే వెళ్లాలి కదా?" వర్కీ నవ్వుతూ అడిగాడు.

కురూప్పు అతడి నోట్లో రెండు బంగారు కట్టుడు పళ్ళను చూశాడు.

"ఔను, ఆ మార్గం నుండి కూడ వెళ్లవచ్చు." కురూప్పు విచారంగా చెప్పాడు.

"సరే, ఆ దారినే వెళదాం." వర్కీ కళ్లుమూసుకొని మూర్ఖుడిలాగా నవ్వాడు.

అతడు గోడకు తగిలించిన టోపీ తీసుకొని నెత్తిమీద పెట్టుకున్నాడు. అల్మైరా పైనుండి మలక్కా చేతికర్రను తీసుకొని తమాషాగా తిప్పుతూ, ఈల వేసుకుంటూ వర్కీ బయటకు నడిచాడు. "ఒరేయ్ తొమ్మన్" వర్కీ వరండాలో నుండి పిలిచాడు. తొమ్మన్ వంట గది నుండి వరండాలోకి వచ్చాడు.

"ఈరోజు కోడికూర వండు " అని చెప్పి ఈలేసుకుంటూ తల తిప్పుతూ నడవసాగాడు. అతడివెనక కురూప్పు నడిచాడు.

వాళ్లు కొండదిగి పొలాల్లోకి చేరుకున్నారు. గుట్టలూ, కాలిబాటలూ దాటుకుంటూ చివరికి రాసికనమూలా దగ్గరకు చేరుకున్నారు. పొలానికి పడమటివైపు ఎత్తు ప్రదేశంలో ఓ తోట, ఆ తోటలో ఓ మేడుంది.

కురూప్పు ఆ మేడవైపు వేలు చూపించి "కృష్ణన్ నంబియార్ ఇల్లు అదే." అన్నాడు.

వర్కీ ఆ యింటి నలువైపులా పరికిస్తూ నడుస్తున్నాడు.

నడుస్తూ నడుస్తూ ఆ యింటికి ఎదురుగ్గా వున్న పొలంలోకి చేరుకున్నాడు. అక్కడ ఓ చిన్న కాలువ వుంది. కాలువపైన వంతెన ఏమీలేదు. అంచేత కాలువలోకి

దిగి దాటాలి.

"మనం ఈ కాలువలోకి దిగి దాటాలి " అన్నాడు కురూప్ప.

"చెప్పులు విడవండి."

"ఎందుకూ, నేను కాలువ పైనుండే దూకేస్తాను " అన్నాడు వర్కీ.

వర్కీ ఆ తోటను చూస్తూ ముందుకు నడుస్తున్నాడు.

ఆ యింటికి బయట ఎవరూ లేరు. ఆ యింటి వంటగది పొగగొట్టం నుండి పొగ బయటికి వెళుతోంది. దక్షిణంవైపు తోటలో ఓ తెల్లటి ఆవు గడ్డి మేస్తోంది. ఆ తోటకు వెలుపల ఓ ఆవుదూడ చచ్చి పడివుంది. దాన్ని రాబందుల గుంపు పలుచుకు తింటున్నాయి.

వర్కీ నెత్తిమీది నుంచి టోపీ తీశాడు. తన ఛాతీకి తగిలించుకొని కాలువ మీదికి దూకాడు. కాలువ వెడల్పుగాను లోతుగాను వుంది. అతడు దమ్మున కాలువలో పడ్డాడు. అతని దృష్టి చెదిరిందో లేక కాలు జారిందో తెలీదు.

వర్కీ నడుంలోతుకు బురదలో కూరుకుపోయాడు. బయటికి రావటానికి ప్రయత్నించాడు. కాని అతడి కాళ్లు ఇంకా లోపలికి కూరుకుపోతున్నాయి.

కురూప్ప వెంటనే వెనకనుండి వచ్చి వర్కీ బురదలోకి మునిగిపోక ముందే బయటికి లాగి వడ్డుకు చేర్చాడు.

అతడి బట్టలు బురదతో నిండిపోయాయి. అతడి ముఖానికి బురద అంటుకొని చూట్టానికి అసహ్యంగావుంది. నీలిరంగు చొక్కా, పైజామా అన్నీ బురదమయం అయిపోయాయి. ఎంతో చక్కగా అలంకరించుకున్న ముక్కు, ముఖమూ, కళ్లూ, చెవులూ అన్నిటికీ నల్లటి బురద. అసలు అతణ్ణి కనుక్కోవడమే దుర్లభంగా వుంది. నల్ల కళ్లజోడు, టోపీ, చేతికర్ర బురదలో కూరుకుపోయాయి.

అతడు నోట్లోకి వెళ్లిన బురదను వుమ్మితో వూశాడు. కళ్లూ, చేతులూ ముఖమూ అన్నీ కడుక్కొని తలవంచుకొని నిల్చున్నాడు. కాలువకు దగ్గర్లో నున్న చెట్ల పొదల్లోనుండి నవ్వుని బలవంతంగా ఆపుకుంటున్న శబ్దం వినిపించింది.

వర్కీ తల తిప్పి చూశాడు. ఓ యువతి నవ్వుతోంది.

కురూప్ప నవ్వు ఆపుకుంటూ "బాబుగారు ఇప్పుడు యేం చేద్దాం" అని అడిగాడు.

వర్కీ తన శరీరాన్నంతటినీ ఒకసారి చూసుకున్నాడు. చివరికి ఈర్ష్య,

అసహ్యం, నిరాశ, అసహాయత చుట్టుముట్టగా తనూ నవ్వసాగాడు.

"పదండి, కృష్ణన్‌నంబియార్ ఇంటికి వెళ్లి స్నానంచేసి బట్టలు మార్చు కొందురు." అని కురూప్పు తన అభిప్రాయం చెప్పాడు.

"వద్దు వద్దు" వర్కీ తల అడ్డంగా తిప్పాడు. అతడు థూ, థూ అంటూ వుమ్మేస్తున్నాడు. "మనం వెనక్కి వెళదాం పద" అంటూ మళ్లీ వూశాడు.

"ఈ వేషంలో? పొలాల్లో పనిచేసే ఆడాళ్లు నవ్వి ఎగతాళి బట్టిస్తారు." కురూప్పు అందుకు ఒప్పుకోలేదు.

"అయితే ఎక్కడైనా దాక్కుని కూర్చుంటాను." అంటూ వర్కీ తన చెవి రంధ్రాల్లోకి వేళ్లు జొరిపి బురద తీస్తున్నాడు.

"దాక్కుని కూర్చోవద్దు , అక్కడ ఆ అరటితోటలో తలకిందబెట్టి కాళ్లుపైకెత్తి నిల్చో."

అదే చెట్ల పొదలనుండి ఆ మాటలతోపాటు బిగ్గరగా నవ్వుకూడ వినిపించింది.

కురూప్పు ఆ పొదల్లోకి వెళ్లిచూశాడు.

"ఎవరూ? మాధవీ! నువ్వా? ఇక్కడ ఏంచేస్తున్నావు?" కురూప్పు నవ్వుతూ అడిగాడు.

"నేను ఆవును కట్టెయ్యడానికి వెళుతున్నాను. ఇంతలో మిమ్మల్ని చూసి ఇక్కడ దాగాను. అది సరే ఈ పోకిరీ ఎవడో చెప్పండి?"

"ఇతడు తిరువాన్కూరు నివాసి. చాలా ధనవంతుడు."

ఈ మాటలు వర్కీకి కూడా వినిపిస్తున్నాయి. మాధవీ! అతడి హృదయం తపించింది. ఆమెను కనీసం ఒకసారి దగ్గరనుండి చూడాలనిపించింది. కానీ ప్రస్తుత పరిస్థితి అనువుగా లేదని గ్రహించాడు. వర్కీకి చాలా కోపం కలిగింది, దేవుడు ఈ అడవుల్లో కాలువలు ఎందుకు సృష్టించాడు అని. వీటి అవసరం ఇక్కడ ఏముందని, కేవలం ఇతరులను ఇబ్బంది పెట్టడానికి తప్ప.

"ఏమయింది, వీరెవరు? ఏమిటీ వర్కీగారా? ఇది ఎలా జరిగింది?"

నిక్కరు, తెల్లచొక్కా వేసుకొన్న ఓ యువకుడు అక్కడికి వచ్చాడు. వర్కీని పలకరించాడు.

"ఎవరూ, ఏంతోనీ? నీవా! కాలు జారి బురదలో పడిపోయాను. అబ్బ,

బలే బురదయ్యా ఇది.''

కురూప్పు సంశయంగా ఆ యువకునికేసి తీక్షణంగా చూశాడు.

''వర్కీగారు, రండి. మా ఇంటికిపదండి.'' ఏంటోనీ వర్కీతో చెప్పాడు. ''నదిలో శుభ్రంగా స్నానంచేసి బట్టలు మార్చుకొని వచ్చేద్దాము '' అని.

''అలాగే, తప్పకుండా. పదవస్తాను.'' వర్కీ చాలా సంతోషించాడు. ''ఏంటోనీ, నా టోపీ, కళ్లజోడు, మలక్కా చేతికర్ర ఈ బురదలో కూరుకుపోయాయి. కాస్త వెతికిపెట్టవూ.''

ఏంటోనీ బురదలో వాటిని తచ్చాడసాగాడు. టోపీ, చేతికర్ర దొరికాయి. కాని కళ్లజోడు కనిపించలేదు.

''కురూప్పు నువ్వు వెళ్లిపో.''

వర్కీ కురూప్పును పిలిచి ''నేను ఈ కుర్రాడి వెంట వెళుతున్నాను. భూమి చూడ్డానికి మనం వచ్చే వారం వెళదాం.''

''మంచిది, అలాగే చేద్దాం.'' కురూప్పు పొదలమధ్య నుండి చెప్పాడు. వర్కీ, ఏంటోనీ కాలువ గట్టమ్మిటే తూర్పుదిక్కుగా నడవసాగారు.

## పద్ధెనిమిది

మరియమ్మ పొలంచుట్టూ కంచకు బదులుగా గోడ కట్టడం ప్రారంభించింది. ఆ పని పూర్తి అయింది. కర్రపెండలం అంట్లు చిగిర్చాయి.

ఎంతటి రమణీయ దృశ్యం అది. ఎన్నోరకాల కర్రపెండలాలు - ఎర్రరంగు 'చుండాపడర్పన్, పచ్చరంగు పెల్లారోటి, నల్లరంగు కరియాలవన్ మొదలైనవి. పట్టులాంటి మృదువైన చిగుళ్లు గాలికి తలలూపుతూ ఆ కొండపొలాల్ని కప్పివేసినట్టుంది. పొలాల్లో పరచుకొన్న ఆ ప్రకృతి అందాల్ని చూట్టానికి మరియమ్మ రోజూ అక్కడికి వెళుతుంది.

ఓరోజు మాట. ప్రతిరోజులాగానే మరియమ్మ ఆరోజు కూడా వుదయాన్నే లేచి కొండ పొలాలవైపు వెళ్లింది. ఆ కొండెక్కి తన పొలంవైపు చూస్తూనే అవాక్కయిపోయింది. అక్కడ పరిస్థితి అంతా తారుమారయింది. కానీ తన కళ్లను తానే నమ్మలేకపోతోంది. తన కళ్లు బాగానే పనిచేస్తున్నట్టు తానే నమ్మలేకపోతోంది. తన కళ్లు బాగానే పనిచేస్తున్నట్టు నమ్మకం కలుగుతూనే ఆమె తల పట్టుకొని

ఏడవసాగింది.

"ఓరి భగవంతుడా! సైతాను మమ్మల్ని మోసం చేసింది."

సైతాను అడివిపందుల రూపంలో వచ్చింది. ఆ పందులు క్రపెండలం పాదులన్నిటినీ తొవ్వేసి సర్వనాశనం చేశాయి. చెల్లాచెదురుగా పడిన క్రపెండలం అంట్లనుచూసి మరియమ్మ యేడ్చింది. ఆమె హృదయంలో దుఃఖం పెల్లుబికింది. చాలాసేపు నెత్తిమీద చేతులేసుకొని ఏడుస్తూండిపోయింది. మళ్లీ మళ్లీ ఆ దృశ్యాన్ని చూళ్లేకపోయింది. అక్కడినుండి వెంటనే ఇల్లు చేరుకొంది. తొమ్మిది గంటలకు ఇల్లు చేరుకొని చూస్తే మార్టిన్ ఇంకా నిద్రపోతున్నాడు. అది చూసి మరియమ్మ అరికాలిమంట నెత్తికెక్కింది. మార్టిన్ పందిలాగా పడుకొని ఇంకా నిద్రిస్తూనే వున్నాడు. ఆమె పండ్లు పటపట కొరికింది. మార్టిన్ దగ్గర చేరింది. అతడి నెత్తిమీద గట్టిగా బాదసాగింది. పందులమీద కోపం అంతా మార్టిన్ నెత్తిమీద బాది తీర్చుకోసాగింది.

మార్టిన్ లేచి కూర్చున్నాడు. అతడు మరియమ్మవైపు యేమీ జరగనట్టే చూస్తున్నాడు. మరియమ్మ మళ్లీ పిడికిలి బిగించి నెత్తిమీద కొట్టసాగింది.

మార్టిన్ మరియమ్మ దెబ్బలు కాచుకోడానికి చేయి తలమీద పెట్టుకున్నాడు. అతడు నవ్వుతోంటే మురికిపళ్లు బయటకు కనిపిస్తున్నాయి. అతడి మనసులో ఏదైనా భావం కలిగితే ఇలాగే పళ్లు బయటపెట్టి నవ్వడం మొదలెడతాడు. అతడికి మరియమ్మ కోపం కేవలం హాస్యంగానే వుంటుంది. ఎంతబాదినా, రక్కినా మార్టిన్ లెక్క చేసేవాడుకాదు. అతడు అబ్బా! అని కూడ అనడు. అతడి స్వభావం మరియమ్మకు మరింత కోపం కలిగిస్తుంది. ఆమె మళ్లీ, మళ్లీ కొడుతుంది, కనీసం అతడు ఏదో ఒక సమాధానం చెబుతాడని. కాని అతడు ఏమీ పట్టించుకోడు సరికదా జవాబుకూడ చెప్పేవాడు కాదు.

మరియమ్మ విసిగిపోయింది. బయటికివెడుతూ వెడుతూ వరండాలో ధబేల్మని కిందపడింది. గుండెలు బాదుకుంటూ ఏడవసాగింది. మార్టిన్ను కొట్టినందుకు తను ప్రాయశ్చిత్తము చేసుకొనేది. తనమీద తనకే కోపం వచ్చేది. తల్లిని చూసి పిల్లలు కూడ బోరుబోరున యేడవసాగారు. ఆ పిల్లలకు అసలు యేం జరిగిందో కూడ తెలియదు. భార్య పిల్లల యేడ్పులు విని మార్టిన్ బయట యెక్కడో కూర్చొని గోళ్లు గిల్లుకుంటూనో లేదా కోడి ఈకతో చెవిలో గుబిలి తీసుకొనేవాడు.

కొంతసేపటికి వాతావరణం చల్లబడింది. ఆ తర్వాత మరియమ్మ లేచి వంటగదిలోకి వెళ్లింది. వంట వండింది. "మీ నాన్నను పిలు" మేరీకుట్టీ ఇంటిబయట కూర్చున్న తండ్రిని పిలవడానికి వెళ్లింది.

మార్టిన్ ఆ సమయంలో ఓ మగకప్ప ఆడకప్ప కలుసుకుంటుంటే సంబరంగా చూస్తున్నాడు.

"నాన్నా, భోజనానికి రండి" మేరీకుట్టీ దూరం నుండి చూసి పిలిచింది.

మార్టిన్ తనకేమీ వినిపించనట్టే కూర్చున్నాడు.

అతడు ఆ ఎర్రటి కప్పలను చూస్తూ యేదో యోచిస్తున్నాడు.

అతడు ఆ రెండు ప్రాణులను మైథున క్రియనుండి విడదీయటానికి ప్రయత్నించాడు. కానీ అవి వేరు కాలేదు. అవి రెండూ ఒకదాని కొకటి అతుక్కుపోయాయి. తర్వాత ఓ పెద్ద రాయి తీసికొని వాటిమీద వేశాడు. అవిరెండూ కలిసే నలిగి చచ్చిపోయాయి. వాటి ఎర్రతోలు చితికిపోయి కడుపునుండి తెల్లటిపదార్థం బయటపడింది. మార్టిన్ తన మురికి పళ్లు బయటపెట్టి నవ్వసాగాడు.

"నాన్నా భోంచేద్దురు రండి" మేరీకుట్టీ తండ్రి చేయి పట్టుకొని లాగింది. మార్టిన్ లేచి వంటగదివైపు నడిచాడు.

తల్లీ తండ్రీ పిల్లలూ భోంచేయడానికి దగ్గరదగ్గరగా కూర్చున్నారు. భోంచేస్తూ మధ్యలో మరియమ్మ అంది.

"మన కర్రపెండలం తోటను అడివిపందులు సర్వనాశనం చేశాయి."

అసలు మార్టిన్‌కి యేమీ వినిపించినట్టే లేదు. అతడికి అదే దృశ్యం కనబడుతోంది. ఆ రెండు ప్రాణులు మైథున దశలో యెలా నలిగిపోయిందీ. అతడికి చాలా ఆనందంగా వుంది.

"ఏమండోయ్, నిన్నే! మన కర్రపెండలం తోటను పందులు పాడు చేశాయి." మరియమ్మ గరిటతో మార్టిన్ ముక్కుమీద పొడుస్తూ అంది.

"మరి పందుల్ని తుపాకీతో పేల్చలేదా?" ఓ సేనాధిపతి తన సైనికుడికి ఆదేశాలిస్తున్నట్టుగా మరియమ్మను అడిగాడు.

"నీకు తుపాకి పేల్చటం వచ్చా?"

"నేను పోలచ్చన్‌ను అడిగి తుపాకీ తీసుకవస్తా. రాత్రిళ్లు కొండమీద పందుల కాపలా కాయి. అవి మన పొలంలోకి వస్తూనే తుపాకీ పేల్చు" మరియమ్మ చెప్పింది.

మార్టిన్ యేమీ బదులు చెప్పలేదు.

అతడు ఈ విషయం ఆలోచించనే లేదు.

"పందిని తుపాకీతో కాల్చగలవా?"

మరియమ్మ అన్నం వడ్డించే గరిటతో మరో మారు ముక్కుమీద పొడుస్తూ అంది.

మార్టిన్ పై పెదవిని ముందుకు చాపి ఆలోచిస్తున్నాడు. అతడు యే విషయాన్నైనా గంభీరంగా తీసుకున్నప్పుడు పైపెదవిని లెటర్‌బాక్సు మూతి పైభాగంలో వుండే షేప్‌లాగా ముందుకు సాగదీస్తాడు.

"మాంసం ముక్కల్లో ఔట్లు కలిపి పొలంలో పెడితే చాలు. ఆ ముక్కల్ని తింటూనే ఔట్లు పేలి పందులు చచ్చి వూరుకుంటాయి." మార్టిన్ పందుల్ని చంపే రెండోమార్గం సెలవిచ్చాడు.

మరియమ్మ అందుకు ఒప్పుకుంది.

ఆ సాయంత్రమే మరియమ్మ, మార్టిన్ మాంసం ముక్కల్లో ఔట్లు కలిపి కర్రపెండలం పాదుల్లో పెట్టారు.

మరుసటిరోజు వుదయాన్నే పొలంలో చచ్చిన పందులకోసం మరియమ్మ పరుగుతీసింది. తీరా చూస్తే అక్కడ ఓ అడవినక్క తలపగిలి చచ్చివుంది. పంది బొచ్చుకూడా రాల్లేదు. కాని కయ్యల్లో కర్రపెండలం చెల్లాచెదురుగా పడివుంది. దీన్నిబట్టి చూస్తే పందిముండ మళ్లీ పొలంలోకి వచ్చినట్టే వుంది.

## పంధొమ్మిది

వేల సంఖ్యలో క్రిష్టియన్లు ఈ ప్రాంతంలో నివాసమేర్పరచుకున్నారు. వాళ్లు ఇక్కడికి చేరి చాలా మాసాలు గడిచిపోయాయి.

ఇక్కడ ముందుగా నివాసమేర్పరచుకొన్నవాళ్లు కొత్తగా వచ్చి చేరిన వాళ్లతో దూరం దూరంగా వుండేవారు. తిరువాన్కూరు నుంచి వచ్చిన కొత్త చెట్టన్లను బొత్తిగా యిష్టపడేవారు కారు. వాళ్లంటే వీళ్ళకి అనుమానం, ఈర్ష్యతోపాటు విరోధులుగా వుండేవారు.

కొత్తవాళ్ల ప్రవర్తన కూడా అంత బాగా వుండేదికాదు. యిక్కడ ముందుగా బసచేసిన వాళ్లను పల్లెటూరి మొద్దులుగా భావించేవారు. మంచి సారవంతమైన

భూమిని తడపడానికి ఆకాశం మీద ఆదారపడ్డం చాలా మూర్ఖంగా భావించేవాళ్లు. ఈ కొండల్లో అడవుల్లో లెక్కలేనంత డబ్బు ఎలా సంపాదించాలో చేసి చూపిస్తాం. అలా సంపాదించి ఈ పల్లెటూరి మొద్దులచేత తమ పొలాల్లో పశువుల్లా పనిచేయిస్తాం. ఈ అరణ్య సామ్రాజ్యాన్ని తమ స్వంతం చేసుకొని ఇక్కడ ఓ కొత్త క్రిష్టియన్ సామ్రాజ్యాన్ని స్థాపిస్తాం.

కొత్తగా వలస వచ్చినవారి ప్రవర్తన, స్వభావం వల్ల పాతవాళ్ల హృదయాల్లో కొత్తవాళ్లంటే అసహ్యం, ఈర్ష్య ఏర్పడ్డాయి.

ఎవరినీ కష్టపెట్టకుండా పవిత్ర జీవితాన్ని గడిపే యెందరో క్రిష్టియన్లతో పాటు దుర్మార్గులు, దొంగలు కూడ అక్కడ చేరారు. కొందరు తిరువాన్కూరులో నేరాలు చేసి పోలీసులబారి నుండి తప్పించుకోడానికి మలబారు కొండల్ని ఆశ్రయించారు. మరికొందరు దుర్మార్గులు మలబారు పల్లెల్ని దోచుకోడానికి చొరబడ్డారు. అలాగే తమ మాటకారి తనంతో శ్రమ పడకుండా బ్రతికేసే ఏజంట్లు కూడా ప్రవేశించారు. నీతి నిజాయితీని ప్రక్కకు నెట్టి క్రిష్టియన్లు అత్యధికంగా భూమిని ఆక్రమించుకొనే ప్రయత్నం చేసేవారు. వాళ్లు అక్కడి అమాయక కూలీ నాలీ జనాల్ని బెదిరించి వారిచేత బలవంతంగా పని చేయించేవారు.

"ఈ మూర్ఖులకు తిరువాన్కూరువారి నిజస్వరూపం యింకా తెలీలేదు. మేము డబ్బుపోసి భూమిని కొని దానిమీద యెంతో చెమటను దారపోశాము. ఈ బంగారు పొలాలవైపు కన్నెత్తి చూశారంటే మీ కాళ్లు నరికేస్తాము" అని వారు అంటుండేవారు.

స్థానీయులు భయంతో వారి బంగారు పొలాల్ని చూసేవారు కాదు. దీనికి భిన్నంగా స్థానీయుల పంటల్ని దొంగిలించడం దోచుకోవడంలో యేమాత్రం సంకోచించేవారు కాదు.

దొంగతనాలు చాలా ఎక్కువగా జరిగేవి. కుంజప్ప నంబియార్ తోటలో నాలుగు అరటిగెలలు మాయమయ్యాయి. అంబుకురుప్ప తోటలో పనస చెట్టు నుండి తేనెలాంటి పనస పళ్లను దొంగిలించుకుపోయారు. ఒనకన్నాయి ఆవును ఎవరో తోలుకుపోయారు. కనరాన్ ఇంటి వరండాలో ఉంచిన ఇత్తడి గిన్నెల్ని, రాగి గిన్నెల్ని ఎవరో దొంగిలించారు. అక్కడ ఓ విచిత్రమైన పరిస్థితి ఉత్పన్నమైనది.

రాత్రిపూట తాడు మీద ఆరేసిన బట్టలు, వంటగది ముందున్న అంట్లు,

వరండాలో వుంచిన వ్యవసాయ పనిముట్లు, కళ్లాల్లో ఆరబోసిన ధాన్యం వగైరా మరసటిరోజుకు మాయమయ్యేవి.

వాదులాటలు, కొట్లాటలు రోజురోజుకి పెరిగిపోయేవి. కొద్ది రోజుల్లోనే రెండు హత్యలు కూడా జరిగాయి. యుగయుగాల నుండి అక్కడ నెలకొన్న శాంతి, సౌహార్ద్ర పూర్ణ వాతావరణం ఇప్పుడు అక్కడ సమాప్తమయినది. ఆ పల్లెల్లో జరిగే లూటీలు, దుర్మార్గాల వార్తలు విని అక్కడ పోలీసులు గస్తీ తిరేగేవారు. పరిస్థితి పూర్తిగా విషమించింది.

క్రొత్తగా చేరిన క్రైస్తవులతో పాటు ఏసుప్రభువు ప్రతినిధుల రూపంలో బైబిలు, క్రాసు చేత బూని కొందరు ఫాదరీలు కూడా అక్కడికి చేరారు. క్రైస్తవులకు సన్మార్గము చూపించడానికి ఈ ఫాదరీలు అక్కడికి వచ్చారు. పులులు, సింహాలు, ఏనుగులు సంచరించే కీకారణ్యాన్ని ఇప్పుడు నరికివేశారు. అక్కడ ప్రజలు చర్చిలు, స్కూళ్లు కట్టించారు. వాళ్లు దొంగచాటుగా హిందువుల దేవాలయాల్ని పడగొట్టి మేరీకన్య విగ్రహాల్ని ప్రతిష్టించారు. అడవి గద్దలు ఎగిరే కొండల మీద ఇప్పుడు ఎత్తైన క్రాసులు వెలిశాయి.

రాత్రిపూట మిణుకు మిణుకుమని ప్రకాశించే మిణుగురు పురుగుల స్థానంలో క్రొవ్వొత్తులు, దీపాల వెలుతురు కనిపించసాగింది. చర్చిల్లో ప్రార్థనా గంటలు మోగేవి. సామూహిక ప్రార్థనలు, క్రైస్తవ వేడుకలు జరిగేవి. మొత్తానికి ఆ అడవి కోలాహలంగా మారింది.

చర్చికి దగ్గర్లోనే క్రైస్తవుల స్మశానవాటిక వెలసింది.

## ఇరవై

పాల్, పాళంగకోట జమిందారు దగ్గర ఐదువందల ఎకరాల భూమి కొన్నాడు. కేవలం ఆ భూమి హద్దులకు కంచె వేయడానికే చాలా ఖర్చయినది. అతడు తన భూమికి "బడలాం ఎస్టేట్" అని పేరు పెట్టుకొన్నాడు. అతడు తన పొలం అంతటిని సాగు చేయాలనుకున్నాడు.

పాపచ్చన్ అనే పనికిమాలిన వాడు అతడికి గుమస్తాగా కుదిరాడు.

తోటల్లో పనిచేయడానికి కూలీలు దొరికేవారు కారు. అంచేత పాల్ బాధల్లో చిక్కాడు. చుట్టుపక్కల వాళ్లు సాధారణంగా తమ తమ పొలాల్లో పనులు

చేసుకొనేవారు. మధ్యాహ్నం వరకు తమ జమీందారుల వద్ద పనిచేయాల్సి వచ్చేది. తరతరాలుగా అలా గడిచిపోతూండేది. క్రొత్త భూకామందులకు కూలీలు దొరికేవారు కాదు. తిరువాన్కూరు నుండి వచ్చిన పేద ప్రజలు పాల్‌కు సహాయపడేవారు కాదు. వాళ్లు తమ తమ పొలాల్లో రాత్రింబవళ్లు పనిచేసుకొనేవారు.

ఒకరోజు ఉదయాన్నే పాల్, పాపచ్చన్ జాన్ బంగళాకి ఎదురుగా రోడ్డుమీదకి వచ్చి నిల్చున్నారు.

ఆ లోయలో ఇంకా మంచు వ్యాపించివుంది. పార, తట్ట తీసుకొని కూలీవాళ్లు తమ తమ జమీందారుల పొలాలకి వెళుతున్నారు. ఒక ముసలివాడు మోకాళ్ల వరకు తుండుగుడ్డ చుట్టుకొని చినిగిన చొక్కాతో గొడ్డలి, పార భుజానికి తగిలించుకొని ఆ రోడ్డుమీద వెళుతున్నాడు.

"ఏమయ్యా, మీ యజమాని పొలంలో పనిచేయడానికి వెళుతున్నావా?" పాల్ తనను పరిచయం చేస్తూ చిరునవ్వుతో ఆ ముసలి వాడికి నమస్కరించాడు.

పాల్ ప్రేమపూర్ణ వ్యవహారం చూసి ముసలివాడు కొంచెం అభిమానం వినయంతో పళ్లు బయటపెట్టి అక్కడే నిల్చున్నాడు.

పాల్ జేబులోంచి బంగారు సిగరెట్‌కేస్ తీశాడు. అందులోంచి ఓ సిగరెట్ తీసి ముట్టించుకొని మరొకటి పాపచ్చన్‌కు ఇచ్చాడు. సిగరెట్ పొగ వదుల్తూ పాల్ ముసలివాడిని అడిగాడు.

"అయ్యా, నీ పేరేమిటి?"

"చాత్తు" అని ముసలివాడు నవ్వుతూ చెప్పాడు.

"మీకు యజమాని పొలంలో పనిచేస్తే ఎంత కూలీ ముడుతుంది?" అని పాల్ అడిగాడు.

"రోజుకి ఆరు అణాలు ఇస్తారు." చాత్తు తల ఊపుతూ సమాధానమిచ్చాడు.

"ఆరు అణాలా!" పాల్ సిగరెట్ పైకి తీసి, నోరు తెరిచి ఆశ్చర్యంగా పాపచ్చన్ వైపు చూశాడు.

"ఆరు అణాలా? అబద్ధం చెబుతున్నావా? ఆరు అణాలు అయి వుండదు." పాల్ తల వూపుతూ చెప్పాడు.

"ఆరు అణాలే బాబు." చాత్తు గట్టిగా సమాధానం చెప్పాడు.

పాల్ పెదవులతో చప్పరించి ముసలివానివైపు జాలిగా చూస్తూ వుండి

పోయాడు.

"'ఏమిటయ్యా, మీరేమంటున్నారు? ఈ కొండభూముల్లో రాళ్లు రప్పలతో చెమట, రక్తమోడ్చి పనిచేసే కూలీలకు మీ యజమాని కేవలం ఆరు అణాలే ఇస్తున్నారా? నాకు నమ్మశక్యంగా లేదు."

"మాకందరికి ఆరు అణాల లెక్కన ముడుతుంది. అంతకంటే ఒక్క పైసా కూడా ఇవ్వరు."

చాత్తూ గడ్డం గోక్కుంటు ఇట్లన్నాడు. "ముందురోజుల్లో కేవలం నాలుగు అణాలే ఇచ్చేవారు, కాని యుద్ధం మొదలైన తర్వాత ఆరు అణాలైంది."

పాల్ ఏదో చెడువాసన చూస్తున్నట్లు ముక్కుమీద వేలు పెట్టుకొని నలువైపులా చూశాడు.

"పాపచ్చన్! ఈయన చెప్పేది నీవు విన్నావా?" అంటూ పాల్ పాపచ్చన్‌వైపు చూశాడు. "వీళ్లకి రోజుకి కేవలం ఆరు అణాలే ఇస్తారట. ఇది నిజంగా నరహత్య లాంటిదే కదూ?"

"ఖచ్చితంగా! ఇదో రకమైన నరహత్యే." పాపచ్చన్ పాల్ మాటను సమర్థించాడు.

"మీకు పెళ్లాం పిల్లలు కూడా ఉన్నారు కదా! అని పాపచ్చన్ అడిగాడు

"ఇద్దరు పిల్లలు, ముసలి తల్లి వుంది. నా పెళ్లాం క్రిందటి సంవత్సరమే వెళ్లిపోయింది."

"వెళ్లిపోయిందా? ఎక్కడికి?"

"అదికాదు, ఆయన చెప్పేదేమంటే తన పెళ్లాం చనిపోయిందట." పాల్ పాపచ్చన్‌కి వివరించాడు.

"కేవలం ఆరు అణాలతోనే ఈ పెద్దమనిషి తన కుటుంబాన్ని పోషించుకోవాలా?" పాపచ్చన్ సిగరెట్ పొగ వదులుతూ అడిగాడు.

"కష్టంగానే గడుస్తుంది. కాని మా యజమాని మాకు పొలం కూడా యిచ్చాడు. ఆ పొలం నుంచి కూడా మాకు కొంత ఆదాయం వస్తుంది."

"అట్లయితే ఈ ముసలాయన కేవలం తన పొలంమీద ఆధారపడి సంతోషంగా వుండవచ్చు. యజమాని ఇచ్చే ఆరణాలకోసం ఈ ముసలితనంలో కొండలు ఎక్కడమెందుకు. ఇది నాకేమీ బోధపడటంలేదు."

"మేము తరతరాల నుండి మా యజమాని దగ్గరే పనిచేస్తున్నాము. మరి మేము పనికి వెళ్లకపోతే..."

"ఏంటీ? యజమాని ఏంచేస్తాడు?". "అట్లైతే మీ యజమాని మీకేమీ సహాయం చేయడు కదా."

"హా...హా...హా" పాపచ్చన్ అపహాస్యంగా నవ్వాడు. ముష్టి అరణాలే కదా మీ యజమాని ఇచ్చేది. ఇది ఏమంత గొప్ప సహాయం?"

మా ప్రాంతంలో కూలీలకు ఎంత కూలీ ఇస్తారో మీకు తెలుసా?" పాల్ అడిగాడు. "రోజుకి మూడు రూపాయలు. మూడు బ్రిటిషు రూపాయలు."

"మూడు రూపాయలిచ్చి మధ్యాహ్నం కడుపునిండా భోజనం పెడతారు." పాపచ్చన్ మరింత స్పష్టంగా చెప్పాడు.

"పార చేతబట్టి పొలంలో అడుగుపెడితే చాలు మూడు రూపాయలు, మధ్యాహ్నం భోజనం ఖరారైనట్టే." పాపచ్చన్ నెత్తిమీద చేయి పెట్టి ప్రమాణం చేస్తున్నట్లు చెప్పాడు.

"తిరువాన్కూరులో కూలీకి యజమానికి ఏమీ తేడాలేదు" అని పాల్ అన్నాడు.

"ఎవరైనా పార చేతబట్టి పని చేసినంతమాత్రాన అతడు మనిషికాదు అని భావించడం పొరపాటు. మా ప్రాంతంలో పని పూర్తవుతూనే యజమాని నౌకరు ఇద్దరూ ప్రక్కప్రక్కనే కూర్చొని సారా తాగుతారు. పేకాడతారు. ఈ మలబారు ఓ వింత ప్రదేశం. ఇక్కడ యజమాని పక్కమీద పడుకొని ఆదేశాలు ఇవ్వడానికే... పాపం కూలివాళ్లు కొండలు పిండి మైదానాలుగా చేస్తారు. యజమాని అరణాలు కూలీ విసిరివేస్తాడు. చాలా వింతగా వుది."

"చూడు బాబు!" పాపచ్చన్ సిగరెట్ముక్క పారేసి ఉపన్యాసం ఇవ్వసాగాడు.

"అటు చూడు! అక్కడ కొండల్లో, లోయల్లో రెపరెపలాడే పొలాలు కనిపిస్తున్నాయి కదూ, అవన్నీ మీ అమాయక ప్రజల చెమట, రక్తంతో తడిచి పండుతున్నాయి. మీ యజమానులు కేవలం వారి పొలాలనే చూస్తారు. కాలు తీసి పొలంలో అడుగైనా వేయరు. కాని ఆ విలువైన పంట ఫలితాన్నంతా మీ యజమాని అనుభవిస్తాడు. కష్టించి, పనిచేసే కూలీలకు చివరకు ఏమీ మిగలదు. పంటలమ్ముకొని యజమానులు వేలు సంపాదిస్తారు. అందులో ఒకపైసా కూడా

మీకు లభించదు. మీకైతే మాత్రం మాంసం కూర, వేయించిన చేప తినాలని కోరిక ఉండదా? మంచి, మంచి బట్టలు వేసుకోవాలనిపించదా? నీకూ ఇలాంటి కోరికలుంటాయి, కాని అవి మీకు తీరవు, అంతేకదూ?''

''మీరూ మనుషులే కదా? కానీ మీ కోర్కెలు చంపుకొని పశువుల్లాగా పనిచేసి చనిపోతారు. ఆరణాలకి బియ్యం, కూరలు అతి కష్టంమీద లభిస్తాయి. బజారులో ఎక్కడైనా ఎండు చేపలే కనిపిస్తే మీరు కళ్లు మూసుకోవలసి వస్తుంది. ఎందుకంటే వాటిని కొనడానికి మీదగ్గర డబ్బులుండవు. నేను చెప్పేదేంటంటే ఈ అన్యాయానికి మీరే కారకులు. ఇతరుల్ని తప్పు పట్టాల్సిన అవసరం ఏమీ లేదు.''

పాపచ్చన్ చివరిమాటలు ఎవరో కమ్యూనిస్టు నాయకుని పలుకులను కాపీ కొట్టినట్లు వుంది. చాత్తుకు పాపచ్చన్ మాటలు అర్థం కానప్పటికి అందులో కొంత సత్యం ఉన్నట్లుగా గ్రహించాడు. అతడి ముఖంమీద వున్న చిరుదహాసం ఇప్పుడు నిరాశగా మారింది. అతడు ఏదో ఆలోచనలో పడ్డాడు.

''పాపచ్చన్! నీవు నా బంగళాకి వెళ్లి ఒక క్రొత్త పంచె తీసుకురా. వీరిని చూస్తేంటే నాకు చనిపోయిన మా నాన్నగారు గుర్తుకొస్తున్నారు. కనీసం ఈ పెద్దమనిషి ఓ మంచి పంచైనా కట్టుకొంటే చాలు. ఇతడు ఇక్కడి జమీందారు కూలివాడు కావచ్చుకాని మన పొరుగువాడు. త్వరగా వెళ్లి తసుకురా.'' పాల్, పాపచ్చస్ భుజంమీద చేత్తో తట్టి పంపించాడు.

పాపచ్చన్ ఓ క్రొత్త పంచె తీసుకొచ్చాడు. పాల్ ఆ పంచె ముసలివానికి యిచ్చాడు.

''అయ్యా! ఇది తీసుకోండి. మిమ్మల్ని ఈ స్థితిలో నేను చూడలేక పోతున్నాను.''

చాత్తు ఎంతో కృతజ్ఞతతో, వినయంగా పంచె తీసుకొన్నాడు. పాల్‌కి ధన్యవాదాలు చెప్పాడు. అతడు నమస్కరిస్తూ కొండవైపునున్న పొలాల వైపు బయలుదేరాడు.

## ఇరవై ఒకటి

తరమూట్టిల్‌చాక్కో గత ఆరుమాసాల నుండే మలబారులో వుంటున్నాడు. అతడు పాలా నుండి వచ్చాడు. అతడితోపాటు ఇద్దరు తమ్ముళ్లు, మామ మలబారు వచ్చారు.

కుంజితొమ్మన్ అనే ఏజెంటు మాటలు నమ్మి తన ఆస్తినంతా చౌకగా అమ్మేసి మూడువేల రూపాయల్లు చేతబట్టుకొని మలబారు వచ్చేశాడు.

పొలము గట్రా కుంజితొమ్మన్ కొన్నాడు. తిరువాన్కూరు వెళ్లి కూలీలను, కర్రపెండలం అంట్లు తెస్తానని చెప్పి చాక్కో దగ్గర మూడువందల రూపాయలు పట్టుకెళ్ళాడు. చాక్కో దగ్గర అప్పుడు ఆమాత్రమే డబ్బు వున్నది. కాని కుంజితొమ్మన్ తిరిగి మలబారు రాలేదు.

చాక్కో బాగా చదువుకున్న వ్యక్తి. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. తన పనేదో తాను చూసుకొనేవాడు.

మలబారు చేరిన కొద్ది మాసాల్లోనే తను తెలివి తక్కువపని చేశానని భావించాడు. 'పౌరధాని' అనే ఓ పాత పత్రిక తీసి చదవసాగాడు. కానీ మనసును పత్రికమీద కేంద్రీకరించలేకపోతున్నాడు. అతడు తన జీవితం గురించి ఆలోచించసాగాడు.

తన దగ్గర వున్న డబ్బంతా ఖర్చయిపోయింది. వున్న డబ్బంతా కొండ పొలాల మీద ఖర్చుచేశాడు. మంచి పంట దిగుబడి రావాలంటే ఎరువు బాగా వేయాల్సిన అవసరం వుందని అతడికి తెలుసు. కానీ అతడికి చేయూత ఇచ్చే వాడెవడూ లేడు. తన భవిష్యత్తు అంధకార బంధురంగా మారిందని తలపోయసాగాడు.

కానీ అతడికి తనకంటే పొరుగువారి కష్టాలు మరింత బాధ కలిగించసాగాయి. అజ్ఞానం, ఆత్మరక్షణ భావం అక్కడి క్రైస్తవులను పూర్తిగా ఆవరించింది. కొత్తగా వలస వచ్చినవారు పాతవాళ్లతో స్నేహసంబంధాల్ని మెరుగుపరచుకొనే ప్రయత్నాలు చేశారు. కానీ ఫలితం లేకపోయింది. స్థానీయులను భయపెట్టడం, బెదిరించడం మామూలైపోయింది. దాంతో క్రైస్తవులందరికీ చెడ్డపేరు వచ్చింది.

తనను చూస్తూనే స్థానీయులు పక్కదారి పట్టి వెళుతున్నట్లు చాక్కో తెలుసుకున్నాడు. చాక్కో వాళ్లని చూసి పలకరింపుగా నవ్వినప్పుడు వాళ్లు ముఖం చాటేశేవారు. దీనికంతటికీ కారణమేమిటి? స్థానీయులలో అవిశ్వాసం, భయం కలగడానికి కొందరు కిరస్తానీ దుర్మార్గులే కారణమని అతడికి తెలుసు.

యిక్కడ క్రైస్తవుల హృదయాల్లో దయా, ప్రేమా వున్నాయి. అంతేకాదు స్థానీయుల యెడ ఎలాంటి పగ, ద్వేషం కూడా లేదు. అజ్ఞానం చేత వాళ్ల హృదయాల్లో నిండిన భయాన్ని అణచుకోవడానికి వాళ్లని బెదిరించేవారు.

ఇరుగుపొరుగు స్థానీయులు ఎప్పుడైనా తమకు హాని కలగచేస్తారనే భావం వాళ్లను వెంటాడుతోంది. ఒకరిమీద ఒకరు విశ్వాసం, ప్రేమ పెంచుకోవడం ద్వారా శాంతిని స్థాపించవచ్చనే ఆలోచన వాళ్లకు రావటంలేదు. బెదిరించి తమ బలహీనతలను మరుగుపరుచుకోజూస్తున్నారు.

ఎదురుగా కాలిబాట నుండి ఏవో అరుపులు విన్నాడు చాక్కో. పది-పదిహేను మంది క్రైస్తవులు సారాయితాగి చేతుల్లో కత్తులు కటార్లు పట్టుకొని కేకలు వేసుకుంటూ వస్తున్నారు.

## ఇరవై రెండు

తొండియస్ కొండకు దక్షిణభాగాన వున్న పొలాల్లో ఓమూల వెదురుతో అల్లిన గుడిసెవుంది. అందులో ఏంతోనీ ఏకాంతంగా ప్రశాంతంగా నివసిస్తున్నాడు. అతడు కొండకు ఓవైపున నువ్వులపైరు వేశాడు. మరోవైపు జీడిమామిడి మొక్కలు నాటాలని అనుకుంటున్నాడు. కొండకి పైభాగాన అడివిని నరుకుతున్నారు. అతడు లోయ పొలాల్లో వరి, గుడిసెకు నలువైపులా అరటి, ఘుయియా, క్యారెట్టు, పచ్చిమిరప, పెసర, దోసపాదులు వేశాడు.

కాయగూరల తోట, వరిపొలం చూసుకోవడానికి ఏంతోనీ ఎల్లవేళలా గుడిసెలో వుండేవాడు. కూలీలు వుదయం నుండి మధ్యాహ్నం వరకూ పొలాల్లో పనిచేసుకొని వెళ్లిపోయేవారు. అంతవరకూ ఏంతోనీ ఒంటరిగా ఏకాంతంగా గడిపేవాడు.

ఏకాంతంగా వుండటం ఏంతోనీకి ఎంతో యిష్టం. అతడు స్వయంగా వంట వండుకొనేవాడు. మిగిలిన సమయంలో దేవుని ప్రార్థిస్తూ స్వాధ్యయనంలో కాలం గడిపేవాడు.

అతడు బ్రహ్మచర్యాన్ని ఎంతో నిష్టగా నిర్వర్తించేవాడు. బ్రహ్మచారిగా వుంటూనే చదువుకున్నాడు. క్రైస్తవ మత శాస్త్రంలో ప్రావీణ్యం సంపాదించాడు. బాల్యంలోనే తల్లిదండ్రులు స్వర్గస్తులయ్యారు. అతడి పెంపకం అంతా బాబాయి చెరియన్ నీడన జరిగింది. అతడు పవిత్ర కన్య మేరీ మాతను తల్లిగా, ఏసుప్రభువును తండ్రిగా భావించుకొని ఒక ఫాదరువద్ద చదువుకోసాగాడు. చదువుకొనే రోజుల్లోనే తనూ, ఫాదరు కావాలని ఆకాంక్షించేవాడు. అతడు అనునిత్యం దైవప్రార్థనకు తన

జీవితాన్ని అర్పించదలచాడు. అతడు ఏసుప్రభువును కొలిచేటప్పుడు కేవలం ఒకే వరాన్ని కోరేవాడు, తాను ఫాదరీ కావాలని.

దురదృష్టం కొద్దీ అతడి చదువు పూర్తికాలేదు, ఇంతలోనే వాళ్ల బాబాయి మలబారు వెళ్లాలని నిర్ణయించుకున్నాడు. తన బాబాయితో పాటే అతడూ మలబారు వెళ్ళాల్సి వచ్చింది.

అతడు ఏ గడ్డమీద జన్మించాడో, ఆ గడ్డను వదిలి కొత్త ప్రాంతానికి చేరుకున్నాడు. కొత్త ప్రాంతంలో తన ఆచార-వ్యవహారాల్లో మార్పు వచ్చింది. తన భుజాలమీద కొత్త బాధ్యతలు వచ్చిపడ్డాయి. కష్టాలు వచ్చినప్పటికీ అతడు తన మతపరమైన భావాలనూ ఆదర్శాలనూ విడనాడలేదు.

తనవద్ద సదా నల్ల అట్టవేసిన బైబిల్ గ్రంథాన్ని వుంచుకొనేవాడు. అతడు పడుకొనే మంచానికి తలకట్టవైపు గోడకు ఏసుప్రభువు పటము తగిలించాడు. పటానికి రెండువైపులా ఎల్లప్పుడూ క్రొవ్వొత్తులు వెలుగుతుండేవి.

అతడు మతగ్రంథాలను కొనుక్కొనో లేదా అరువు తీసుకొని ఏకాంతంగా ఏకాగ్రతతో మననం చేసేవాడు.

"నీవు ఏ మట్టిలో జన్మించావో మళ్లీ ఆ మట్టిలో కలిసిపోయేంతవరకూ తన కోరికలను తృప్తిపరచుకొ. ఎందుకంటే జీవితం క్షణభంగురమైనది, ఏదో ఒకనాడు నీవు ఆ మట్టిలో కలిసిపోకతప్పదు."

అతడు ఈ పంక్తులను కొన్ని వేలసార్లు వల్లెవేశాడు.

సృష్టి గురించి బైబిల్ రాసిన విషయాలు అతడికి ఎంతో ఆసక్తిగా వుండేవి.

"దేవుడు సృష్టి నిర్మాణానికి ఆదమ్‌ను, అవ్వను సృష్టించాడు. వాళ్లను బాగా పెరిగి వ్యాపించమని ఆశీర్వదించాడు. నీవు నీ సంతానాన్ని ఈ భూమినంతటినీ వ్యాపించేటట్లు ఉత్పత్తి చేయమన్నాడు. పృథ్వినంతటినీ ఆక్రమించు. నీవు భూమ్యాకాశములు, జలములో వ్యాపించిన ప్రాణులన్నిటినీ శాసించు."

ప్రభువు ఈ నేలమీద మొలిచే ప్రతి మొక్కనూ, వృక్షాన్నీ వుపయోగించుకోమని చెప్పాడు. నీరు, భూమి, ఆకాశంలో వ్యాపించిన ప్రాణులన్నీ భోజన యోగ్యములే. చివరికి మొక్కలు, ఆకులు కూడా."

ఏంతోనీ బైబిల్లో చెప్పబడిన బోధనలను చదివి పొలాలవైపు దృష్టి సారించి ఆలోచనల్లో మునిగిపోయాడు. వెన్నెల్లో మునిగిన ప్రతి చెట్టూ, మొక్కా, ప్రకృతీ

సమస్తం ధర్మ ప్రబోధనలను వల్లె వేస్తున్నాయి. ఈ భూమిని దేవుడు తన తోటలాగా పెంచాడు.

మానవుడి యౌవన దశ చాలా సున్నితమైనది. ఈ వయసులో నున్న మనిషిని ఓ చిన్న గాలితెమ్మెర కూడా మార్చగలదు. మనిషి మతపరమైన ప్రవృత్తి గలవాడైతే ఓ మంచి ఆధ్యాత్మికుడుగానో లేదా తాత్వికుడుగా రూపొందవచ్చు. ఎంతోనీకి స్త్రీ ప్రేమ యెడల విపరీతమైన అసహ్యం. అతడికి మతసూక్తులు, ప్రబోధనలు అమిత రుచికరమైనవి. ప్రతి మనిషికీ తెలిసో తెలియకో యౌవన దశలో స్త్రీల యెడల విముఖత చూపే సమయం వస్తుంది. ఆ కారణంగా అతడు మానసిక సంక్షోభానికి గురి కావలసివస్తుంది. పరిసరాల ప్రభావంచేత బలం పుంజుకొని ఈ మానసిక బాధలు పెరిగే అవకాశం కూడ వుంది. అప్పుడప్పుడూ జీవితపు కఠోర అనుభవాలు, భావి సుఖభోగాల ప్రలోభాల వల్ల ఈ మానసిక బాధలు తగ్గనూవచ్చు. ఆదిశంకరాచార్యులు, స్వామి వివేకానంద మొదటి తరగతికి చెందిన పురుషులు. ఏంతోనీ వారి అడుగుజాడల్లో నడిచేవాడు. అసలు అతడికి స్నేహితులంటూ ఎవరూలేరు, అంచేత చెడు మార్గం పట్టే అవకాశమూ లేదు. ఆ కొండ ప్రదేశంలో పండే ప్రతి పండునూ దేవుడికి నైవేద్యంగా సమర్పించుకున్నాడు.

పగలు గడుస్తున్నకొద్దీ చీకటి వ్యాపించసాగింది. అతడు తన వెదురు గుడిసెలో కూర్చుని చీకట్లో మునిగిపోయిన ఆ అడివిని చూస్తుండిపోయాడు. నక్కల అరుపులు ప్రేతాత్మల పిలుపుల్లా వినిపిస్తున్నాయి. ఆ అడివి ఓ నరకంలా వుంది. అడివికి ఎదురుగా కొండభూమికి ఒకవైపు ఓ యింటిలో వెలిగే దీపం కాంతి కనిపిస్తోంది. ఆ యిల్లు కృష్ణన్ నంబియార్‌ది. ఏంతోనీ సాధారణంగా పాలం పనిముట్లు అరువుగా తీసుకెళ్లడానికో లేదా పాలు కొనడానికో ఆ యింటికి వెళుతుంటాడు. కానీ ఆ యింటి యజమాని కృష్ణన్ నంబియార్‌ని ఎప్పుడూ చూచి యెరుగడు. అతడు కారియాట్టు కురూప్పు జమీందారు గుమస్తా. నెల్లో కనీసం ఇరవైరోజులు అతడి పొలాల్లోనే లేదా వేటలోనే మునిగి వుండేవాడు. అతడి ఇంట్లో యౌవనవతియైన మరదలు మాధవి, ఓ ముసలావిడ, మరో ఇద్దరు ముగ్గురు పనివాళ్లు వుండేవారు. ఏంతోనీ మాధవితో కబుర్లు చెబుతుండేవాడు. మాధవీ ఎంతోనీతో తిరువాన్‌కూరులో అతడి స్వగ్రామం గురించి, అక్కడి జీవితం, ఆచార-వ్యవహారాలు, అతడి కుటుంబీకుల గురించి అడిగి తెలుసుకోవడంలో

ఆసక్తి కనపరచేది. అతడు కూడా ఎలాంటి మొఖమాటం లేకుండా ఆవిడ అడిగిన విషయాలన్నీ చెప్పేవాడు. ఆ అమ్మాయి పల్లెటూరి యాస అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. అంతకంటే మించి ఆ అమ్మాయిగురించి ఆలోచించే సమయంకూడా అతడికి లేదు.

మాధవి అప్పుడప్పుడు పాలచెంబుతో ఏంతోనీ యింటికి వస్తుండేది. పనివాళ్లతో పనసపండుతో చేసిన పాయసం, తినుబండారాలు కూడా పంపించేది. అతడు గుడిసె వసారాలో వేసిన మంచంమీద పడుకోబోయేముందు బైబిల్‌లో యిచ్చిన ప్రార్థనా గీతంలోని మొదటి చరణాన్ని ''స్వర్గంలో వున్న ఓ దేవా...'' అని ఉచ్చరించేవాడు. అతడి దగ్గరే ఓ తుపాకి, లాంతెరూ వుండేవి. అతడు పడుకోబోయేప్పుడు కూడా మాధవి యింటి దీపం వెలుగుతుండేది.

ఏంతోనీ రోజూ తెల్లవారుఝామున మూడున్నర గంటలకల్లా నిద్రలేచేవాడు. ఆ సమయంలో వాలిపోయే చందమామ వెన్నెల్లో కొండలూ, పొలాలూ వెండిలాగా మెరిసేవి. వెన్నెల రాత్రివేళ ఇంటి కప్పుమీద, తాడి, అరటిచెట్ల ఆకులమీద మంచు కనిపించేది.

అంతటి చలిలో ఏంతోనీ దుప్పటి కప్పుకొని లాంతరు ఎదురుగా కూర్చుని బైబిలు చదివేవాడు. ఆ సమయంలో దూరంగా ఎక్కడో ఏడుస్తున్నట్లు అస్పష్టంగా వినిపించేది. ఈ ఏడుపు శబ్దం మాధవి బావినుంచి నీళ్లు తోడేప్పుడు తాడు-గిలక ఘర్షించుకొని వస్తుండేది.

# ఇరవై మూడు

ఆ ప్రాంతమంతా అల్లకల్లోలంగా వుంది. ఎక్కడో ఒకచోట కొట్లాటలు, దోపిడీలు జరుగుతుండేవి. క్రైస్తవులు పీకలదాకా సారా తాగి వీధులమ్మిటే బూతులు వల్లిస్తూ తిరిగేవారు. ఆ పరిస్థితుల్లో ఆడవాళ్లు ఇంట్లోంచి బయటకు ఎలా వెళ్లగలరు?

కొత్తగా వలస వచ్చినవారి ఆచార వ్యవహారాలు పాతవారికి అపహాస్యంగా వుండేవి.

వంటరిగా వెళుతున్న చెట్టన్లను చూసి పిల్లలు ఎగతాళి పట్టించేవారు. పిల్లలు తెల్లని గడ్డంతో నల్లని దుస్తుల్లో వున్న ఫాదరీలను అపహాస్యంచేస్తూ ''ఏంటో ఇతడూ ఫాదరీయా లేక దయ్యమా?'' అనేవారు. ఫాదరీలు పిల్లలను చూసి నిలుచొని

వాళ్లకి సూక్తులు చెప్పడానికి ప్రయత్నించేవారు.

"ప్రియమైన పిల్లలారా! ఇతరులను ఎగతాళి చేయడం పాపం. ఇతరులను అపహాస్యం చేసిన పిల్లలు నరకానికి వెళతారు. అక్కడి వాళ్లను నాలుగు తలల కుక్క కాటేస్తుంది."

స్థానీయులు చెట్టన్లను చూసి నవ్వేవారు. వారు మెడలో క్రాసు వేసుకొనేవారు. వారి స్త్రీలు చెవుల్లో లావుపాటి ఆభూషణాలు వేసుకొనేవారు.

కుంజుండి వడ్రంగి తొమ్మన్ చెట్టన్ ఇంటికి కఱ్ఱ కుర్చీ అమ్మడానికి వెళ్లాడు. కాని అతడు ముక్కుమూసుకొని వుమ్మి వూసుకుంటూ వాపసు వచ్చేశాడు. అసలు ముక్కూ నోటితో గాలి కూడ పీల్చలేకపోతున్నాడు. అక్కడి పరిస్థితిని చూసి కణారన్ బండివాడు అడిగాడు "ఏమయింది మిత్రమా? ఏమిటి విషయం?"

కుంజుండీ వడ్రంగి వుమ్మి వూస్తూ అన్నాడు. "నేను బుద్ధినేరక తొమ్మన్ చెట్టన్ గుడిసెలోకి వెళ్లాను, అక్కడవాళ్లు ఆవు మాంసం తింటున్నారు."

"కేలన్ తెల్లావు చచ్చింది. కేలన్ దాన్ని భూమిలో పాతిపెట్టాడు. ఈ కిరస్తానీలు పాతిపెట్టిన ఆవును తవ్వి వెలికి తీసి మాంసం కోసుకొని యెండబెట్టుకుంటున్నారు. నీవు కూడా ఓ ముక్క రుచి చూచి వచ్చావా యేమిటి?"

"యేంటీ, ఈ కిరస్తానీలు జంతువులతో సమానమా?" కుంజుండీ వుమ్మి వూయసాగాడు. "వీళ్లు ఎలుకల్ని కూడా తింటారు."

"బహుశా వీళ్లు మనుషుల్ని కూడా తినగలరు."

"అవకాశమే దొరకాలిగాని, వీళ్లు అందుక్కూడా సంకోచించరు."

కణారన్ బండితోలుకొని ఒకవైపూ, కుంజుండి వుమ్మి వూసుకుంటూ మరోవైపూ వెళ్లిపోయారు.

కొత్తగా వలస వచ్చిన వారిలో చాలామంది పేదవారు. వాళ్లు దగ్గరున్న సొమ్మునంతా వ్యవసాయానికి ఖర్చుచేశారు. స్త్రీ పురుషులు చాలా కష్టించి పనిచేసేవారు. శ్రమ చేయడానికి ఆరోగ్యం కావాలి. ఆరోగ్యం చక్కబరుచుకోవాలంటే మంచి భోజనం కావాలి. కాని వాళ్లకు పుష్టికరమైన ఆహారం లభించేదికాదు, ఎందుకంటే వాళ్లు పేదరికంలో వున్నారు. చేపలూ, మాంసం కొనడానికి వాళ్లదగ్గర డబ్బుల్లేవు. ఎండుచేపలు ఖరీదు చేయడానిక్కూడ కష్టంగావుంది. బియ్యం సేరు రూపాయిన్నర వెల పలికేది. ఆహార పదార్థాల్లో ఎలాంటి మార్పూ లేదు. ఆ తినేది

కూడా పుష్టికరమైనదికాదు. పిల్లలు తీట, రక్తహీనత (పౌష్టికాహారం లభించనిచో పిల్లల కడుపు పెరగడం, శరీరం యెండిపోవడం)తో బాధపడేవారు. వృద్ధులకు పాండురోగం అంటుకుంది. వీళ్లు చనిపోయిన ఆవుల్ని, నేలమీద ప్రాకే క్రిమి కీటకాలను పట్టుకొని తినేవారు.

వాళ్ల ఏకైక వినోదం స్త్రీ పురుష సంగమమే.

ఆ కొండల మధ్య క్రైస్తవుల గుడిసెల సంఖ్య బాగా పెరిగింది.

కొందరు వ్యవసాయంతోపాటు కిరాణా వ్యాపారం, టీ దుకాణం నడిపేవారు. కొచ్చువర్కీ అక్కడ 'చెరుపుష్ప విలాసం' అనే హోటల్ తెరిచాడు. చాక్కో దళారీ అయ్యాడు. యిట్టూప్పన్ చాపలు, తట్టలు, బట్టలూ వగైరా ఇంటి సామాన్ల దుకాణం పెట్టాడు. పాంధాడీ థామస్ తన యింటి బయట హోమియోపతి డాక్టర్ బోర్డు తగిలించాడు.

# ఇరవై నాలుగు

చాత్తు తనకు పాల్ యజమాని కొత్త ధోవతి బహుమతిగా యిచ్చాడని వూరంతా చాటింపు వేశాడు.

"చాలా దయగల వారు యీ యజమానులు." పిల్లల్లాగా మాట్లాడతారు. చాత్తు ఆ క్రైస్తవులగురించి చాలా మంచిగా ప్రచారం చేశాడు.

పక్షం రోజుల తర్వాత పాపచ్చన్ చాత్తూను పిలిచి అడిగాడు. "పాల్ యజమాని వద్ద పనిచేయడానికి వస్తావా? కూలీ రోజుకు రూపాయి."

చాత్తూ రోజంతా దానిగురించే ఆలోచించాడు. రెండవరోజు వంట్లో బాగోలేదని యజమాని పనికి వెళ్లలేదు. మూడోరోజు కూడా పన్లోకి వెళ్లలేదు. నాలుగోరోజు తెల్లారు ఝామున్నే లేచి చాత్తు పార చేతబట్టి పాల్ యజమాని తోటలోకి పనికి వెళ్లాడు.

పని పూర్తవ్వగానే ఆరోజు మధ్యాహ్నమే పాపచ్చన్ చాత్తు చేతిలో రూపాయి నోటు పెట్టాడు.

రెండోరోజు చాత్తూతోపాటు మరో నలుగురు కూలీలు పనిలోకి వెళ్లారు.

నలువైపులా ఈ వార్త వ్యాపించింది. "పాల్ యజమాని కొండమీది పొలాల్లో పనిచేసే వాళ్లకి ఓ రూపాయి కూలీతోపాటు మధ్యాహ్నం భోజనం కూడా

పెడుతున్నారు.''

ఈ వార్త అందుతూనే కూలీలు పాల్ యజమాని వద్ద పనిచేయడానికి ఆకర్షితులయ్యారు.

పాల్ 'బడలామ్' తోటలో పనిచేయడానికి చాలామంది కూలీలు వచ్చేశారు. వాళ్లు పాత జమీందార్లను వదిలిపెట్టి కొత్త యజమానులవద్ద ఆశ్రయం పొందారు. దీంతో స్థానీయ హిందూ జమీందార్లు ఇబ్బందుల్లో పడ్డారు. అయినా ఆ జమీందార్లు కూలిరేటు పెంచలేదు. వాళ్లు ఈ ఆకర్షణ ఎంతకాలం కొనసాగుతుందో వేచి చూస్తున్నారు.

రెండువారాల తర్వాత 'బడ్‌లామ్' తోటలో పనిచేసే కూలీలకు మధ్యాహ్న భోజనం ఆగిపోయింది.

పాపచ్చన్ కూలీలను సముదాయించాడు, "రేషన్లో బియ్యం దొరకడంలేదు. రేషన్లో బియ్యం దొరికినప్పుడే అన్నం పెడతారు.''

ఆరోజు వాళ్లకు కూలిమాత్రమే లభించింది.

ఓ నెల గడిచింది.

పాపచ్చన్ ఓ రోజు కూలి డబ్బులు పంచుతున్నాడు. కూలీలు యిచ్చిన డబ్బులు లెక్కపెట్టుకున్నారు. వాళ్లకి డబ్బు తక్కువ యిచ్చినట్లు సందేహం కలిగి మళ్లీ లెక్కెట్టుకున్నారు. వాళ్లు డబ్బులు చేతబట్టుకొని పాపచ్చన్‌ని అడిగారు "యేంటి, ఆరణాలే యిచ్చారు?''

"ఔను, అరణాలే యిచ్చాను.'' పాపచ్చన్ కటువుగా చెప్పాడు.

"అదేంటి బాబూ! కూలీ ఒక రూపాయి గదా?''

"కాదు. యికనుంచి ఆరణాలే యిస్తారు. కర్రపెండలం ధర పడిపోయింది. అంతేగాకుండా తిరువాన్‌కూరు నుండి రెండు వందల మంది కూలీలు వస్తున్నారు వాళ్లు రేపు ఎల్లుండిలోగా యిక్కడికి చేరుకుంటారు. మీకు యీ కూలీ గిట్టుబాటు అయితేనే పనిలోకి రండి. ఆరణాలకు మించి ఒక్క పైసా కూడా యివ్వరు.''

అలా చెప్పి పాపచ్చన్ తిరిగి వెళ్లిపోయాడు.

ఆరోజు కూలీలు అతణ్ణి నానా బూతులు తిట్టుకుంటూ వెళ్లిపోయారు.

యిక మన గతి యేమికానుందో అని ఆలోచించసాగారు. వాళ్లు యిప్పుడు పాత జమీందార్లకు తమ ముఖాల్ని చూపించడానికి కూడా భయపడిపోతున్నారు.

తమంతట తామే పాత జమీందార్ల చల్లని నీడను పోగొట్టుకున్నామని బాధపడసాగారు.

కొందరు ఎక్కడికీ పనికి వెళ్లకుండా గుడిసెల్లోనే వుండిపోయారు. మరికొందరు పాత యజమానుల కాళ్లా వేళ్లా బడి యేడ్చారు. గుండెలు బాదుకున్నారు, క్షమించమని ప్రాధేయపడ్డారు. వాళ్లు మళ్లా పనిలోకి కుదిరారు. మిగిలినవారు తమ దురదృష్టాన్ని నిందించుకుంటూ ఆరణాల కూలికే పాల్ పొలాల్లోకి పనికివెళ్లారు.

నెల రోజులు గడిచిపోయాయి. కాని తిరువాన్‌కూరు నుండి ఒక్క కూలీ కూడ మలబారు చేరిన జాడలేదు. పాపచ్చన్ చేత బెత్తం బుచ్చుకొని కూలీలమధ్య తిరుగుతూ కూలీలను ఒక్కక్షణం కూడా గాలి పీల్చుకోనియ్యడం లేదు.

"దొంగ వెధవల్లారా, సోమరిపోతుల్లా నిల్చున్నారు. అక్కడ తవ్వు, పార వేగంగా కదుపు. గాడిదల్లారా, నేను మీ తోలు వల్చేస్తాను." యిలా పాపచ్చన్ రొప్పుతున్నాడు.

అతడు ఆ పేద కార్మికుల వీపుమీద, కాళ్లమీద మాటిమాటికీ బెత్తంతో బాదుతున్నాడు. వాళ్లు యివన్నీ సహిస్తూనే వున్నారు. మరి ఏమని ఎవరితో చెప్పుకోగలరు? ఆ పేద కూలీలకు పాపచ్చన్ తిరువాన్‌కూరు వాళ్ల నిజస్వరూపాన్ని యీ విధంగా పరిచయం చేశాడు.

## ఇరవై అయిదు

మరియమ్మ పాత సామాన్లన్నీ తీసి మళ్లీ పెట్టెలోకి సర్దుతోంది. అనుకోకుండా ఓ పోస్టుకార్డు కనిపించింది. ఆ కార్డుమీద వాళ్ల అమ్మ అడ్రసు రాసి వుంది.

తన స్వంత వూళ్లో వున్న బంధువులకు ఇంతవరకూ ఒక్క ఉత్తరం కూడా తను రాయలేదని అనుకొంది. పెట్టెలోకి సామాన్లన్నీ సర్దింతర్వాత కార్డుతీసుకొని వరండాలోకి వచ్చి మేరీకుట్టీని పిలిచింది.

మేరీకుట్టీ దగ్గరకు వస్తూనే "ఏలీమామీకి ఓ వుత్తరం రాయాలి" అని మరియమ్మ అంది.

మేరీకుట్టీ నేలమీద చాప పరిచింది. చేతికి ఓ పెన్సిలు తీసుకొని రాయడానికి సిద్ధమయింది. ఆ అమ్మాయి మొదట కార్డుపైభాగాన 'ఏసుప్రభువు' అని రాసింది.

మరియమ్మ ఉత్తరంలో రాయాల్సిన విషయాల్ని చెప్పసాగింది. "ఏలీమామీకి మరియమ్మ వ్రాయునదేమనగా మలబారు చేరుకున్న తర్వాత పిల్లలు, వాళ్ల నాన్న, నేనూ సుఖంగా వున్నాము. ఇక్కడ మేము అయిదువందల ఎకరాల భూమిని కొన్నాము..."

మేరీకుట్టీ రాయడం మానేసి తలపైకెత్తి పెన్సిల్‌కొసను నోట్లోపెట్టుకొని మధ్యలో అడిగేసింది "అమ్మా! అయిదువందల ఎకరాలు కాదు. మనది ఇరవై ఎకరాలే వుందని వర్గీస్ చెట్టన్ అన్నాడు."

మరియమ్మ మేరీకుట్టీ వైపు కోపంగా చూసింది. "తెలివి లేనిదానా, నోరుమూసుకో. మా అమ్మ యిక్కడికొచ్చి పొలం కొలుచుకు వెళుతుందా? అయిదువందల ఎకరాలనే రాయి. మా అమ్మకు ఇక్కడ కొద్దిభూమినే కొని బ్రతుకుతున్నట్లు తెలపవద్దు." అంచేత మేరీకుట్టీ అయిదువందల ఎకరాలు అని పెద్ద అక్షరాల్లో రాసింది.

మరియమ్మ చేతులు ముడుచుకొని వళ్లో పెట్టుకుంది. బాగా ఆలోచించుకొని వుత్తరం రాయిస్తోంది. "యిక్కడివాళ్లకు వ్యవసాయం గురించి బొత్తిగా తెలియదు., ఇక్కడ చాలాభూమి ఖాళీగా పడివుంది. యిక్కడ మంచి కర్రపెండలం అంట్లు కూడా దొరకడంలేదు. అటునుంచి ఇక్కడికి ఎవరైనా వస్తున్నట్లయితే వారిచేత కొన్ని మంచి కర్రపెండలం అంట్లు..."

"అమ్మా, యిక రాయడానికి ఖాళీలేదు." మేరీకుట్టీ నిస్సహాయంగా పెన్సిలు నోట్లో పెట్టుకుని చిరునవ్వు నవ్వుతోంది.

మరియమ్మ కూతురువైపు క్రోధంగా చూసింది. "యేంటే! రెండు మాటలకే కార్డు నిండిపోయిందా? ఆమె కార్డును తన చేతిలోకి తీసుకొని రెండువైపులా తిప్పిచూసింది. నిరాశగా అంది "ఏనుగు తలకాయంత అక్షరాలు రాసి పిల్లది కార్డు పాడుచేసింది." కోపాన్ని ఆపుకోలేక మేరీకుట్టీ వీపుమీద గట్టిగా ఓ గుద్దు మోదింది.

ఆ తర్వాత మరియమ్మ డీలా పడిపోయి అరచేతిలో తలకాయ మోపి కూర్చుంది.

మరియమ్మ వాళ్లమ్మకు యింకా యెన్నెన్నో రాయించాలనుకొంది. ఆమె అయిదు వందల ఎకరాలు కొన్న సంగతేకాదు మరెన్నో విషయాలు తెలపాలనుకొంది.

మా జీవితం చాలా భోగభాగ్యాలతో గడుస్తోందని. భర్త ఓ పెద్ద తోటకు యజమాని అయ్యాడని, అతడు ఓ బంగళా కట్టించాడని, అందులో రోజూ పదిహేను మంది నౌకర్లు పనిచేస్తుంటారని, యిలా యెన్నెన్నో విషయాలు వివరంగా రాయించాలనుకొంది. యివన్నీ తెలుసుకొని వాళ్లమ్మ ఈర్ష్య పడిపోవాలని ఆమె భావన. ఈ తెలివితక్కువ దద్దమ్మ తను పెట్టుకొన్న ఆశల్ని వమ్ము చేసింది. అయిదువందల ఎకరాల భూమి కొన్నట్లు వింటూనే యిక ఇతర విషయాలన్నీ స్వయంగా వూహించుకోగలదని మరియమ్మ నిశ్చయానికొచ్చింది.

ఆమె ఆ కార్డును పట్టణానికెళుతున్న ఓ మనిషి చేతికిచ్చి దాన్ని పోస్టు బాక్సులో వేయమని చెప్పింది.

అమ్మ, వుత్తరంలో రాసిన అయిదువందల ఎకరాల భూమిని కొన్నట్టు చదువుతూనే ఆశ్చర్యచకితురాలవుతుందని మరియమ్మ తనలో తానే వూహించుకోసాగింది. బహుశా ఆమె ఎవరిచేతనైనా మంచి క్రపెండలం అంట్లు పంపించవచ్చు అనుకొంది. కానీ ఆమె పంపిన వుత్తరం మద్రాసు డెడ్ లెటర్ ఆఫీసులో అచేతనంగా పడివుంది.

## ఇరవై ఆరు

తాషెకున్నత కుటుంబపు వయోవృద్ధుడు చాచప్పన్ నంబియార్ సంధ్యావందనం చేసుకొని లేచాడో లేదో అతడి బావమరిది కుంజికృష్ణన్ నంబియార్ ఇంట్లోకి వచ్చాడు. చాచప్పన్ నంబియార్ పడక్కుర్చీలో కూర్చుంటూనే గట్టిగా పిలిచాడు "కుంజికృష్ణా" అని.

కుంజికృష్ణన్ నంబియార్ వయోవృద్ధుని సమీపించి నమస్కరించాడు. వినయంగా తల వంచి చేతులు ముడుచుకొని అతడి ముందు నిలుచున్నాడు.

"నీవు ఎక్కడినుండి వస్తున్నావు?" వృద్ధుడు కోపంగా బావమర్దిని కిందినుండి పైవరకూ చూస్తూ అడిగాడు.

"నేను చాక్కో చెట్టన్ యింటికి వెళ్లి వచ్చాను." కుంజికృష్ణన్ నంబియార్ సౌమ్యంగా జవాబు చెప్పాడు.

"చూశావా! నేను వూహించినట్టే జరిగింది. ఒరే, నీకు సిగ్గులేదూ? నీవు యీ చెట్టన్లతో స్నేహం పెట్టుకోవద్దని ఎన్నిసార్లు చెప్పలేదు నీకు? పనికిమాలిన

వెధవా! నామాటంటే నీకు లెక్క లేకుండా పోయింది. ఈ చెట్టన్నేనా నీ గురువులు?" వృద్ధుడు గద్దిస్తూ అడిగాడు.

"నేను వాళ్లను గురువులుగా కాదు, మిత్రులుగా భావిస్తాను." కుంజికృష్ణన్ నంబియార్ వినయంగా జవాబు చెప్పాడు.

"వీళ్లు నీకు మిత్రులా?" వృద్ధుడు తల వూపాడు. "భలే మంచిది. చాలా మంచి మిత్రుల్ని సంపాదించావు. ఈ పశువులు మన ప్రాంతాన్ని సర్వనాశనం చేసే వుద్దేశంతోనే యిక్కడికి వచ్చారు. మన ప్రాంతమంతా పాడైపోతుంది. వీళ్లు ఈ ప్రాంతీయుల్ని సర్వనాశనం చేసి కాని వెళ్లరని తెలుస్తోంది."

"మామగారూ! మీరు యిలా వాళ్లందర్నీ దుష్టులుగా భావించడం ఏమీ బాగులేదు. ప్రపంచంలోని అన్ని సమాజాల్లోనూ మంచివాళ్ళూ వున్నారు, చెడ్డవాళ్లూ వున్నారు."

"యీ సిద్ధాంతం యీ దుర్మార్గులకు వర్తించదు. వాళ్ల దగ్గరకు వెళ్లడం కూడా పాపమే. వీళ్లు బొడ్లో కత్తులూ కటార్లు దాచుకొని వుండొచ్చు."

కుంజికృష్ణన్ నంబియార్‌కి నవ్వొచ్చింది.

"మామగారూ మీరు వీళ్ల నడుములు తడిమినట్లుంది. అప్పుడప్పుడూ మీరుకూడా బొడ్లో కత్తి దోపుకొని ఎందుకు తిరుగుతుంటారు?"

"నా ఆత్మరక్షణార్థం అప్పుడప్పుడూ కత్తి బొడ్లో దోపుకొని బయటకు వెళుతుంటాను."

"మంచిదే! వాళ్లుకూడా మీలాగే ఆత్మరక్షణార్థం కత్తులు దోపుకొని తిరుగుతుండవచ్చు. వాళ్లకు తెలియని ప్రదేశం కదా యిది? వాళ్లకేం తెలుసు, ఎప్పుడు యెక్కడ యే ప్రమాదమొస్తుందో."

"అసలు వీళ్లు యిక్కడికి ఎందుకొచ్చినట్టూ అని నేను అడుగుతున్నాను?"

"అక్కడవాళ్ల జీవితం కష్టతరం కావడంతో యిటువైపు పరుగుతీసి వుంటారు. మామగారూ! మీరు చెబుతుండేవారు - మైసూరు సుల్తాను మలబారును ఆక్రమించినప్పుడు ప్రజలు యెన్ని బాధలు పడ్డారో వినిపించేవారు. తూర్పుకొండల ప్రాంతంలో యెన్నో జనసాంద్రత గల పల్లెలుండేవి. టిప్పుసుల్తాను మలబారును ఆక్రమించడంతో హిందువులంతా తమ యిళ్లూ - వాకిళ్ళూ వదిలేసి గుంపులు గుంపులుగా దక్షిణాదికి పరుగుతీశారు. వాళ్లంతా దక్షిణ ప్రాంతంలో ఎక్కడో ఒకచోట

వలసలు యేర్పరచుకొని వుంటారు. అదేవిధంగా నేడు దక్షిణప్రాంతపు క్రైస్తవులు మనమధ్యకు వచ్చి నివాసమేర్పరచుకున్నారు. మామగారూ! మీరు దయచేసి ఒక్కవిషయం గమనించాలి. వీళ్లు యిక్కడ ఆషామాషీగా కాళ్లు ముడుచుకొని కూర్చోడానికి రాలేదు. వాళ్లు జీవితమంతా కష్టించి సంపాదించిన సొమ్మునంతా యిక్కడికి తెచ్చి ఖర్చుపెట్టి శాశ్వతంగా యిక్కడే వుండిపోడానికొచ్చారు. మీలాంటి మంచివాళ్లు, తెలివైనవాళ్లు వీళ్లను దుర్మార్గులుగా యెందుకు భావిస్తారో నాకు యే మాత్రం బోధపడటం లేదు."

"వీళ్లంటే అసహ్యం ఎందుకేస్తుందంటే వీళ్లు ఈ ప్రాంతంలో దొంగతనాలు, దోపిడీలు చేస్తున్నారు. వీళ్ల వృత్తే యిది."

"మామగారూ! మీరు దయచేసి యే ఆధారం లేకుండా మీరు అలా మాట్లాడకూడదు. వీళ్లు యెంత దోచుకున్నారు? యెన్ని దోపిడీలు చేశారు? మీరు చెప్పగలరా?"

"చాలా మంది అంటుంటే నేను విన్నాను."

"నిజమే. చాలామంది యిలా ప్రచారం చేస్తూ తిరుగుతుంటారు. యిదేవాళ్లకి మంచి అవకాశం. ఎవడు తప్పుచేసినా ఆ తప్పును యీ చెట్టన్ల మీదకు నెట్టేస్తారు. అసలు ఈ చెట్టన్లంతా ఒక అపరాధకూటమిగా ప్రచారం చేశారు. మన చాత్తుక్కుట్టి నంబియార్ తోటలోంచి రోజూ కొబ్బరికాయల దొంగతనం జరుగుతుండేది. కొబ్బరికాయల దొంగతనం కేవలం చెట్టన్లు మాత్రమే చేస్తున్నారని నంబియార్ చుట్టుపక్కల వున్న గ్రామాల్లో ప్రచారం చేశాడు. చివరకు మాత్తూ అనే చెట్టన్ దొంగతనం చేస్తున్నప్పుడే దొంగను పట్టుకున్నాడు. అసలు దొంగ యెవరో తెలుసా? చాత్తుకుట్టి నంబియార్ కొడుకు పద్మనాభన్!"

"నిజంగానా? అలా జరిగిందా? నాకు తెలీనే లేదే!"

"ఇదొక్కటే కాదు. యిలాంటివి మరెన్నో జరిగాయి. యింతకీ వీళ్లు రాకముందు ఈ ప్రాంతంలో దొంగతనాలూ దోపిడీలు జరిగేవి కాదా? ఈనాటికీ వీళ్లల్లో ఎంతమంది దొంగలున్నారో, అంతకంటే మించి మనవాళ్ళల్లోనూ వున్నారు. యిక్కడికి వలస వచ్చిన వాళ్లలో చాలామంది అమాయక పేదవారు అని నాకు బాగా తెలుసు. కొంతమంది మోసగాళ్లు వీళ్లను మోసగించి యిక్కడికి తెచ్చారు. యీ పేదవాళ్లు తమ వద్దనున్న భూమి పుట్రా అమ్ముకొని తెచ్చిన సొమ్మును యిక్కడ

పెట్టుబడి పెట్టి కూర్చున్నారు. యీ పేదలే కోట్లాది రూపాయలు ఖర్చు చేసి మన అడవుల్ని శుభ్రం చేశారు. యిలా మన అడవుల్లో వ్యవసాయం చేసుకొనే వీళ్ళకి మనం ధన్యవాదాలు తెలపాలి. సానుభూతిని చూపించాలి. కనీసం వీళ్లకు వ్యతిరేకంగా తప్పుడు అపరాధాలు మోపకూడదు. వీళ్లరాకతో మన చుట్టుపక్కల పులులు, నక్కల స్థానంలో మనుషులు నివసిస్తున్నందుకు కనీసం సంతోషించాలి.''

వృద్ధుడు చాలా సేపటివరకూ కుంజికృష్ణన్ నంబియార్ చెప్పిన మాటల గురించి ఆలోచిస్తూ వుండిపోయాడు. ''యింతకీ నీవు చెప్పేదాన్ని బట్టి వీళ్లంతా పరమ పవిత్రులంటావు?''

''స్వర్గంలో నివసించే వాళ్లల్లో కూడా మీకు అందరూ పవిత్రులుగా లభించరు. వీళ్లల్లో కొద్దిమంది దుర్మార్గులు, రౌడీలు వున్నారన్న విషయంలో నాకెలాంటి సందేహంలేదు. యీ కొద్దిమందిని దృష్టిలో వుంచుకొని వాళ్ల సమాజాన్నంతటినీ కళంకంగా భావించవద్దని నా మనవి. నేను నా మిత్రుడు చాక్కో విషయమే చెబుతాను. అతడు వాళ్ల వూర్లో ఓ స్కూల్ టీచర్‌గా వుండేవాడు. అక్కడ సుఖంగానే వుండేవాడు. యింతలో కుంజితొమ్మన్ అనే మోసగాడు ఆశ చూపించి ఇక్కడకు చేర్చాడు. అతడు యిక్కడ కొంత పొలం కొన్నాడు. తక్కిన డబ్బు కుంజితొమ్మన్ తీసుకొని వుడాయించాడు. యిప్పుడు చాక్కో చాలా చిక్కుల్లో వున్నాడు. వ్యవసాయం చేసుకుందామంటే డబ్బు లేదు. అతడికి అప్పు యిచ్చే దిక్కుకూడా లేరు. అలా అని తిరిగి వాళ్ల వూరు కూడా వెళ్లలేడు. తిండికి కూడా గతి లేదు. మరి అతడు యేం తిని బతకాలి? చూశారా, వాళ్ల శత్రువులు, దోపిడీదారులూ వాళ్లమధ్యనే వున్నారు.''

''మరి చాక్కో యేం చేస్తున్నాడు?'' వృద్ధుడు సానుభూతితో అడిగాడు.

''యేం చేయగలడు? అతడు తనను తాను తిట్టుకుంటూ రోజులు గడుపుతున్నాడు. యీ చాక్కోనే మీరు బొడ్లో బాకు దోపుకొని తిరిగే దుర్మార్గుడని అంటున్నారు.''

''అయినా! మొత్తానికి వీళ్ల సమాజం మురికి కూపంతో సమానమే.'' వృద్ధుడు తల తిప్పుకొని చెప్పాడు. ''వీళ్లు చచ్చిన ఆవు మాంసాన్ని యండబెట్టుకొని తినేవాళ్లు.''

''ఈ పరిస్థితిలో వాళ్లు నిరుపేదలని చెప్పుకోవడం సబబుగా వుంటుంది. ఆకలిచావుల పరిస్థితి యేర్పడ్డప్పుడు మనిషి యెప్పుడూ తినకూడని పదార్థాల్ని

కూడ తినాల్సివస్తుంది. మీరు పేపర్లలో చదివే వుంటారు. బెంగాలు కరువురోజుల్లో ప్రజలు కుక్క మాంసాన్ని, పిల్లి మాంసాన్ని కూడా తిన్నారట. వీళ్లు కాయగూరలూ, మాంసమూ కొనగలిగే స్థితిలో లేరు. మీరు ఒక్కసారి వాళ్ల గుడిసె లోపలికెళ్లి చూస్తే మీకే తెలుస్తుంది. వాళ్లు యెంత పేదవాళ్లో. అడివిలో యెండు కర్రలు బాగా దొరుకుతాయి. అందుకే వాళ్లు వంట వండుకొని తింటున్నారు. లేకపోతే ఆవు యెండు మాంసాన్ని వండుకోకుండానే తినేసేవారు."

యిదంతా విని చాప్పన్ నంబియార్ హృదయం కరిగిపోయింది. మనస్తాపం కలిగింది.

"నీవు వెళ్లి భోంచెయ్యి." బావమర్దిని లోపలికి పంపించాడు.

తర్వాత చాప్పన్ నంబియార్ పాత కళ్లజోడు తగిలించుకొని భాగవతం చదవసాగాడు.

## ఇరవై యేడు

వర్షాలు మొదలయ్యాయి. కొండ ప్రాంతంలోని కుంటలూ, లోయలూ నీటితో నిండిపోయాయి. యెండుటాకులు నీళ్లల్లో కుళ్లిపోసాగాయి.

వర్షాలతోపాటు మలేరియా కూడా వ్యాపించసాగింది.

చిత్తడికి, చలిగాలులకు విషపూరితమైన సూక్ష్మజీవులు వ్యాపించసాగాయి. అవి కొండలనుండి దిగి లోయల్లోకి, గుడిసెల్లోకి దోమల రూపంలో విమానం మోతతో విహరించసాగాయి. పొలాల్లోకి కూలీలు రావడం తగ్గిపోయింది. గుడిసెల్లో ప్రజల మూలుగులు వినిపిస్తున్నాయి.

"అబ్బా! కొద్దిగా నీళ్లివ్వండి బాబూ! నన్ను పట్టుకోండి. నా శరీరాన్ని గట్టిగా నొక్కండి." చాక్కొచ్చన్ పడుకొని వణకసాగాడు. కురియన్‌కు రెండురోజులుగా జ్వరం. మూడవరోజు అతడు పక్కమీది నుండి లేవలేకపోయాడు. అతడి గుండెల్లో దడ మొదలైంది. వేణ్ణీళ్ళు తాగుతూనే వున్నాడు. కాని దప్పిక తీరలేదు.

మరియమ్మ కూడ మలేరియాతో వణుకుతోంది. మరియమ్మ భర్త మార్టిన్ గుడిసెలో వున్న చాపలన్నిటినీ కప్పుకున్నాడు. పాత బట్టలన్నీ మీదేసుకున్నాడు. అయినా చలితో నేలంతా దొర్లుతున్నాడు.

చాలామంది మలేరియాతో బాధపడుతున్నారు. మలేరియా జ్వరం తగలని

వాళ్లకు యిదంతా ఒక తమాషాగా వుంది.

వర్కీతోపాటు వచ్చిన జాకబ్ అయిదు ఎకరాల భూమిని కొని భార్య ఏలియా, కొడుకు ఏంతోనీతో పాటు వుంటున్నాడు. ఏలియా చుట్టము, అనాధ అయిన అనికుట్టీ కూడా వాళ్లతో పాటే వుండేది. ఆ ప్రాంతానికంతటికీ ఆ తోట చాలా అందంగా వుండేది. తోటకు నలువైపులా కంచె వేశారు. దగ్గర్లోనే పొలం. పొలంలో నువ్వులు, అరటి వేశారు. తోటలో రకరకాల కాయగూరల మొక్కలు. మధ్యలో గడ్డితో కప్పిన గుడిసె. ఇంటిముందు వరసగా అరటీ, బొప్పాయీ పాదులున్నాయి. ఆ పర్ణ కుటీరంలో వాళ్లు సుఖంగా నివసించేవారు.

ఏంతోనీ ప్రతి ఆదివారం చర్చికి వెళ్లేవాడు. అయిదారు మైళ్లదూరం నుండి వాళ్లు - మగవాడు, స్త్రీ, పిల్లలూ మంచి బట్టలు ధరించి సమూహ ప్రార్థనలో పాల్గొనడానికి వచ్చేవారు. వాళ్ల మధ్యలో వున్న అనికుట్టిని ఏంతోనీ గుర్తుపట్టేవాడు. అనికుట్టీ పల్చటి తెల్లని గుడ్డ నెత్తికి చుట్టుకొని మోకాళ్లు వంచి ప్రార్థన చేస్తున్నప్పుడు ఏంతోనీ ఎంతో సానుభూతి, ప్రేమతోను చూసేవాడు. ప్రార్థన తర్వాత అందరూ తిరిగి వెళ్లేటప్పుడు అనికుట్టీ సిగ్గుతో అమాయకంగా ఏంతోనీని చూసి తలవంచుకొని అస్పష్టంగా చిరునవ్వు నవ్వేది.

అనికుట్టీ మధురమైన చిరునవ్వు, ఆమె అందమైన నల్లని కళ్లు, కల్లా కపటం ఎరుగని ముఖమూ ఏంతోనీ హృదయంలో చెరగని ముద్రవేశాయి. అతడు అనికుట్టీలో యే దివ్యదేవతనో ప్రతిష్ఠించుకున్నాడు. అనికుట్టీ ముఖం చుట్టూ ఏదో ప్రభూ మండలం వెలసినట్టు భావించేవాడు. నల్లని అట్టల బైబిల్‌ను గుండెలకు చేర్చుకొని, ఓ చిన్న కుర్రాడి చేయి పుచ్చుకొని తల వంచుకొని వెళుతుండగా ఆ పవిత్ర కన్యను తన జీవిత భాగస్వామి కావాలని కోరుకున్నాడు.

ఒకరోజు చర్చినుండి తిరిగి వస్తుండగా ఆ చిన్నకుర్రాడు పరుగెత్తుకుంటూ వచ్చి ఏంతోనీ చెయ్యి పట్టుకున్నాడు. "అనీ అక్కయ్య చదువుకోడానికి యేదైనా నవలవుంటే మిమ్మల్ని అడిగి తీసుకురమ్మంది " అని చెప్పాడు.

ఏంతోనీ వద్ద నవలగానీ లేదా కథల పుస్తకం గానీ లేదు. అతడు తన పెట్టె తెరచి మత పుస్తకాలు, సూక్తుల చరిత్ర తీసి అనికుట్టీ చదువుకోడానికి పంపించాడు.

# ఇరవై యెనిమిది

ఆరోజు సాయంకాలానికి వర్షం ఆగిపోయింది. ఆకాశం యింకా మేఘావృతమైవుంది. చెట్ల ఆకుల నుండి నీళ్లు రాలుతున్నాయి.

వర్షంలో తడిసిన చెట్లమీద లక్షల కొలదీ మిణుగురు పురుగులు మిణుకు మిణుకుమంటున్నాయి. ఆ ప్రకాశరాసి ఒకసారి వెలిగి వెంటనే అదృశ్యమైపోతోంది. చీకటి నిండిన కొండ ప్రదేశంలో మిణుగురు పురుగుల ప్రణయలీలలు చూస్తుంటే గంధర్వలోకాన్ని గుర్తుకు తెస్తోంది. అవి ఒక్కసారిగా వెలుగుతూ, వెలుగుతూ, వెలుగుతూ ఆరిపోతున్నాయి. ఆరిపోతూ, ఆరిపోతూ మళ్లీ ప్రకాసిస్తున్నాయి. ఆ ప్రణయ తాండవానికి అలసటలేదు, వెలుగు తగ్గలేదు, మిణుకు-మిణుకుమనే లయ యధాప్రకారం కొనసాగుతోంది.

యిలా ఆ వర్షం కురిసిన రాత్రి లక్షల వజ్రాలు పొదిగిన మాలలు ధరించి నర్తిస్తోంది.

ఏంతోనీ, తన గుడిసె వరండాలో చింతా క్రాంతంగా కూర్చొని వున్నాడు. ఒక్కసారిగా రెండు మృదువైన అరచేతులు వెనుకవైపుగా అతడి కళ్లను మూసేశాయ్. అతడు ఉలిక్కిపడ్డాడు. తక్షణం అతడు ఎడంచేత్తో తుపాకీనీ, కుడిచేత్తో ఆ మృదువైన చేతుల్ని పట్టుకున్నాడు. అప్పుడే గాజుల చప్పుడు వినిపించింది.

గాజుల చేతుల్ని తన కళ్లమీదినుండి వేరు చేసి తలపైకెత్తి చూశాడు.

మాధవి నవ్వుతూ వెనక నిలబడివుంది. ఏంతోనీ ఎగిరి నిల్చున్నాడు. మాధవివైపు కోపంగా చూడసాగాడు. అతడికి ఏం మాట్లాడాలో అర్థం కావడంలేదు. అతడి మనసులో ఏదో అనర్థం జరగబోతోందనే భావన కలిగింది.

"బాబుగారూ! యిక్కడ యేమి ఆలోచిస్తున్నారు?" అని అడిగింది చిన్న పిల్లలాగా. ఆ ప్రశ్నలోని తియ్యదనం ఏంతోనీ కోపాన్ని చల్లార్చింది.

"నేను మిణుగురు పురుగుల్ని చూస్తున్నాను." అని ఏంతోనీ చెప్పాడు. అప్పటికీ అతడు మాధవీని అనుమానంగానే చూస్తున్నాడు. కొద్దిక్షణాల తర్వాత "మాధవీ యిక్కడికి ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

"నాకు ఏంతోనీ దగ్గరకు రావాలనిపించింది. వచ్చాను. యేంటి నేను ఏంతోనీ దగ్గరకు రాకూడదా?"

"నేను అలా అన్లేదు." ఏంతోనీ లాంతరు వత్తిని ఎక్కించాడు.

మాధవీ రూపం మిరుమిట్లు కొలిపింది. ఎర్రని బిగుతైన బ్లౌజు, చక్కని తెల్లని చీర. చీరకు బ్లౌజుకు మధ్య అందమైన పొట్టభాగం అరటి చిగురులా కనిపిస్తోంది. కాటుక దిద్దిన నల్లటి అందమైన కళ్లు, ఎర్రని పెదవులు, నల్లని నున్నటి తలవెంట్రుకలు తెరలాగా విడిపోయాయి. ఆమె వేదికనలంకరించిన నర్తకిలా వుంది. నిష్కారణమైన భయం అతడి మనసులో మెదిలింది.

"మాధవీ నీవు యిప్పుడు యిక్కడికి రావడానికి కారణం ఏదైనా వుందా, అని మాత్రమే నేను అడుగుతున్నాను." ఏంతోనీకి ఆమె ముఖంవైపు చూసే ధైర్యంలేదు, అందుకే ఆమె పాదాలు చూస్తూ అన్నాడు.

"'ఏంతోనీ యిక్కడ ఒంటరిగా వుండటమే ఒక విశేషకారణం." అని మాధవి జవాబు చెప్పింది.

దీని అంతరార్థం ఏమిటో? జవాబు ఏమి చెప్పాలో ఏంతోనీకి తెలియడంలేదు. అంతా అయోమయంగా వుంది. ఆ నిశ్శబ్ద వాతావరణంలో అతడి భయం పిశాచంలా పెరిగిపోతోంది. మాధవి అక్కడి నుండి కదిలే ఆచూకీ లేదు. మాధవి అతడికి దగ్గరగా కూర్చుంది.

ఏంతోనీ వికలుడయ్యాడు. ఏంతోనీకి ఆమె ముఖం చూడ్డానికి గానీ లేదా ఆమెను అక్కడినుండి వెళ్లిపొమ్మని చెప్పడానికి గానీ ధైర్యం చాలడంలేదు. అతడు తన ఎదురుగా వున్న చెట్లవైపు దృష్టి మరల్చాడు. ఒక్కో చెట్టుమీద లక్షలకొలదీ మిణుగురు పురుగులు మెరిసిపోతున్నాయి. మెరుపులకూ మట్టికీ పుట్టిన సంతానంలా వున్న ఆ మిణుగురు పురుగుల్ని మాధవికూడా చూస్తోంది. "చాలా అందమైన దృశ్యం" అంది మాధవి.

"అది ఏమిటో తెలుసా" ఏంతోనీ అడిగాడు.

"మిణుగురు పురుగులు."

"మిణుగురులే. అవి ఏం చేస్తున్నాయో తెలుసా?"

"మిణుకు మిణుకుమని వెలుగుతున్నాయి."

"అవి ఎందుకు వెలుగుతున్నాయి?"

"వాటి మనసులో అలా వెలగాలని కోరిక కలిగింది. అందుకే వెలుగుతున్నాయి..."

"అదికాదు అవి ప్రేమనృత్యం చేస్తున్నాయి."

"ప్రేమ నృత్యమా!" మాధవి గలగలా నవ్వింది.

"ఔను! మనం చూసే దృశ్యం, వాటి ప్రేమనృత్యమే."

మిణుగురు పురుగుల ప్రేమనృత్యం గురించి ఏంతోనీ ఓ వ్యాసం చదివాడు. దాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ చెప్పాడు.

"ఔను, రాత్రంతా విరామం లేకుండా విశాల ఆకాశంలో ప్రేమనృత్యం. ప్రతి మగ మిణుగురుపురుగూ తన ప్రేయసిని ఆకర్షించడానికి ప్రకాశిస్తుంది. దానికి జవాబుగా దాని ప్రేయసికూడా అలాగే వెలుగుచూపుతుంది. ఇలా వాటి ప్రేమనృత్యం కొనసాగుతుంది. చివరకు తెల్లవారకముందే అవన్నీ ఒకసారి..."

చివరి మాటను ఏంతోనీ మింగేశాడు.

"అవన్నీ ఒకసారి ఏంచేస్తాయి?" మాధవి అల్లరిపిల్లాడిగా అడిగింది.

"అది ఒక బూతుమాట. అది నేను చెప్పను." ఏంతోనీ తలవూపుతూ నేలవైపు చూస్తూ కూర్చున్నాడు.

మాధవి నవ్వుతూ ఆలోచించసాగింది. యిది తను కొత్తగా తెలుసుకున్న విషయం. మిణుగురులు ఇలా మిణుకు మిణుకుమని వెలుగుతుంటే ఎన్నోసార్లు చూసింది. కాని ఇందులో ప్రేమ, పరస్పర ఆకర్షణ వున్నట్లు తనకు తెలియదు. ఇప్పుడు ఆమె నూతన భావంతో వాటి ప్రేమ వుత్సవాన్ని చూడసాగింది.

ప్రేమనృత్యం చేస్తూ ఇంకా ఆ పురుగులు వెలిగిపోతున్నాయి. అన్ని కొండలమీదా అవి ప్రకాశిస్తున్నాయి. ఆకాశంలో ఆరేడు చుక్కలు మసకమసకగా వెలుగుతున్నాయి. మాధవి ఓరగా ఏంతోనీ వైపు చూసింది. సిగ్గుతో కూడిన చిరునవ్వును పెదాలమధ్య దాచుకుంటూ ఆమె ఏంతోనీని అడిగింది. "యీ మగ మిణుగురు పురుగులాగా ఏంతోనీ కూడా ఎప్పుడైనా ఓ స్త్రీ వైపు వెలుగులు చిమ్మాడా?"

ఆమె చిరునవ్వు సవ్వడిని పెంచుతూ ఏంతోనీ వైపు గుచ్చిగుచ్చి చూడసాగింది. ఆమె కళ్లు వేగంగా కదిలాయి. మిణుగురుల్లా మెరిశాయి.

ఏంతోనీ ఆమె కళ్లను చూశాడు. ఆ కళ్లు తన గుండెలవైపు రెక్కలు విసురుతూ వస్తున్నట్లుంది. ఓ గబ్బిలం ఆ గుడిసె వరండాలో ఎన్నో చక్కర్లు కొట్టి చీకట్లోకి మాయమైపోయింది.

"మాధవీ యిక్కడి నుండి త్వరగా వెళ్లిపో." ఏంతోనీ ధైర్యం తెచ్చుకొని అన్నాడు. వేళకాని వేళ. ఒకవేళ బాబాయి వచ్చారంటే..."

"వస్తే..." మాధవి కళ్లు తిప్పుతూ అడిగింది.

"నీవొక స్త్రీవి కదా?"

"ఓహో! కనీసం ఆ మాటైనా గుర్తొచ్చింది. చాలా సంతోషం."

ఏంతోనీ ఆమెపెదవులవైపు చూచాడు. ఆ అందమైన లేత పెదవుల నుండి యింతటి పదునైన మాటలు యెలా వస్తాయి?

మాధవి నిల్చుంది.

"సరే బాబుగారు నేను వెళతాను?"

"భయంగా వుంటే చెప్పు, నేను కొంతదూరం తోడుగా వస్తాను."

"యిప్పుడు ఏంతోనీకే భయమేస్తోందికదూ?"

ఆమె తల తిప్పి గొంతు సవరించుకొని ముంగిలి దిగి అరటి గుబుళ్లలో కనుమరుగైపోయింది.

ఇలా ఆ దృశ్యం అదృశ్యమైంది. ఆ సమయంలో చాలా దూరంలో వున్న జాన్ బంగళాలో పాల్, వర్గీస్, చెరియన్, వర్కీ పేకాటలో నిమగ్నులైవున్నారు. పదిరూపాయల నోట్ల కుప్ప బల్లమీద పడివుంది. పేకాటలో గెలిచిన డబ్బంతా తీసి మద్యం తెప్పించుకొని తాగాలని ముందే నిర్ణయించుకున్నారు.

ఉద్వేగంతో కొనసాగే పేకాట, సిగరెట్టు పొగ వెరసి గది అంతా చీకట్లు కమ్మినట్లుంది. గెలిచిన వాళ్ల కేకలు, నోట్ల కుప్పలు ఒకవైపు నుండి మరోవైపుకు తిరుగుతున్నాయి. వైరాగ్యంతో పాటు కోపం కూడ కలుగుతోంది. దాదాపు తెల్లారేవరకూ ఆట కొనసాగింది.

ఆరోజు వర్కీ పర్సు నుండి తీసిన మూడొందల రూపాయలు తీసుకొని జాన్ మద్యం సీసాల కోసం పట్నం వెళ్లాడు.

## ఇరవై తొమ్మిది

చాకో సమస్యల సుడిగుండంలో కూరుకుపోయాడు. ఆ పరిస్థితుల్లో కుంజికృష్ణన్ నంబియార్ చాకోను ఆదుకున్నాడు.

కుంజికృష్ణన్ నంబియార్ చాకోకు వెయ్యి రూపాయలిచ్చాడు. యిలా

ఇరువురూ కలిసి వ్యవసాయం చేయడం ప్రారంభించారు.

చొప్పన్ నంబియార్ అనుమతి తీసుకొన్న తర్వాతే కుంజికృష్ణన్ నంబియార్ చాకోతో కలిసి వ్యవసాయం చేయనారంభించాడు. కానీ స్థానీయులెవరికీ ఇది నచ్చలేదు. వాళ్లంతా కుంజికృష్ణన్ నంబియార్‌కు ఎంతో నచ్చజెప్పారు...

"బాబూ సహవాసగాడితో జాగ్రత్తగా వుండు. వాడు తిరువాన్‌కూరువాడు."

కుంజికృష్ణన్ నంబియార్ వాళ్లందరికీ ఒకేమాట చెప్పాడు "నష్టమొచ్చినా, లాభమొచ్చినా ఏమీ పర్వాలేదు, పెట్టుబడి పెట్టింది ఈ నేలమీదే కదా. చాకో ఈ నేలను తిరువాన్‌కూరుకు లేపు కెళ్లలేదుకదా. ఒకవేళ డబ్బు పుచ్చుకొని పారిపోయినా ఎక్కడికి వెళ్లగలడు. తిరువాన్‌కూరు కూడా కేరళలో ఒక భాగమే కదా?"

"ఔనౌను, మేమూ చూస్తాముగదా." కానీ వాళ్లు చూసే అవకాశం రాలేదు. చాకో - కుంజికృష్ణన్ నంబియార్ కలిసి వ్యవసాయంలో విజయం సాధించారు. కేవలం కర్రపెండలం అమ్మినదాంతో ఒక్కొక్కరికి అయిదు వందల రూపాయల లాభం వచ్చింది. దాంతో మరింత వుత్సాహంతో సాగు చేయనారంభించారు.

చాకో అప్పుడప్పుడూ చప్పన్ నంబియార్ యింటికి వస్తూ పోతూ వుండేవాడు. మెల్లమెల్లగా ముసలాయనకు చాకో అంటే నమ్మకం, ప్రేమ కలిగింది. చాకోకు ప్రపంచజ్ఞానం బాగా తెలుసు. అంతేకాదు వ్యవసాయం చేసే విధానం అతడికి బాగా తెలుసు. ఈ కారణాలవల్ల ముసలాయనకు చాకోమీద గురి ఏర్పడింది. అప్పుడప్పుడూ వాళ్ల చర్చ మత విషయాలు మీదకు వెళ్లేది. చాకో ఒక పరిపూర్ణ క్రైస్తవుడు. కానీ పరమతాల యడ అతనికి ఈర్ష్యలేదు. అతడు ఏ విషయాన్నైనా కూలంకషంగా అర్థం చేసుకోగలడు. అంతేకాదు చాకచక్యంగా ఇతరులకు తెలియచేయగలడు.

ఈవిధంగా ఒకనాటికి చాప్పన్ నంబియార్‌కు చాకోను చూడందే నిద్ర పట్టేది కాదు. వాళ్లిద్దరూ రాత్రిళ్లు కుర్చీల్లో కూర్చొని ఎనిమిది తొమ్మిది గంటలదాకా ముచ్చటించుకొనేవారు. ఆ తర్వాత చాకో సెలవు తీసుకొని ఇల్లు చేరి ప్రార్థన ముగించిన తర్వాతే భోంచేసి నిద్రపోయేవాడు. చాప్పన్ నంబియార్ ఆ సమయంలో భాగవతం పారాయణం చేస్తుండేవాడు.

# ముప్పై

క్రైస్తవులు చర్చి కడుతున్నారు. దానికి దగ్గర్లోనే మతాచార్యుల ఇల్లు. కొత్తగా అందంగా నిర్మించిన భవంతి. బంగళాకు నాలుగువైపులా సుందరమైన పూలతోట. ఎదురుగ్గా విశాలమైన హాలు. కిటికీలకు లావుపాటి అద్దాలు అమర్చారు. వాటిమీద నీలి పరదాలు తగిలించారు. వరండాలో కూడ అందమైన తెరలు అక్కడక్కడా కట్టారు.

హాలుకు ముందు రీడింగురూము. పెద్ద గ్రంథాలయం. దానికి ముందు పడకగది. ఆ తర్వాత డైనింగ్ రూము, వంటగదీ వగైరా వున్నాయి. దాని తర్వాత సేవకుల నివాసగృహం. వంటగది ముంగిలివైపు కోళ్లషెడ్డు. అందులో అనేకరకాల ఎన్నో చిన్నా పెద్దా కోళ్లున్నాయి.

ఆ అందమైన తోటకు వెనుక దివ్యమైన భవనంలో ఫాదర్‌సైమన్, ఫాదర్ చుల్లిపరంబన్ మరో బ్రదర్‌వున్నారు.

డైనింగ్‌రూములో తెల్లనిగుడ్డ పరిచివుంది. డైనింగ్‌టేబుల్‌కి రెండువైపులా భోంచేయడానికి కూర్చున్నారు. వాళ్లతోపాటు మరో ఇద్దరు అతిథులు కూడా వున్నారు.

ప్లేట్లు, గిన్నెలు, సాసర్లు, కత్తులు, స్పూన్లు, ఫోర్కులు బల్లమీద వుంచారు. దానికి ఎదురుగ్గా ఒక సీసాలో సారా వుంది. రొట్టె, వెన్న, పెద్దపెద్ద గిన్నెల్లో మాంసం కూర, వేయించిన మాంసం, ఆమ్లెట్టు వగైరా వుంచారు. సాస్, సూపు, మీగడ వగైరా చాలావుంది.

ఫాదర్‌సైమన్ స్పూన్‌తో సూపుతాగుతూ భోజనానికి ఉపక్రమించాడు. తక్కిన మిత్రులు భోంచేయసాగారు. మేక తొడను మసాలా, నెయ్యీ వేసి వండి కుప్పగాబెట్టారు. అందోలోంచి ఓ ముక్క తీసుకొని ఫాదర్ చుల్లిపరంబన్ కోసుకొని తింటున్నాడు.

ఆవిరిలో వుడికించిన మేక గుండెకాయ, నెయ్యిలోవండిన నాలుక, కోడిగుడ్లతో వండిన ఎద్దుకన్ను, కట్‌లెట్ మొదలైన వాటిపై మతాచార్యులు, అతిథుల చేతులు పడ్డాయి.

వేయించిన మాంసం తింటూ ఫాదర్‌సైమన్ అతిథులతో యిలా అన్నాడు. "ఇక్కడ మంచి మాంసం దొరకదు. మా ప్రాంతంలో మేక మాంసం చాలా రుచిగా వుంటుంది."

"ఏమైనా చాలా రుచిగా వండారు" అన్నాడు ఓ అతిథి.

"చాకో చాలా నేర్పుగల వంటగాడు." మాంసపు ముక్క తింటూ అన్నాడు ఫాదర్‌సైమన్ - "మొదట ఏనుగు కొండమీద నివసించే ఇంగ్లీషువాడి వద్ద వంటవాడుగా వుండేవాడు. విదేశీ వంటకాల్ని వండడంలో బహునేర్పరి."

అది విని వంటవాడు వేయించిన తొడ తీసి ప్లేటులోకి సర్దాడు. మొదట రుచి చూడండి, ఆ తర్వాత మీ అభిప్రాయం చెప్పండి అని అతడి వుద్దేశం.

అక్కడికి రెండు మైళ్లదూరంలో వున్న కొండలోయలో ఓ గుడిసె వుంది. ఆ గుడిసెలో తోమ్మన్ గంజి కాచుకుంటున్నాడు. దగ్గరే చాపమీద అతడి ఇద్దరు పిల్లలు చచ్చిన కప్పల్లాగా కాళ్లూ చేతులూ చాచుకొని వంటిపైన నూలుపోగు లేకుండా పడివున్నారు.

తొమ్మన్ దేవుణ్ణి ప్రార్థించి పొయ్యి రాజేస్తున్నాడు. కానీ అది ఎంతకూ రగులుకోవడంలేదు. ఏసుప్రభువును పలుసార్లు స్మరించుకొని వూదుతున్నా పొయ్యి మండటంలేదు. పుల్లలు చిటపటలాడి మంట ఆరిపోయింది. ఎన్నిసార్లు ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. చివరకు కొన్ని యెండుటాకులు తెచ్చి కొద్దిగా కిరసనాయిలు పోసి నిప్పు అంటించాడు. అప్పుడు పొయ్యి మండింది. కొద్దిసేపటికి గంజి వుడికింది. గంజి చల్లారిన తర్వాత పిల్లల్ని నిద్రలేపి తినిపించాడు. వరండాలో నుండి ఆరేళ్ల పిల్లాడువచ్చాడు. అందరూ అన్నంలో యింత వుప్పు వేసుకొని తిన్నారు.

భోంచేసిన తర్వాత తొమ్మన్ పిల్లల్ని వెంటబెట్టుకొని బయలుదేరాడు. వర్షం మొదలైంది.

ఆరేళ్ల ఓసేపు, నాలుగేళ్ల ఇట్టుపు ఒకరి భుజాలమీద ఒకరు చేతులు వేసుకొని నడవసాగారు. ఓసేపు నెత్తిమీద గొడుగుకు బదులుగా ఓ పెద్ద అరిటాకు పట్టుకున్నాడు. తొమ్మన్ భుజం మీద నాలుగు మాసాల కుర్రాడు నిద్రపోతున్నాడు. తొమ్మన్ చిరిగిన గొడుగును నెత్తిమీద వుంచుకున్నాడు.

ఆ వర్షంలో కూడా వాళ్లు ముందుకు నడుస్తున్నారు. కొండ వాగుల నుండి ఎర్రని నీరు వేగంగా ప్రవహిస్తోంది. కొండ కీచురాళ్ల చప్పుళ్లు చెవులు భరించలేనంతగా వినిపిస్తున్నాయి. గడ్డితో కప్పబడిన కాలిబాటను దాటుకుంటూ వాళ్లు ముందుకు నడుస్తున్నారు.

చివరకు వాళ్లు ఫాదర్‌సైమన్ బంగళా ముంగిలిలోకి ప్రవేశించారు. బయట

ఎవరూ లేరు. తొమ్మన్ సంశయంగా ముంగిలిలోనే నిల్చుండిపోయాడు. కొంతసేపటికి వర్షం జోరందుకుంది. పిల్లల్ని తీసుకొని తొమ్మన్ వరండాలోకి వెళ్లాడు.

తొమ్మన్ ఆ బంగళాను ఆశ్చర్యంతో చూస్తున్నాడు. ప్రకృతి బీభత్సాలకు ఏమాత్రం ప్రభావితం కాని విధంగా ఆ యింటిని నిర్మించారు. ఆ బంగళాను చూస్తూనే తొమ్మన్ మనసులో ఈర్ష్య కలిగింది. తన మనసులో కలిగిన చెడు భావాన్ని తప్పుగా యెంచి వెంటనే పశ్చాత్తాపంతో "వీళ్లు దేవుని మనుషులుకదా? వాళ్లు సదా సుఖంగా వుండాలి" అనుకున్నాడు.

ఇట్టూపు మూలుగుతున్నాడు. తొమ్మన్ అతడివైపు చూచాడు. అతడి కళ్లు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి. ముఖం నల్లగా మారింది. కాళ్లు వణుకుతున్నాయి.

తొమ్మన్ ఇట్టూపు నొసటిమీదా, ఛాతీమీద చేయి వేసి చూశాడు. అతడి వళ్లు జ్వరంతో కాలిపోతోంది.

"నాన్నా! నేను పడుకుంటాను" అతడి కళ్లు సగం మూతలు పడ్డాయి. బాధతో మూలుగుతున్నాడు.

తొమ్మన్ చలించిపోయాడు. నలువైపులా చూశాడు. కుంభవర్షం కురుస్తోంది. తొమ్మన్ పిల్లాణ్ణి భుజంమీద ఎక్కించుకొని వున్నాడు. అతడు ఇట్టూపును వళ్లో పడుకోబెట్టుకున్నాడు. కాళ్లు పడుతున్నాడు. ఓసేపు వంటినిండా ఎపుడూ కురుపులు వుండేవి. అంచేత అతడు చేతిగోళ్ళతో వళ్లంతా రక్తం వచ్చేలా గోక్కొనేవాడు. అతడు ఫాదర్‌సైమన్ తోటలో విరిసిన గులాబీలను చూస్తూ వళ్లు గోక్కుంటున్నాడు.

అరగంట తర్వాత ఫాదర్‌సైమన్ భోజనం ముగించుకొని లావుపాటి సిగార్‌ని పళ్లమధ్య బిగించి వరండాలోకి వచ్చి పడక కుర్చీలో కూర్చున్నాడు.

వళ్లోవున్న ఇట్టూపును ఎడమ చంకలోకి ఎత్తుకొని తొమ్మన్ లేచాడు. వినయంగా తలుపు దగ్గరగా తలవంచుకొని నిల్చున్నాడు.

"ఎవరునీవు?" మతాచార్యుడు పొగవదుల్తూ అడిగాడు.

తొమ్మన్ తనగోడు వినిపించాడు.

ఒక సంవత్సరం కిందట అతడు తిరువాన్‌కూరుకు చెందిన ఆరాకుషి పల్లె నుండి మలబారు వచ్చాడు. అక్కడ తనకున్న పొలమూ పుట్రా అమ్మగా ఏడువందల రూపాయలు చేతకొచ్చాయి. తమ్ముడు చెరియన్, పెండ్లామూ, నలుగురు పిల్లలూ అతడి వెంట మలబారు వచ్చారు. ఇక్కడ ఇరవై ఎకరాల భూమి కొన్నారు. అందులో

ఓ గుడిసె వేసుకొని వ్యవసాయం ప్రారంభించాడు. నాలుగు మాసాలు గడవకముందే అతడి పెద్దకొడుకు జ్వరంతో చనిపోయాడు. మరో రెండు నెలలు తిరక్కముందే అతడి తమ్ముడు చెరియన్ మలేరియా జ్వరం సోకి పరలోకం పాలయ్యాడు. గత మాసంలో పెళ్లాం ప్రసవ సమయంలో చనిపోయింది. అడవి పందులు పండిన పొలాన్ని సర్వనాశనం చేశాయి. యింకేముంది, తనకూ మలేరియా అంటుకుంది. చంటి కుర్రాడికి పాలిచ్చే దిక్కులేదు. అప్పులు కుప్పలయ్యాయి. పిల్లలకు తిండి పెట్టడానికి కూడ గతిలేదు. ఇట్టాపుకు కూడా జ్వరం తగిలింది. యిక వీళ్లను కూడా యిక్కడే వుంచి చంపదలచలేదు. కానీ సహాయం చేసేవారు ఎవరూ లేరు. తనకు సహాయం చేసేవాళ్లు స్వయంగా ఎన్నో బాధల్లోనూ, కష్టాల్లోనూ చిక్కుకుపోయారు. ఫాదర్ దయచేసి ఓ వంద రూపాయలివ్వండి. ఓ సాయిబు దగ్గర యాభైరూపాయలు అప్పుచేశాను. తక్షణం అతడికి వాపసు ఇవ్వాలి. అతడికి డబ్బు యిచ్చేంతవరకూ తొమ్మన్‌ని యిక్కడి నుండి కదలనివ్వటం లేదు. తక్కిన యాభైరూపాయల్తో వూరు చేరుకుంటాము.

తొమ్మన్ దయనీయ పరిస్థితిని ఫాదర్‌సైమన్ జాగ్రత్తగా విన్నాడు.

తొమ్మన్ దయనీయ స్థితి కరుణతో నిండిన ఫాదర్‌కళ్లల్లో గుచ్చుకుంటోంది. కన్నీరు కారుస్తూ తన దీన గాథను చెప్పడం ముగించాడు. "ఏసుప్రభువును హృదయంలో నిలుపుకొని ఈ పసి కందులను రక్షించండి. నా వాళ్లంతా ఇదే మట్టిలో కలిసిపోయారు. ఇక్కడంతా విషమే. అడుగడుగునా కాలకూట విషం. ఎంత త్వరగా యిక్కడి నుండి బయటపడితే అంత పుణ్యం."

తొమ్మన్ వళ్లో కూర్చున్న చంటివాడు అతడి రొమ్మునుండి పాలు తాగడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇట్టాపు స్పృహ తప్పి రెండవ భుజంమీద వున్నాడు.

ఫాదర్ తన తెల్లని గడ్డాన్ని సవరించుకుంటూ నేలవైపు చూపులు మళ్లించి శాంత స్వరంతో ఇలా అన్నాడు. "నేను రూపాయలు ఎక్కడి నుండి తెచ్చేది? చర్చి నిర్మాణం ఇంకా పూర్తికాలేదు. ఇప్పుడు వున్న సొమ్ము కంటే నాలుగురెట్లు డబ్బు కావాలి. అప్పటికి గాని పని పూర్తికాదు. ఈ కొత్త ప్రదేశంలో సహాయంచేసే మనుషులే లేరు. అంచేత దొరికినంత మట్టుకు పైసా పైసా జమచేసి చర్చి పని కోసం వేరుగా వుంచబడింది. నీవు సృష్టికర్త మీద విశ్వాసం కలిగి యిక్కడే వుండిపో."

తొమ్మన్ హృదయం పగిలింది. అతడు ఏడుస్తూ ఇలా అన్నాడు "ఎలా?

ఇంత జరిగాక కూడా నేను ఇక్కడే వుండిపోవాలా? వ్యవసాయం మళ్లీ మొదట్నుండీ మొదలెట్టాలి. దానికి డబ్బు కావాలి. సేరు బియ్యం కొనడానికి కూడా డబ్బులేదు. చిటికెడు వుప్పు దొరికే మార్గంలేదు. ఈ వర్షంలో నేను ఏమి చేయగలను? నా పొలాన్ని వదిలేసి వేరేచోటికి కూలికి వెళ్లాలనివుంది, కానీ నాదగ్గర పార ఎత్తగలిగే శక్తికూడా లేదు..."

"'ఏసుప్రభువు మీద విశ్వాసముంచు. అన్నీ సర్దుకుపోతాయి " ఫాదర్ ఈ మాత్రమే చెప్పగలిగాడు.

వర్షం ఆగిపోయింది. తొమ్మన్ భుజాలమీద పడుకున్న పిల్లల్ని గట్టిగా హత్తుకుని ఓసేపును చేత్తో పట్టుకొని గుడిసెలోకి తిరిగివచ్చాడు. నిస్సహాయంగా... నిర్జీవంగా అయోమయ పరిస్థితిలో... చీకటిలో భయంతో... వగిరించుకుంటూ అతడు ఆ గుడిసెలోకి ప్రవేశించాడు.

వరండా అంతా నీళ్లమయం అయ్యింది. ఓ పాడవాటి పాము పుల్లలతో తయారుచేసిన తలుపు రంధ్రం నుండి లోపలికి ప్రాకుతోంది.

చర్చి నిర్మాణం పూర్తి కాకుండానే దగ్గర్లోనే వున్న స్మశానవాటిక పరిధిని పెంచాల్సి వచ్చింది.

చనిపోయేవారి సంఖ్య బాగా పెరిగింది. అదే నిష్పత్తిలో స్మశానంలో శిలువల సంఖ్య కూడా పెరిగింది.

కశ్రశిలువ కింద తొమ్మన్, మరో చిన్న శిలువ కింద ఇట్టూపు చిరనిద్రలోకి జారుకున్నారు.

తొమ్మన్ చంటికుర్రాణ్ణి అడవినక్కలు తీసుకెళ్లాయి. ఓసేపును ఫాదర్సైమన్ అనాధాశ్రమానికి పంపించాడు.

తొమ్మన్ తాలూకు గుడిసె, పొలమూ మళ్లీ అడివిలో కలిసిపోయాయి.

## ముప్పై ఒకటి

ఆరోజు ఆదివారం.

మరియమ్మ పిల్లలిద్దరికీ స్నానం చేయించి కొత్తబట్టలు వేసింది. తనూ స్నానం చేసింది. ఆమెకూడా కొత్తబట్టలు వేసుకొని తయారయింది. అందరూ కలిసి చర్చికి బయలుదేరారు.

ఆమె ప్రతి ఆదివారం పిల్లల్ని వెంటబెట్టుకొని చర్చికి వెళ్ళేది. చర్చిలో ఆమె ఇలా ప్రారంభించేది. "ఓ కన్యకామాతా! పవిత్ర మేరీమాతా! మా వినయ పూర్వక ప్రార్థనలను మన్నింపుడు. నా పిల్లల్ని, వాళ్ళ తండ్రినీ సదా చల్లగా చూడు. పంటపొలాల్ని తెగుళ్ళనుండీ, అడివి జంతువులనుండీ కాపాడు. నా భర్తకు మంచి మనసును ప్రసాదించు. మా వ్యవసాయం వృద్ధిచెంది మరింత భూమిని మాకు ప్రసాదిస్తే పవిత్ర మేరీ మాతకు, మతాచార్యులకు భక్తిపూర్వకంగా మొక్కులు చెల్లించుకుంటాను. చర్చిలో తన పేరుమీద ఓ వెండి శిలువను బహూకరిస్తాను..."

నిజంగా తన ఆస్తి పెరిగితే చర్చికి ఒక వెండి శిలువను మొక్కుబడిగా చెల్లించాలని ఆమెకు చాలా కోరికగా వుండేది. చర్చి వేదిక మీద కొవ్వువత్తుల వెలుగులో తన శిలువ ఎల్లప్పుడూ ప్రకాశిస్తూ వుంటుందని మనసులో వూహించుకొనేది. ప్రార్థనలో పాల్గొన్న భక్తులంతా మెరిసిపోయే తన శిలువను చూసి "అది పల్లిపరంబిల్ మార్టిన్ భార్య బహూకరించినదని గుర్తు చేసుకుంటారు. మరియమ్మ చనిపోయినా ఆ శిలువను చూసి మరియమ్మను గుర్తుచేసుకుంటారు. రాబోయేకాలంలో జానీ, మేరీకుట్టీ తమ పిల్లల్ని వెంటబెట్టుకొని చర్చికి వస్తారు. అప్పుడు చర్చిలో వున్న ఆ శిలువను పిల్లలకు చూపించి వాళ్లు "అది మీ అవ్వ బహూకరించిన శిలువ" అని చెబుతారు.

చర్చి ప్రార్థనాలయం వేదిక మీద రక్తం చిమ్ముతున్న ఏసుప్రభువు విగ్రహం, దానికి వెనుక ప్రకాశవంతమైన మేరీకన్య విగ్రహం, వారి శిష్యుల ఎదుట మరియమ్మ బహూకరించిన వెండిశిలువ అన్నివేళలా ప్రకాశిస్తూ వుంటుంది.

కాని మార్టిన్ అభిప్రాయాలు ఇందుకు పూర్తిగా విరుద్ధంగా వుంటాయి. మార్టిన్‌కు ఎన్నిచెప్పినా, యేమి చేసినా చర్చి దగ్గరకు వచ్చేవాడు కాదు. జీవితంలో మార్టిన్‌కు రెండే విషయాలు భయాన్ని కలుగజేస్తాయి. ఒకటి పోలీసులు, రెండు చర్చి. పోలీసులను తలుచుకుంటూనే అతడికి ఎర్రటోపీ, చర్చిని గుర్తుచేసుకొంటే చర్చిపై నుండే శిలువ అతడికి భయం కలుగజేస్తాయి. చాలాకాలం కింద ఓసారి తన స్వగ్రామంలో ఓ పోలీసువాడు నిష్కారణంగా మార్టిన్ ముఖం మీద ఓ పిడిగుద్దు గుద్దాడు. ఆరోజు నుండి అతడికి పోలీసులంటే చచ్చేంత భయం. పోలీసువాళ్లు తనను చూశారంటే తప్పకుండా ముఖంమీద గుద్దేస్తారని అతడికి గట్టి నమ్మకం కుదిరింది. ఆ తర్వాత పోలీసు వాడిపేరు ఎత్తితే చాలు భూతం ఏదో

వెంటాడుతున్నట్లు పరుగుతీసి అదృశ్యమయ్యేవాడు.

దేవుడిమీద విశ్వాసం లేదని కాదుగాని మార్టిన్‌కు దేవునిమీద విశ్వాసంకంటే భయం ఎక్కువ. అల్లరిచేసే పిల్లలు దండించే తండ్రిని చూస్తే ఎలా భయపడతారో అలాగే మార్టిన్‌కు దేవుడంటే భయం. తను పాపకార్యాలు చేస్తూంటాడనే భయం మార్టిన్‌కుంది. అందుచేత దేవుడంటే మరీ భయం. ప్రభువు చర్చిలో నివాసం వుంటాడు. కనుక తను చర్చికి దూరంగా వుండాలని మార్టిన్ భావిస్తాడు. చర్చికంటే అతడికి చర్చిమీద వుండే శిలువంటే మరీ భయం. శిలువను చూసి అతడు మనసులో రెండువేల సంవత్సరాల పూర్వం ఏసుప్రభువు ప్రాణత్యాగం చేసిన సంగతి ఏమాత్రం గుర్తుకురాదు. కానీ స్మశానవాటిక, అక్కడి ప్రేతాత్మలూ గుర్తుకువస్తాయి. పోలీసువాడి ఎర్రటోపీ అతడికి సామాన్య ప్రజలను దోపిడీ చేయడం, బాధలు పెట్టడం, చర్చి అంటే మృత్యువునకు చిహ్నంగా భావించేవాడు.

మెల్లమెల్లగా అతడికి శిలువ యెడల భయం స్థానంలో ప్రతీకారం ఏర్పడింది. ఇప్పుడు అతడు శిలువనుచూస్తే చాలు కోపంతో పళ్లు కొఱుకుతాడు. అంతేకాదు దానిమీద రాళ్లుకూడ విసురుతాడు.

ఓరోజున మార్టిన్ శిలువ మీదికి రాళ్లు విసురుతున్నాడు. ఫాదర్ చుల్లిపరంబస్ వెనకనుండి అతణ్ణి పట్టుకున్నాడు. "పాపాత్ముడా! శిలువమీదికి రాళ్లు విసురుతావా?" ఫాదర్ మార్టిన్ చేతినుండి రాయి లాక్కొని కోపంగా చూశాడు.

"నేను శిలువ మీద కూర్చున్న గద్దను తరుముతున్నాను." మార్టిన్ కింది పెదవిని ముందుకుసాచి ముఖం వంకరగా తిప్పి ఎటో చూస్తూ అన్నాడు.

"గద్దా? గద్ద అక్కడ ఎక్కడుంది?" ఫాదర్ అతణ్ణి సందేహంగా చూస్తూ అడిగాడు.

"నేను దాన్ని రాళ్లు విసిరి తరిమేశాను. మరి ఎలా కనిపిస్తుంది?" ఫాదర్ మరి మాట్లాడలేకపోయాడు.

"నీవు ఎక్కడ వుంటున్నావు? నిన్ను ఎప్పుడూ చర్చిలో చూడలేదే?"

"నేను కలియన్ కొండమీద వుంటున్నాను."

"నీవు చర్చికి ఎందుకు రావటంలేదు?"

"నేను చర్చికి రావటానికి నా దగ్గర మంచి బట్టలు లేవు."

"అలాగా! అయితే నా వెంటరా నేను ఓమంచి పాత చొక్కా యిస్తాను."

ఫాదర్ ముందూ మార్టిన్ వెనుకా నడుస్తున్నారు.

"నీవు ఎవరి పొలాల్లోనైనా కూలి చేస్తుంటావా లేక నీ స్వంత భూమి వుందా?" వెళుతూ వెళుతూ ఫాదర్ అడిగాడు.

"ఏమీ చేయలేకపోతున్నాను."

"ఎందుకు? నీకేమైనా జబ్బా?"

"ఔను."

"ఏమి జబ్బు?"

"కడుపులో నొప్పి. ఓర్చుకోవడం కష్టమైపోతోంది."

"ఎన్నేళ్ళనుంచీ?"

"అయిదేళ్లనుంచీ"

"నీవు రోజూ చర్చికి వచ్చి ప్రార్థన చేయి. నీ జబ్బు నయమౌతుంది, ఏమిటి?"

జవాబు లేదు. ఫాదర్ వెనుతిరిగి చూశాడు. మార్టిన్ నీడకూడా లేదక్కడ. అతడు పక్కదారి పట్టి పరుగుతీశాడు. ఫాదర్ చూపులకు అందనంత దూరం పారిపోయాడు.

## ముప్పై రెండు

రాత్రిపూట మాధవి అప్పుడప్పుడూ తూర్పున వున్న కొండవైపు చూస్తూ వుంటుంది.

ఏంతోనీ గుడిసె నుండి కనిపించే లాంతరు వెలుతురు ఆమెను చికాకు పెట్టేది. ఆ చిరు వెలుతురును ఆమె ఓసారి చిరునవ్వుతోను, మరోసారి విసుగుదలతో దీర్ఘ నిట్టూర్పులతోను, ఇంకోసారి అసహనంగా చూస్తూ వుండేది. ఆ సమయంలో ఆమె కళ్లల్లో కోరికల తరంగాలు పరవళ్లు తొక్కేవి. మనసులో చెలరేగే భావాలు ఆనందడోలికలతో సయ్యాటలాడించేవి.

కాని ఆ చిరుదీపపు కాంతి మాధవి దృష్టిలో ఎంత ప్రముఖమైందో ఏంతోనీకి బొత్తిగా తెలియదు. నిశ్శబ్దంగా, నిశ్చలంగా ఆ చీకటిరాత్రి పూట ఓ కొండమూల నుండి ఎవరికీ తెలియకుండా ఎవరికో సందేశమిస్తున్నట్లుగా ఆ దీపం వెలుగుతోంది.

ఏంతోనీ దీపం ఎదుట బైబిలు చదవడానికి తెరిచివుంచాడు. కానీ అతడి మనసులో ఏవేవో ఆలోచనలు చెలరేగుతున్నాయి. "మతాచార్యుని పవిత్ర జీవితం - అదే నా జీవిత లక్ష్యం. నేను నిస్వార్థభావంతో ఏసుప్రభువు సందేశవాహకునిగా

పేదలకూ, పాపులకూ సేవ చేయాలని కోరుకుంటున్నాను. అది ఒక సన్యాసి జీవితం." ఇలా ఆలోచిస్తూ అతడు ఏసుప్రభువు పటం వైపు ముఖం మళ్లించి నిల్చున్నాడు.

"పాపాత్ముల పాపాలను కడిగి వేయడానికి ఏసుప్రభువు తన రక్తాన్ని చిందించాడు. నేను కూడా వారి అడుగుజాడలలోనే నడుస్తాను. ఓ ఏసుప్రభువా! మానవుల పాపాలనే ముళ్లకిరీటాన్ని ధరించి నీవు అందించిన త్యాగపూర్ణ సందేశం అనుపమైనది. ఆ ఆలోచనామృతం నుండి ఓ చిన్న అమృత బిందువును ఈ నీ సేవకునికి ప్రసాదించు."

అతడు ఏసుప్రభువు పటము ముందు తలవంచి కళ్లు మూసుకొని మోకాళ్లు నేలమీద ఆనించి ప్రార్థన చేయసాగాడు.

తూర్పు కొండమీద కట్టిన ఆ గుడిసెలో వెలిగేదీపం చుట్టూ యౌవనంతో కామం కప్పిన కళ్లతో ఎక్కడెక్కడి నుండో దీపపు పురుగులు ఎగిరి వచ్చి తమకు తాము ఆ దీపానికి ఆహుతి అయ్యేవి. కానీ ఆ సన్యాసికి వీటి గురించి ఏమీ తెలియదు.

ఏంతోనీ ప్రార్థన తర్వాత పవిత్రగ్రంథాన్ని తెరిచి చదవసాగాడు.

"నీవు ఎప్పుడూ పొరుగువారి పెళ్లాం గురించి యోచింపకు. తన పొరుగువాడి ఇల్లూ, పొలమూ, సేవకులూ అంతేగాక ఏ వస్తువునూ పొందాలని యోచింపకు..."

అతడు పై విషయాన్ని మళ్లీ చదివి దానిని గురించి ఆలోచించసాగాడు.

పడమటి కొండపైన ఆ వేళప్పుడు కూడా దీపం వెలుగుతోంది. అతడు చూశాడు. ఆ గోరంత దీపం చైత్ర నక్షత్రంలా వెలుగుతోంది.

మాధవి ఇంకా నిద్రపోలేదు.

ఆ దీపం ఆమె హృదయంలో ఎన్నో జ్ఞాపకాల్ని మళ్లీ నిద్రలేపింది. ఏంతోని సముపార్జించుకొన్న ఆధ్యాత్మిక భావాలను ఏదో అజ్ఞాత శక్తి కుదుపుతోంది. దుర్వాసనతో బురదతోనిండిన యేటి ఒడ్డున వీచే వేడిగాలికి ఆ దీపం వెలుగుతున్నట్టూ అది తనను చెడు మార్గం పట్టించి గొయ్యిలోకి నెట్టివేస్తుందని అతడి మనసులో మెదిలింది.

అతడు తలవంచుకొని మళ్లీ చదవనారంభించాడు.

అతడు ఎంత సేపట్నుండీ ఇలా చదువుతున్నాడో అతడికి తెలియలేదు.

తలపైకెత్తి చూశాడు. పడమటి కొండమీద దీపం ఆరిపోయింది. అర్ధరాత్రి పూట పక్షులు చెట్ల కొమ్మల్లో కీచులాడుకుంటున్నాయి.

ఏంతోనీ పడుకోబోయేముందు చేసే చివరి ప్రార్థన ముగించి పక్కమీద కంబళి కప్పుకొని పడుకున్నాడు.

రోజూ మాదిరిగానే అతడు మరుసటిరోజు వుదయాన్నే నిద్రలేచాడు. ప్రాతః కాలీన పిల్లగాలులు ప్రకృతి సౌందర్యాన్ని రెట్టింపు చేశాయి. చంద్రుడు ఇంకా అదృశ్యం కాలేదు. వెన్నెల ప్రకాశిస్తోంది.

అతడు దీపాన్ని వెలిగించి కంబళితో ముఖం తప్పించి శరీరాన్నంతా కప్పుకొని పుస్తకం తెరిచి చదువుతున్నాడు.

కొంతసేపటి తర్వాత పడమటి కొండబావి నుండి నీళ్లు తోడుతున్న చప్పుడు వినిపించింది. అతడి మనసు ఆ బావిమీదకు మళ్లింది. కేవలం నీడ మాత్రమే కనిపిస్తోంది. వెన్నెట్లో బొప్పాసి మొక్క ఆకుల నీడలు కదులుతూ ఏ [illegible] దయ్యం చేయి వూపుతున్నట్లు భ్రమ కలిగిస్తోంది

ఉషోదయ రేఖలు మెల్లమెల్లగా విస్తరించసాగాయి. వెన్నెల, పొగ మంచు కారణంగా ఇంకా కొండలపై పచ్చదనం కనిపించడం లేదు. ఆ మసక [illegible]తురులో పడమటి కొండమీద పొగ లేస్తోంది. ఆ పొగ మాధవి రగిలించే పొయ్యినుండి వస్తోంది.

మెల్లమెల్లగా చీకట్ల తెరలు తొలగే కొద్దీ పడమటి కొండల్లో ఎడు పపొదల పైభాగాన విరిసిన పూలు నెమలి ఫించాల్లాగా కదులుతున్నాయి. అక్కడికి దగ్గర్లోనే మాధవి మేతవుంది. అక్కడి నుండే పొగ పైకి లేస్తోంది.

ఏంతోనీ యిదంతా ప్రాతఃకాలీన స్వప్నంలో చూస్తున్నట్లుంది. సూర్యభగవానుడు ఆకాశంపైకి ఎగబ్రాకుతున్నాడు.

అడవీ, పొలం అద్దంలో ప్రతిబింబంలా కనిపిస్తున్నాయి.

చాలాదూరం నుండి పొలం గట్లమ్మట ఓ తెల్లని ఆకారం తన గుడిసెవైపు కదిలిరావడం ఏంతోనీ గమనించాడు. ఏంతోనీ దిగ్భ్రాంతి చెంది చూస్తుండిపోయాడు. ఆ వస్తున్నది మాధవి!

మాధవి గుడిసె ముంగిట నిలుచున్నది. చేతిలో పాల చెంబువుంది.

ఏంతోనీని చూచి ఆమె నవ్వుతుంటే పళ్లు చామంతుల్లా మెరిసిపోతున్నాయి.

"బాబుగారూ, పాలు అక్కరలేదా?" చమత్కారంగా అడిగింది మాధవి.

ఏంతోనీ గంభీరంగా కూర్చున్నాడు. "పాలు వంటింట్లో పాలగిన్నెలో పోయి." బైబిలు పుటలు తిప్పుతూ చెప్పాడు.

మాధవి వంటింట్లోకి దూరింది. అక్కడ వంటపాత్రలు చెల్లాచెదురుగా పడివున్నాయి. ఆమె ఓ మట్టి పాత్ర మూత తెరచి చూసింది. అందులో చద్దన్నముంది. రెండోపాత్రలో వుడికించిన కర్రపెండలం వుంది.

ఆమె అంట్లన్నిటినీ ఒకచోట చేర్చి శుభ్రం చేసింది. వంటగదిని చీపురుతో తుడిచింది. పొయ్యి రగిలించి పాలు వేడి చేస్తోంది.

ఎంతోనీకి యివేమీ నచ్చటం లేదు. మధ్యమధ్యలో వంటగదివైపు చూస్తూ మళ్లీ వెళ్లి వరండాలో కూర్చుంటున్నాడు.

వంటగదిలో పని ముగించుకొని చెంబుతో మాధవి బయటకు వచ్చింది. ఎంతోనీ కృతజ్ఞతాభావంతో ఆమె వైపు చూశాడు. అతడు ఏమైనా మాట్లాడతాడని మాధవి తలచింది. కానీ అతడు ఏమీ మాట్లాడలేదు. బెల్లంకొట్టిన రాయిలా కూర్చునిపోయాడు.

ఆమె ముంగిట అడుగుపెడుతున్నప్పుడు ఏంతోనీ పిలిచాడు. ఆమె వెనుతిరిగి చూసింది. "మాధవీ, రేపట్నుండీ పాలు తేవద్దు."

ఏంతోనీ నేలవైపు చూస్తూ తడబడుతూ చెప్పాడు.

"నేను పాలు తీసుకరాకూడదంటారా లేక అసలు పాలేవద్దా?" మాధవి అతడిని ఓరకంట చూస్తూ అడిగింది.

ఏంతోనీకి ఏమి జవాబు చెప్పాలో తెలియడంలేదు. మాధవి ఎంతోనీ జవాబుకోసం ఎదురు చూడకుండా ముందుకు కదిలింది. ఆమె కళ్లు ముంగిట నున్న బొప్పాసి మొక్కమీద పడ్డాయి. ఆ చెట్టు మీద ఓ కొండకాకి పండిన బొప్పాసి పండును ముక్కుతో పొడుచుకు తింటోంది. ఆమె చెంబు కిందబెట్టి నలువైపులా చూసింది. దగ్గర్లోనే ఓ వెదురుకర్ర పడివుంది. ఆ వెదురు కర్రతీసి బొప్పాసి మొక్కపైకి ఎత్తింది. కాకి ఎగిరిపోయింది. ఆమె ఆ కర్రతో బొప్పాసి పండును నేలమీదికి రాల్చింది. వంగి పండును తీసుకొని ఏంతోనీ దగ్గరకు వెళ్లింది.

ఆమె రావడం తాను ఎరగలేదన్నట్లు మోకాళ్లమధ్య తలమోపి కూర్చుండిపోయాడు.

"ఏంతోనీ! కత్తివుందా?" ఆమె అడిగింది.

ఏంతోనీ పక్కకింద వేటకత్తి వుంది. ఆమె స్వయంగా కత్తి తీసుకొని తొక్కతీసింది. పండును కోసి ఓ ముక్క తింటోంది.

"కాకి కొరికిన పండు రుచి అద్భుతంగా వుంటుంది." పండు తింటూ అంది. ఓ ముక్కకోసి ఏంతోనీ నోటికి దగ్గరగా చేయి చాచింది.

"నాకు వద్దు" అని ఏంతోనీ మనసులో అనుకున్నాడు. కానీ చెప్పలేదు. అతడు నోరు విప్పలేదు. అతడు పండు ముక్కతీసుకొని తన దగ్గర వుంచుకున్నాడు.

మాధవి మరో ముక్క తింది. "ఇంటిముందు చెట్టుమీది పండును కాకి పొడుస్తున్నా ఏంతోనీకి ఏమీ పట్టదు. ఔనా?"

ఏంతోనీ ఏమీ మాట్లాడలేదు.

"మీరు పండు ఎందుకు తినలేదు? అది తినరానిపండా?" ఆమె గలగల నవ్వుతూ అంది.

ఆమె నవ్వు ఏంతోనీకి కోపం తెప్పించింది. అది ఒక వేశ్య నవ్వినట్లుంది. మాధవి ముఖంవైపు చూడ్డానికి అతడికి ధైర్యం చాలడంలేదు. ఆ కళ్లు! ఆ కళ్లల్లో తనను మత్తు ఎక్కించే విషముంది.

అతడు భయస్తుడు. ఆమె నవ్వు అతడి మనసు పొరలను బద్దలుకొట్టి కరిగించివేసింది. నేను చాలా జాగ్రత్తగా వుండాలి. తను రేపటి మతాచార్యుడిగా నిలవాలి.

"మంచిది మహానుభావా! మళ్లీ కలుసుకుందాం." ఆమె చెంబు చేతబట్టుకొని వెనుతిరిగింది. "బాబోయ్! పాము!" ఆమె అక్కడే ఆగిపోయింది. ఓ పాము బొప్పాసి మొక్క దగ్గర్నుండి ముందుకు ప్రాకుతోంది.

ఆరోజు సాయంకాలం అయింది.

కృష్ణన్ నంబియార్ తూర్పువైపు అడవుల్లోకి వెళ్లాడు. నాలుగు రోజులతర్వాత ఇల్లు చేరుకుంటాడు. మాధవీవాళ్ల మామ్మ భోంచేసి నిద్రకు ఉపక్రమించింది. మాధవి తన గదిలోకి వెళ్లిపోయింది.

తూర్పువైపు కొండమీద దీపం వెలుగుతోంది. మాధవి కిటికీనుండి అటువైపు చూసింది. ఏంతోనీ దీపం ఓ నక్షత్రంలా వెలిగిపోతోంది.

మాధవి గుట్టుచప్పుడు కాకుండా గదిలోనుండి బయటికివచ్చింది. తలుపు

మూసేసి వరండాలోకి దిగింది. అక్కడ కొద్దిసేపు సందిగ్ధంగా నిలుచుండిపోయింది. తరువాత మెల్లగా మెట్లు దిగి పొలాలను దాటుకుంటూ తూర్పు కొండలవైపు నడక సాగించింది.

పొలాలు దాటుకొని అడవి అంచుకు చేరుకుంది. కోతి అరుపులు విని నలువైపులా చూసింది. అడవిలో రెండుకోతులు చెట్టుమీద కీచులాడుతూ కుప్పిగంతులు వేస్తున్నాయి.

ఆమె బెదిరిపోయి కొంతసేపు అక్కడే నిలుచుంది. దగ్గర్లోనే చెట్లపొదల్లో పులి వుందేమోనని అనుమానించింది. పులిని చూడకుండా రాత్రిపూట కోతులు అలా కీచులాడవు. తన మిత్రులకు శత్రువుజాడ తెలపడానికి పులి వెళ్లే మార్గంలో కొమ్మలమీదే ఎగురుతూ శత్రువు వెంబడి అరుస్తూ వుంటాయి.

మాధవి భయపడింది. నాలుగువైపులా అడవి, చుట్టూ కటిక చీకటి. ఆకాశంలో నల్లని మేఘాలు కమ్ముకున్నాయి.

ధైర్యం చేసుకొని ఆమె మెల్లమెల్లగా ముందుకు నడిచింది. కోతుల అరుపులు అడవిలోతట్టు వైపు వినిపించసాగాయి. ఆమె అడివిదాటి మైదానంలోకి చేరుకుంది. ఏంతోనీ గుడిసెదీపం ఓ పెద్ద నక్షత్రంలా ప్రకాశిస్తోంది. ఆ దీపం ప్రపంచానికంతటికీ వెలుగును ప్రసారం చేస్తున్నట్లు అనిపించింది ఆమెకు. ఆమె చేరుకోవాల్సిన లక్ష్యంకూడా ఆ వెలుతురువైపే. ఆమె ఎలాగో ఏంతోనీ పొలం చేరుకొంది. అప్పటికిగాని ఆమె గుండెదడ తగ్గలేదు. కర్రపెండలం వేళ్లు కాళ్లకు తగులుతున్నాయి.

ఆమె మెల్లగా కొండమీదికి ఎక్కసాగింది. చివరికి ఏంతోనీ గుడిసె ముంగిట మర్రి చెట్టు నీడలో దాక్కొని నిలుచొంది.

ఏంతోనీ మంచంమీద తలవంచుకొని కూర్చొని బైబిలు తెరిచి చదువుతున్నాడు. "దేవుడు ఆదామును పిలిచి ఇలా అన్నాడు. ఆదామూ! నీవు ఎక్కడున్నావు?"

అతడు జవాబు ఇలా చెప్పాడు. "తోటలో నేను మీ పిలుపు విన్నాను. నేను నగ్నంగా వున్నందున దాక్కున్నాను." దేవుడు అతడిని అడిగాడు 'నీవు నగ్నంగా వున్నావని నీకు ఎవరు చెప్పారు?' నేను నీకు యే చెట్టు పండుని తినవద్దని చెప్పానో ఆ చెట్టు పండునే నీవు తిన్నావు.

అది విని ఆదాము ఇలా చెప్పాడు 'మీరు నా దగ్గర కూర్చోమని చెప్పి యే స్త్రీని పంపించారో ఆ స్త్రీయే నాకు ఆ పండునిచ్చింది. దాన్ని నేను తిన్నాను.'

ఏంతోనీ బైబిలులోని ఆ వాక్యం మీద చూపుడువేలుతో నొక్కుతూ తలపైకెత్తి ఏదో ఆలోచనలో పడ్డాడు.

అతడు ఆరోజు వుదయం జరిగిన సంఘటనలన్నిటినీ నెమరు వేసుకోసాగాడు. ఆదాము తోటలోకి కూడా పాము చొరబడింది. అవ్వ ఆదాముకు పండు తినమని యిచ్చింది. అతడు ఆ పండును తినేశాడు. అతడికి దేవుడు ఆ పండును తినవద్దని హెచ్చరించాడు. బైబిలులో చెప్పబడిన సంఘటనలన్నీ ఆరోజు వుదయం తనకు ఎదురయ్యాయి. ఏదో జరిగేటట్లుంది. అకారణంగా యేదో భయం అతడి చైతన్యాన్ని పట్టి కుదుపుతోంది. మనస్సు వేడెక్కింది. ఆలోచనలన్నీ మాయమయ్యాయి. అతడు ముంగిలివైపు దృష్టి సారించి చూస్తున్నాడు.

ఆ మర్రిచెట్టు కింద యేదో నీడ నిలబడివుంది. బహుశా అది సైతాను కావచ్చు?

"ఎవరూ?" ఏంతోనీ దీపం వత్తి ఎక్కించి గట్టిగా పిలిచాడు.

"నేను, ఒక స్త్రీని. నీ దగ్గర కూర్చోడానికి వచ్చాను."

మాధవి గలగలా నవ్వుతూ చెట్ల వెనక నుండి ముంగిలిలోకి దిగి వచ్చింది.

"ఎవరూ? మాధవీ?" ఏంతోనీ గాబరా పడ్డాడు. అతడు తన కళ్లను తానే నమ్మలేకపోయాడు.

"ఈ వేళప్పుడు నీవు ఇక్కడికెందుకొచ్చావు?" కోపంగా అడిగాడు.

మాధవి జవాబు ఏమీ చెప్పకుండా మెల్లగా వరండా మెట్లు ఎక్కి ఏంతోనీకి దగ్గరగా మంచంమీద కూర్చుంది.

ఏంతోనీ పూర్తిగా అయోమయంలో పడ్డాడు. అతడికి ఏసుప్రభువును ప్రార్థించాలనిపించింది.

కొంతసేపటి తర్వాత బైబిలు తెరిచి మనసు కేంద్రీకరించి చదవసాగాడు. మాధవి అక్కడ వుండటం అతడికి బాధాకరంగా వుంది. మనసు బైబిలు మీద నిలుపలేకపోతున్నాడు. ఏదో తెలియని అసహ్యం. బైబిలు తెరిచి ఎలాగో ఓ పేజీ అతికష్టం మీద చదివాడు. కానీ అందులో ఒక్క ముక్కకూడా మనసులోకి ఎక్కడం లేదు. మాధవి ఏంతోనీ మనసును మంచుపర్వతంలాగా కప్పేసింది అతడు

బైబిలులోని కొన్ని దృశ్యాల్ని మనసులో నిలుపుకోడానికి ప్రయత్నించాడు. ఆదిమానవుడైన ఆదాము తోట... కానీ అవన్నీ తన తోటలో మర్రిచెట్టు పాము, మాధవి, ఇవే దృశ్యాలు కనిపిస్తున్నాయి.

అతడి ఊహాశక్తిని ఏదో వస్తువు నొక్కిపట్టినట్టుంది.

అతడి నవ యౌవ్వన పురుషత్వం చంచలమైపోయింది. ఇవేమీ అతడికి తెలియడంలేదు. ఇంతవరకూ తన భావాలకు అనుగుణంగా నిలిచిన విద్యుత్తరంగాలు తన ఆలోచనలను అల్లకల్లోలం చేస్తున్నాయి. అతడు అడివివైపు చూస్తూ జుట్టు పీక్కోసాగాడు. మళ్లీ వున్నట్టుండి పిచ్చివాడిలాగా మాధవివైపు తిరిగి గర్జించాడు. ''నీవు ఇక్కడినుండి వెళ్లిపో'' అతడి అరుపులు స్వాభావికంగా, ధైర్యంగాలేవు. కేవలం అతడి హృదయ దౌర్బల్యానికి ప్రతిరూపంగా వున్నాయి.

మాధవి ఏమాత్రం కదల్లేదు. ఆమె చిరునవ్వు నవ్వుతూ అడిగింది. ''నేను ఏంతోనీని ఏమీ చేయలేదు కదా? మౌనంగా ఇక్కడ కూర్చున్నాను. మరి నన్ను ఇక్కడినుండి ఎందుకు తరుముతున్నావు.''

''నీవు వెళ్లిపో... నన్ను నిద్రపోనీ.'' అతడు మొండి పిల్లవాడిలాగా ముఖం వంకరగా పెట్టి పెదవులు కొరుకుతూ అన్నాడు.

''యేం? నన్ను చూస్తే ఏంతోనీకి నిద్రపట్టదా?''

''మాధవీ! ఇటుచూడు! అనవసరంగా మాట్లాడకు. నీవు రాత్రిపూట ఇటురావద్దు. అంతేకాదు, నీవు ఎప్పుడూ ఇటురాకు.''

మాధవి ముఖం నల్లబడింది. కళ్లు నల్లబడ్డాయి. ఆమె అతణ్ణి కోపంగా చూసింది. ఆ తర్వాత ఏమీ మాట్లాడుండా ముంగిట్లోకి దిగి నడవసాగింది.

ఏంతోనీ నిబ్బరంగా గాలి పీల్చుకున్నాడు. ప్రభువు అతణ్ణి పరీక్షించాడు. ఆ పరీక్షలో అతడు నెగ్గాడు. సైతాను గుప్పెటనుండి బయటపడ్డాడు.

ఇప్పుడు అతడికి దేవుని ప్రార్థించాలని కోరిక కలిగింది.

ఏమైనా అతడి శరీరంలో వ్యాపించిన వుద్రిక్తత ఇంకా సడలలేదు. అతడి హృదయం పొరలలో ఎక్కడో అజ్ఞాతంగా నిరాశ పొగలు గక్కుతోంది. అందమైన అవకాశాన్ని చేజార్చుకున్నట్లు బాధ. జన్మజన్మాంతరాల నుండీ అటునుండి వచ్చిన ఆహ్వానం. సృష్టి రహస్యపు మధురగీతం అతడి హృదయంలో ప్రతిధ్వనిస్తోంది... చెదిరిన ఆలోచనలతో బయటికి దృష్టి సారించాడు.

అప్పుడే ఆకాశంలో మేఘాలు కమ్ముకున్నాయి. ఆకాశంలో సంచలనం మొదలైంది.

ఆకాశం మెరుపులనే చేతులు చాచి నగ్నంగా వున్న భూమిని తచ్చాడుతోంది. ఆ మెరుపు కౌగిళ్లలో కొండలూ లోయలూ నగ్నంగా కనిపిస్తున్నాయి.

ఆకాశం ఆగ్రహించి గర్జిస్తోంది.

ఆకాశపు నిట్టూర్పుల తాకిడి ఎక్కువయింది. భీకర గర్జనలు! భూమీ ఆకాశం ఒకటైపోయాయి. దానితోపాటు వర్షం మొదలైంది... కుండపోత వర్షం.

ఏంతోనీ ఆ ప్రకృతి లీలలను చూస్తూ మౌనంగా కూర్చుండిపోయాడు.

కొంతసేపటికి వరండాలో ఏదో అలికిడి విని వెనక్కి చూశాడు. మాధవీ, మళ్లీ వచ్చింది?

ఆమె వర్షంలో పూర్తిగా తడిసిపోయింది. వరండాలోకి వచ్చింది. చలికి వణికిపోతోంది. చేతులు రెండూ ఛాతీని కప్పుకొని మౌనంగా నిల్చుంది.

ఏంతోనీ ఆమె వైపు చూశాడు. ఆమె తడిసిన జండాలాగా వుంది. తలవెంట్రుకల నుండీ, బట్టల అంచులనుండి నీటి బిందువులు నేలరాలుతున్నాయి. రవిక తడిసిపోయి శరీరానికి అతుక్కుపోయింది. బిగువైన స్తనద్వయం సూటిగా రవికలోంచి దర్శనమిస్తున్నాయి. ఆమె తడిసిన శరీరపు సౌందర్యం అపూర్వంగా వుంది. అతడు తదేకంగా చూస్తుండిపోయాడు. ఆమె మెల్లగా రవిక విప్పి మంచం మీద వుంచింది, తర్వాత చీర విప్పి పిండింది.

ఏంతోనీ సర్వం మరిచిపోయి ఆమెవైపే చూస్తుండిపోయాడు. ఆమె నీడలాగా నగ్నంగా నిలుచుంది. కడు తీక్షణంగా మరోమారు అతడు ఆమెను చూశాడు.

ఆమె అలాగే నిలుచొని వుంది. మెరుపు మెరిసే సమయంలో ఒక విశాల భూభాగం కనిపిస్తోంది. సరిగ్గా అదే విధంగా ఒక్కక్షణంలో ఒక అజ్ఞాత ప్రపంచదృశ్యం కనిపించింది.

ఏకాంత వాతావరణం వాళ్లిద్దర్నీ దగ్గరకు లాగుతోంది. ఓ పిల్లగాలి వాళ్లిద్దర్నీ స్పర్శిస్తోంది. కుంభవర్షపు హోరు వాళ్లిద్దరికీ వినిపిస్తోంది. ఏంతోనీ అంతరాత్మ సృష్టికి మూలకారణాన్ని వెదుకుతోంది. విషమ పరిస్థితిలో చిక్కుకుపోయిన అతడి మనసు ఇప్పుడు యధార్థస్థితిని తెలుసుకోగలిగింది. అతడి హృదయంలో ఓ విచిత్రమైన భయం పట్టుకొంది. తాను ఓ ఎత్తైన రాతి అంచుమీద కూర్చున్నట్లు, ఏమాత్రం

జారినా తనకు తెలియని లోయల్లోకి కూరుకుపోవడం ఖాయం అనుకున్నాడు. సుషుప్తావస్థలోనున్న అతడి కాముక భావాలు ఒక్కసారి ప్రజ్వరిల్లాయి. రక్తనాళాలు ఉప్పొంగిపోయాయి. మెదడులో నాడులు లాగుతున్నట్లనిపించింది. వేడిపొగలో కళ్లకు బైర్లు కప్పినట్లుంది. కామంతో పెరిగిపోయే నల్లనిపొగ. విజ్ఞానము, వివేకము, వేదతత్వము, ఆదర్శము అన్నీ ఆ నల్లని పొగతో కప్పబడ్డాయి. ప్రకృతి సహజమైన కోరికలు అణగలేదు. అవి అణువిచ్ఛేదము కంటే పదిరెట్లు శక్తి కలిగినవి. ద్రవీకరణముకానిదే కల్లోలపరచే జ్వాలాముఖి అణగారదు.

అతడి భుజం మీద చల్లని స్పర్శ, ముఖంమీద వేడి శ్వాస తగిలింది.

"అబ్బ! చలేస్తోంది, చలిచలిగా వుంది బాబోయ్!" ఆమె అతడి చెవిలో మంత్రిస్తోంది. ఆమె అతడి మెడమీద చేయి వేసి కంపించే ఛాతీకి అతుక్కుపోయి నిలుచొంది.

ఏంతోనీ కాళ్లు వణకసాగాయి. అతడు ఆ బండరాయి మీదినుండి తెలియకుండానే జారిపోసాగాడు. ఏదో తెలియని లోతులోకి - యుగయుగాల శూన్య తరంగాల ప్రవాహంవైపుకి - ఆ విచిత్ర మైమరపు ఎదుట ప్రపంచమంతా పొగలాగా అదృశ్యమైపోతుంది. ఆ ఆత్మీయ సౌఖ్యంవైపు - అతడు నిస్సహాయుడై ఆమె నడుంమీద చేయి వేసి ఆమె మీద పడిపోయాడు.

కావలసినదంతా అయిపోయింది. అతడు నిశ్చలంగా మౌనంగా కూర్చుండిపోయాడు. మాధవి అతడి మంచం మీద నిశ్చింతగా నిద్రపోతోంది. అతడి బైబిలు ఆమె కాలికింద నలిగిపడివుంది. కొన్ని పుటలు చెల్లాచెదురుగా పడివున్నాయి. అతడికి బైబిలును తాకడానికి కూడ సాహసం చాలడం లేదు.

మరోమారు అతడు ఆమెవైపు చూశాడు. ఆమె నగ్నత్వం అతడికి అసహ్యం కలగజేస్తోంది. తనను కాటేసి నిద్రిస్తున్న ఆ విషనాగును చూస్తున్న కొద్దీ అతడిలో భయాన్ని కలుగజేస్తోంది. తనకు దైవప్రార్థన చేసుకొనే అర్హత లేదని అతడికి తెలిసిపోయింది. నిస్సహాయంగా అతడు ఏడవసాగాడు.

## ముప్పై మూడు

మరియమ్మ చాపమీద పడుకొని మలేరియాతో బాధపడుతోంది. ఆమెకు భరించరాని చలివేస్తోంది. చలి తన ఎముకల్ని ఛేదించి లోనికి వ్యాపించినట్లుంది. ఆమె తల్లో

నాడులు, శరీరంలోని నరాలన్నీ కంపిస్తున్నాయి.

"నన్ను గట్టిగా అదిమి పట్టుకోండి. గట్టిగా అదమండి." మరియమ్మ విలపిస్తూ బొంగురుపోయిన కంఠంతో అరుస్తోంది.

మార్టిన్ కొద్దిదూరంలో నిల్చొని మరియమ్మ జ్వరంతో వేసే కేకలు వింటున్నాడు.

"అరే సైతాన్! నన్ను అదిమి పట్టుకో, గట్టిగా నొక్కు." మరియమ్మ మార్టిన్‌ను గర్జిస్తోంది.

మార్టిన్ కుర్రాడిలాగా మోకాళ్లు నేలమీద ఆనించి మరియమ్మకు దగ్గరగా కూర్చున్నాడు. ఆమె లావుపాటి శరీరాన్ని పట్టి గట్టిగా నొక్కుతున్నాడు.

మార్టిన్ వళ్లు పట్టినప్పటికీ మరియమ్మకు ఏమాత్రం బాధ తగ్గలేదు. జ్వరం ఎంత తీవ్రంగా వుందంటే ఆమె ఛాతీలో ఏదో ఆవిరి యింజను పనిచేస్తున్నట్లుంది.

"నన్ను బాగా గట్టిగా నొక్కు." ఆమె బాధతో మెలికలు తిరుగుతోంది.

మార్టిన్ ఆమెను చాపమీద పడుకోబెట్టి కండరాలూ ఎముకలూ విరిగేలా నొక్కుతున్నాడు. అప్పటికీ ఆమె శరీరంలో బాధ తగ్గలేదు. కాళ్లూ చేతులూ విసురుతూ పిచ్చిదానిలా ఏదో గొణుగుతోంది.

కొద్దిసేపటికి ఆమె బాధ కొంచెం తగ్గింది. వళ్లంతా చమటలు పట్టాయి. విపరీతంగా దాహమేసింది.

"ఓ మేరీకుట్టీ! వేణ్ణీళ్లు తీసుకరా " హీనస్వరంతో కూతురుని పిలిచింది.

"అమ్మా, వున్న వేణ్ణీళ్ళన్నీ అయిపోయాయి."

మేరీకుట్టీ నీళ్ల పాత్ర మూత తెరిచి అంది.

"కప్పలాగా నిలుచున్నావేంటే? తెలివిలేనిదానా! ఓ కుండడు నీళ్లు త్వరగా వేడిచెయ్యి. నేను యిక చచ్చిపోతానే పిల్లా."

మేరీకుట్టీ పొయ్యి రాజేస్తోంది.

మరియమ్మ అలసటవల్ల కొద్దిసేపు అలాగే పడివుంది.

ఆ తర్వాత మూలుగుతూ కళ్లు తెరిచి అటూ యిటూ చూడసాగింది. మార్టిన్ యింకా మరియమ్మ దగ్గరే కూర్చుని వున్నాడు. అతడు ఆమె శరీరానికి ఏదో లేపనం రాస్తున్నాడు.

'లేచిపో' మరియమ్మ మార్టిన్‌ని ప్రక్కకు తోసింది. మెల్లగా లేచి కూర్చుంది.

చెరిగిన తల వెంట్రుకలు సవరించుకొని వంటిమీద చెమట తుడుచుకుంది. సగం తెరిచిన కళ్లతో చాపమీద అసహనంగా కూర్చుంది.

మేరీకుట్టీ ఓ కుండడు వేడినీళ్లు తెచ్చి ఆమె ముందుంచింది. మరియమ్మ ఓ గిన్నెలోకి వేడినీళ్లు వంపుకొని తాగింది. తర్వాత వేడినీళ్లతో పాటు మందుబిళ్లలు మింగింది. దాదాపు ఆరు సేర్ల మాయిన వేడినీళ్లు తాగి వుంటుంది. మాటిమాటికీ నీళ్లు తాగుతోంది.

రెండవరోజుకు మరియమ్మ జ్వరం తగ్గిపోయింది. ఆమె రోజూకంటే ఎక్కువ అన్నము, కర్రపెండలము తినింది. పార, గొడ్డలి చేతబట్టి కొండవైపుకు బయలుదేరింది.

# ముప్పై నాలుగు

కురియన్ కొండమీద పొలంలో పని చేసుకుంటున్నాడు. ఇంతలో కొండతేలు కురియన్ కాలుమీద కుట్టింది. అతడు రాయి తీసుకొని కొండతేలును చంపి ముక్కలుముక్కలు చేశాడు. కానీ అతడి కాలుమీద బాధ ఎక్కువయింది. పని వదిలేసి గుడిసెకి వెళ్లడం మంచిదనుకున్నాడు.

బాధ వోర్చుకోలేకపోతున్నాడు. పండ్లతో పెదవిని అదిమి పట్టి గుడిసెకు బయలుదేరాడు.

గుడిసె దగ్గర ఏమీ అలికిడి లేదు. కొబ్బరి ఆకుల తలుపుమూసి వుంది. అతడి పిల్లవాడు వరండాలో చాపమీద నిద్రపోతున్నాడు. పెండ్లాం సారమ్మ ఎక్కడా కనిపించడంలేదు.

అతడు వరండాలోకి ప్రవేశించి గుడిసె లోపలికి తొంగిచూశాడు. కోడెదూడ బుసకొడుతున్నట్లు శబ్దం వినిపిస్తోంది. అది మగవాడు గురక పెడుతున్న శబ్దం. ప్రమాదాన్ని గ్రహించి గుట్టు చప్పుడు కాకుండా యెండు కొబ్బరి ఆకుల రంధ్రాల్లో నుండి లోపలికి చూశాడు.

కురియన్ తన కళ్లనే తాను నమ్మలేకపోయాడు. సారమ్మ దాదాపు నగ్నంగా చాపమీద అర్ధం పడుకొనివుంది. సారమ్మను ఓ మగాడు వడిసి పట్టి కౌగిలించుకొని గాఢంగా నిద్రపోతున్నాడు. నిద్రలో అతడి గురక ఏదో కోడె రంకెలేస్తున్నట్లు వినిపిస్తోంది.

ఆ మగావాడి ముఖాన్ని కురియన్ స్పష్టంగా చూశాడు. ఆ బట్టతల మనిషి, కొమ్ముల్లాంటి మీసాలు, వెదురుబొంగుల్లాంటి ముక్కు రంధ్రాలూ చూస్తూనే ఆ మనిషి యెవరో కురియన్‌కి తెలిసిపోయింది. అతడు టీకొట్టు చాకోచన్. నగ్నంగా వున్న తన భార్యను కౌగిలించుకొని సుఖనిద్రలో జయభేరిని మోగిస్తున్న చాకోచన్‌ని కొంతసేపు చూస్తుండిపోయాడు.

ఇదంతా చూస్తూనే అతడి శరీరం దహించుకుపోయింది. అతడు ఓ దృఢ నిర్ణయానికి వచ్చి వెనక్కి తిరిగి వెళ్లాడు.

కురియన్ నేరుగా చాత్తుకుట్టి కల్లుదుకాణం చేరాడు. అక్కడ రెండు మూడు ముంతలు కల్లు గటగటా తాగేశాడు. గుండెల్లో వేడి ఆవేశం నింపుకొని గుడిసె ముఖం పట్టాడు. ఇంతలో చాకోచన్ అక్కడి నుండి జారుకున్నాడు. సారమ్మ పొయ్యి రగిలించే ప్రయత్నంలో వుంది.

కురియన్ నేరుగా వంటగదిలోకి దూరాడు. సారమ్మను జుట్టు పట్టుకొని నేలమీద విసిరేశాడు. కురియన్ ఆమెను పైనుండి కిందివరకూ పిడిగుద్దులు గుద్దాడు. అలసిపోయేంతవరకూ తన్ని వళ్లు హూనం చేశాడు.

నోరు విప్పకుండానే కురియన్ పిడికిలి బిగించి పొడుస్తున్నాడు. సారమ్మ ఏమాత్రం చలించకుండా, ఎదురు తిరక్కుండా అతడి దెబ్బలకు ఓ చెట్టులాగా నిలబడి భరిస్తోంది.

తన పెళ్లాన్ని కొట్టి కొట్టి విసిగిపోయాడు. అతడు చేతులు తిప్పకుంటూ ముఖం వంకరగా పెట్టి వరండాలోకి వచ్చాడు. బీడీ రగిలించి యేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. కొంతసేపు వరండాలో అటూ ఇటూ పచార్లు చేశాడు. తరువాత ఓ నిర్ణయానికి వచ్చి గుడిసెనుండి నేరుగా మళ్లీ కల్లు దుకాణం చేరుకున్నాడు.

ఆ కల్లు దుకాణంలో చాలామంది కూర్చుని కల్లు తాగుతున్నారు. హోటల్ యజమాని కొచ్చువర్కీ, లావుగా వున్న కురివిలా ఇద్దరూ ఓ చిన్నబల్ల మీద కూర్చుని కల్లు తాగుతున్నారు. కొచ్చువర్కీ గుడ్లప్పగించి కల్లు నోట్లో పోసుకుంటున్నాడు. కురివిలా కళ్లు మూసుకుని తాగుతున్నాడు. కుంజూబు కల్లు తాగాడు. ఇక అక్కడ నుండి వెళ్లిపోవడం మంచిదనుకున్నాడు. అతడు అప్పటికే కూరగిన్నెను మూడుసార్లు వేలితో తీసి నాకేశాడు. అయినా మళ్లీ వేలితో గిరి నాక్కుంటున్నాడు. కుంజూబు మణియాణీ, పెరితేరిచాత్తు, కుంజాప్పు, మలయన్ కుంజిరామన్ నలుగురూ మరో

బల్లమీద కూర్చొని ముందున్న కల్లు ముంతలమీద వాలే ఈగల్ని తోలుకుంటూ మాట్లాడుకుంటున్నారు.

చాత్తు కల్లులో పడిన ఈగను వేలితో తీసి పారేశాడు.

దుకాణం లోపల దక్షిణపు మూలనుండి ఎవరో ఏడుస్తున్నారు. కుంజప్పు ముఖం తిప్పి అటువైపే చూస్తున్నాడు. ఆ యేడుస్తున్నది కృష్ణన్ చెట్టియార్. అతడు ఎప్పుడూ ఇలాగే ఏడుస్తుంటాడు. కల్లు తాగుతూనే చెట్టియార్‌కి పూర్తిగా కైపెక్కిపోతుంది. ఆ కైపులో తన కుటుంబంలో చనిపోయిన ప్రతి వక్కరినీ తలచుకొని యేడుస్తుంటాడు. ఆ ముసలివాడి ఏడుపును యెవరూ పట్టించుకొనేవారు కాదు.

అప్పుడే కురియన్ దుకాణంలోకి చొరబడ్డాడు. అతడికి తన పెండ్లాం పక్కలో పడుకొన్న చాకోచన్‌తో ప్రతీకారం తీర్చుకొని తీరాలని పట్టుదల పట్టాడు. అందుకే అతడు మళ్లీ కల్లు తాగే వుద్దేశంతో అక్కడికి వచ్చాడు. నెత్తికి చుట్టిన తుండు గుడ్డను తీసి భుజాన వేసుకొని బల్లమీద కూర్చున్నాడు. అతడు కల్లు అందించే కుర్రాడికి సైగచేశాడు. కుర్రాడు ఓ గ్లాసు నిండుకూ కల్లు నింపుకొని కురియన్ ముందు వుంచాడు.

చేతిలోకి కల్లుగ్లాసు తీసుకొని పాటపాడసాగాడు. "మన శరీరాలు వేరైనా మన హృదయాలు ఒకటేగదా కల్లు తల్లీ?" పాడుకుంటూ అతడు వరీత కురియన్ బెంచీమీద కూర్చున్నాడు. ఒంటికన్ను వరీతకు కూడా కల్లుగ్లాసు చేతబట్టుకొని పాటలు పాడుకుంటూ అటూ ఇటూ పచార్లు చేయడం సరదాగా వుంటుంది.

బ్రిటిష్ ప్రధానమంత్రి చర్చిల్ అంత లావుగా వెడల్పాటి నోరున్న ఓ కుక్క కురియన్ పాదలవద్ద పడుకొంది.

కల్లుదుకాణం యజమాని చాత్తుకుట్టి తన ఇనప్పెట్టె ముందు మోకరించి శ్రీ నారాయణగురు అనే సన్యాసి జీవిత చరిత్రను ధ్యానంగా చదువుతున్నాడు.

కురియన్ మరోసారి కల్లు తెమ్మని కేకేశాడు.

కల్లు కడుపులోకి వెడుతూనే కురియన్‌కు కైపు నడి నెత్తిమీదికి ప్రాకింది. గుండెల్లోకి రక్తం వేగంగా ప్రవహించసాగింది. కళ్లు మండుతున్నాయి. నాలుకమీద దురద మొదలైంది. దాంతోపాటు మరో గ్లాసు కల్లు కడుపులోకి దింపేశాడు. తరువాత మూతి తుడుచుకొని వరీతవైపు తీక్షణంగా చూస్తూ లెక్చరు మొదలెట్టాడు. గట్టిగా

మాట్లాడే అతడి మాటలు అక్కడున్నవాళ్లందరికీ స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"నేను నా కళ్లతో నా భార్య సారమ్మతో టీకొట్టు చాకొచ్చన్ పడుకొని వుండడం చూశాను. సారమ్మను కొట్టి కొట్టి పచ్చడి చేశాను. దాని ఎముకలు విరిచి మూలపడేశాను. అది ఇప్పుడు కదిలో స్థితిలోలేదు. ఇప్పుడు నేను ఎక్కడికి వెడుతున్నానో మీకు తెలుసా? నేరుగా చాకోచన్ టీకొట్టు కెళుతున్నాను. వాణ్ణి హత్యచేసిగాని నేను శాంతించను."

అక్కడ వున్న తాగుబోతులంతా కల్లుగ్లాసులు బెంచీలమీద వుంచి కురియన్‌వైపు చూస్తున్నారు. అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. కృష్ణన్ చెట్టియార్ ఏడుపు మాత్రం వినిపిస్తూనే వుంది.

తన పెళ్లాం చెడునడత గురించీ దానికి ప్రతీకారం చేసి తీరాలనే తన నిర్ణయాన్ని ప్రపంచానికంతటికీ చాటి చెప్పాలనుకున్నాడు.

"ఇదంతా నీవు అప్పుడే చేసుండాల్సింది" ఒంటికన్ను వరీత సలహా యిచ్చాడు. ఇప్పుడు నీవు చాకొచ్చన్ టీ కొట్టుకు వెళ్లి వాడిని కొట్టడంలో అర్థంలేదు. నీ పెళ్లాం ఎదుటే వాణ్ణి చితకబాదలేకపోయావా?"

"వాడు నగ్నంగా చాపమీద పందిలా పడి నిద్రపోతున్నాడు. నిద్రపోయేవాణ్ణి కొట్టడం న్యాయం కాదుకదా" అని జవాబు చెప్పాడు. అతడు మరోగ్లాసు కల్లు తెమ్మని ఆజ్ఞాపించాడు.

"సారమ్మ అప్పుడేం చేస్తోంది?" లావుగావున్న కురివిలా అడిగాడు.

"సారమ్మ బిత్తలు అతణ్ణి కౌగిలించుకొనివుంది." అతడు ఈ వివరాలన్నీ సిగ్గువిడిచి చెప్పాడు. వినేవాళ్లకి ఆనందంగా వుంది.

"సారమ్మకు ఇదే వ్యాపారమా లేక...?" హోటల్ యజమాని కోచువర్కీ అడిగాడు.

"ఈ విషయం కురియన్‌గారు ఎలా చెప్పగలరు? సారమ్మే చెప్పాలి." నవ్వుతూ అన్నాడు కురువిలా.

"అంతేగదా మరి" అంటూ మలయన్ కుంజ రామన్ కురివిలా దగ్గరగా వచ్చి కూర్చున్నాడు.

ఒకసారి మనిషి రక్తం రుచి చూసిన పులి మళ్లీ మనిషి రక్తాన్ని తాగడానికి ప్రయత్నిస్తుంది. సరిగ్గా అట్లే ఓసారి పరాయి మగాడిని రుచి మరిగిన స్త్రీ ఏదోవిధంగా

తన కామాన్ని తీర్చుకోడానికి పరాయి మగాడి కోసం ప్రాకులాడుతుంటుంది. విన్నావా పెద్దన్నయ్యా.

"ఆడదాన్ని నమ్మినవాడు పూర్తిగా తెలివితక్కువ వాడే." కుంజుబు మణియాణీ ఇంటికప్పువైపు చూస్తూ అన్నాడు.

"యీ చెట్టన్ టీ దుకాణంవాణ్ణి ఖాళీ చేశేస్తాడా?" చాత్తుకుంజుబు చెవి దగ్గరగా మెల్లగా అడిగాడు.

కుంజుబు కురియన్‌వైపు చూశాడు. కురియన్ కళ్ల మూతలు పడ్డాయి. మెడకాయ వేలాడబడింది. బెంచీమీదకు వాలి పోతున్నాడు. కొంతసేపట్లో కురియన్ స్పృహ కోల్పోయి బెంచీమీద పడిపోయాడు.

అక్కడున్న తాగుబోతులందరికీ కురియన్ వాలకం నిరాశ కలిగించింది. వాళ్లు ఆ స్త్రీలోలుడిమీదికి కురియన్ పగ తీర్చుకోడానికి కత్తి తీసుకొని టీ కొట్టుమీదికి వెళతాడనీ, వాళ్ళిద్దరి మధ్యా రక్తపాతం జరుగుతుందని యెంతో ఆశపడ్డారు. కానీ నాటకానికి తెరపడిపోయింది. కథానాయకుడు కల్లుకైపులో కూరుకుపోయాడు. ఆ ప్రతీకార కోలాహలం కురియన్ నిద్రలో కలిసిపోయింది.

అదే సమయంలో పొడవైన కొమ్ముల్లాగా మీసాలున్న వాడు కల్లు దుకాణంలోకి దూరి అందరివైపు తీక్షణంగా చూస్తున్నాడు.

"అటు చూడు, వాడే, వాడే టీ కొట్టు చాకో." కుంజాపుపేరుతేరి చాత్తు వీపుమీద చరుస్తూ సైగచేశాడు.

అందరూ ఆ వ్యక్తి వైపు చూసి ఇంకొద్దిసేపట్లో అక్కడ ఏదో జరగబోతోందని వూహించారు. ఎవరో కురియన్‌ని నిద్ర లేపడానికి ప్రయత్నించారు. కానీ ప్రయోజనం లేకపోయింది.

చాకో ఓ బెంచీ మీదికెక్కి గట్టిగా చెప్పసాగాడు 'వినండి అయ్యలారా! మన సోదరుడు మార్టిన్ మనతోపాటు తిరువాన్‌కూరు నుండి వచ్చి ఇక్కడే నివసిస్తూ వుండేవాడు. అతణ్ణి ఇక్కడి రౌడీలు చావబాదారు. వాళ్ల మూత్రం తాపించారు. మార్టిన్ కొద్దిసేపట్లో ప్రాణాలొదలొచ్చు."

"వాళ్లు అతణ్ణి స్తంభానికి కట్టేశారు. మీరంతా ఇక్కడ కల్లు తాగి మజా చేసుకుంటున్నారు. అందరూ రండి. ఆ రౌడీలకు సరైన గుణపాఠం చెప్పాలి. ఇప్పుడే బయలుదేరండి. లేకపోతే మార్టిన్‌ని చంపేసి బూడ్చేయగలరు. యిక్కడి గూండాలు

క్రైస్తవుల పవిత్ర శిలువమీద పెంట విసురుతున్నారు. మనం ఇక్కడ యింత సొమ్ముపోసి ఈ అన్యాయాన్ని సహించగలమా? అందరూ పదండి. ప్రతీకారం తీసుకొన్నాకే తిరిగివద్దాం.''

ఈ మాటలు విన్న ఒంటికన్ను వరీత, లావుపాటి కురివిలా మరో నలుగురైదుగురు క్రైస్తవులు తాగుతున్న కల్లుగ్లాసులు పారేసి ఆవేశంతో ముందుకు వచ్చి చాకో ఎదురుగా నిల్చున్నారు.

''పద చాకో! వీళ్లకి బుద్ధి చెబుదాం. తిరువాన్‌కూరు క్రైస్తవుల తడాఖా ఏమిటో వీళ్లకు తెలియదు. ఇప్పుడే వీళ్లకు బుద్ధి చెప్పాలి.'' లావుపాటి కురువిలా గర్జిస్తూ అన్నాడు.

వాళ్లంతా బిలబిలా బయలుదేరారు. వెళ్లేటప్పుడు కురియన్‌ను లేపడానికి ప్రయత్నించారు. కానీ లేవలేదు. చివరకు కురియన్‌ను అక్కడే వదిలేసి తక్కిన క్రైస్తవులందరూ కలిసి ఒక వూరేగింపుగా బయల్దేరారు.

# ముప్పై అయిదు

ఏంతోనీ తన బాబాయి దగ్గరకు వెళ్లి కూలీలకు ఇవ్వాల్సిన జీతం తీసుకొని తన గుడిసెకు వస్తున్నాడు.

చర్చి దగ్గరకు వస్తూనే అతడికి శవాన్ని మోస్తున్న వాళ్ల జయకారాలు వినిపిస్తున్నాయి. అతడు ఆ నాలుగు రోడ్ల కూడలి వద్ద నిలుచున్నాడు.

శవాన్ని ఖాళీపెట్టెలో వుంచి ఇద్దరు మనుషులు భుజాలమీద మోసుక వస్తున్నారు. వాళ్ల వెనక ఏడు ఎనిమిది మంది క్రైస్తవులు నడుస్తున్నారు. శవయాత్ర మౌనంగా సాగుతోంది. వాళ్లల్లో అనికుట్టీవాళ్ల బాబాయి జాకబ్ కూడ వున్నాడు.

ఏంతోనీ కూడ వాళ్లతో కలిసి చర్చివైపు నడవసాగాడు.

''ఎవరు?'' ఏంతోనీ పెట్టెవైపు సైగచేసి టీకొట్టు ఓసేపును మెల్లగా అడిగాడు.

''జాకబ్‌గారితో పాటు ఓ అమ్మాయి వుంటుండేది, అనికుట్టీ, జ్వరం వచ్చింది. జ్వరం'' ఓసేపు మెల్లగా చెప్పాడు.

ఏంతోనీ చకితుడై నిల్చుండిపోయాడు. అది విని అతడి తల తిరిగింది. అంతేకాదు ప్రపంచమంతా తల్లక్రిందులై నట్లనిపించింది. అతడు స్పృహ తప్పి పడిపోయాడు. అతడు ఏ పవిత్ర కన్యను ఆరాధిస్తున్నాడో ఆమె శవమై నల్లపెట్టెలో

వుంది.

అతడు తన మెడలో వేలాడుతున్న శిలువను చేతిలోకి తీసుకొని తలవంచుకొని మౌనంగా వారి వెంట నడవసాగాడు...

సూర్య కిరణాలు చివరిసారిగా ఆ నల్లపెట్టెను సానుభూతితో స్పృశించాయి. అనికుట్టీని మట్టిలో బూడ్చేశారు. 'నీవు మట్టివి. మట్టిలోనే కలిసిపోవాలి.' పురోహితుడు ఆ పెట్టెవైపు వేలు చూపుతూ అన్నాడు.

ఆ తర్వాత ఏంతోనీ ఎప్పుడు చర్చికి వెళ్లినా మొదట అనికుట్టీ సమాధివైపు దృష్టి మళ్లించి దీర్ఘంగా నిట్టూర్చేవాడు. అతడు బాధాతప్త హృదయుడై క్రితం అనికుట్టీ ప్రతి ఆదివారం ఏ స్థలంలో మోకరించి ప్రార్థనలు చేసేదో ఆ స్థలాన్ని చూస్తూ వుండిపోయేవాడు. అతడు ఇప్పటికీ ఆమె సజీవంగానే తెల్లని దుస్తులు ధరించి ప్రార్థన చేస్తూ తనవైపు చూస్తున్నట్లే కలలు కనేవాడు.

అటువైపుగా వెళ్లినప్పుడు దొంగచాటుగా అనికుట్టీ సమాధిమీద సువాసనలు వెదజల్లే పువ్వులు అర్పించి దుఃఖంతో నిండిన హృదయంతో ఇలా తన బాధను వ్యక్తపరచేవాడు. "అనికుట్టీ! నీవు సౌభాగ్యవతివి. నిన్ను దేవుడు ఈ పాపులమధ్య నుండి తీసుకువెళ్ళాడు. కానీ ఏమైనా మమ్మల్ని విడిచిపెట్టి ఇంత తొందరగా వెళ్లిపోతావనుకోలేదు."

ఏంతోనీకి ఓ సందేహం కలిగింది. తాను చేసిన పాపం ఫలితంగానే దేవుడు అనికుట్టీని తీసుకవెళ్లి వుంటాడని.

"నేను పాపిని. పరమ పాపాత్ముణ్ణి. నాకు ప్రాయశ్చిత్తము చేసుకొనే యోగ్యత కూడా లేదు. సైతాను నన్ను మోసగించింది. నాకు భగవంతుని స్మరించుకొనే అధికారం కూడా లేదు." అతడు తనను తాను నిందించుకుంటూ పగిలిన హృదయంతో తనలో తాను రోదించేవాడు.

## ముప్పై ఆరు

**కున్నోలీ కుటుంబపు పెద్ద నంబియార్ బంగళాముందు కచేరీ మొదలైంది. కున్నోలీ కుటుంబపు ఆస్తిపాస్తులు చాలాదూరం వరకూ వ్యాపించివున్నాయి. తిరువాన్‌కూరు నుండి కెరటాల్లాగా లక్షలాది క్రైస్తవులు వలస రాసాగారు. చాలామంది కున్నోలీ కుటుంబపు అడివిని, పొలాల్ను కొని వ్యవసాయం చేయసాగారు.**

వరండాలో ఇంటి యజమాని నంబియార్, గుమాస్తా చాత్తుకురూప్పు మరికొందరు దళారులు కూర్చొనివున్నారు. ముంగిలి గోడకు దగ్గరలో కొందరు క్రైస్తవులు తమ బాధలు విన్నవించుకోడానికి వచ్చారు.

"ఓసేపుకు ఏమైనా చెబుతారా?" చాత్తుకురూప్పు యజమాని నంబియార్‌ని వుద్దేశించి అన్నాడు.

"ఓయ్ ఓసేపు! ఇలారా!" వరండాలో వినమ్రంగా చేతులు కుట్టకొని నిలుచున్న మనిషిని పిలిచాడు చాత్తుకురూప్పు.

ఓసేపు ఆదర సూచకంగా కుడిచేయి పైకెత్తి నమస్కరించి ముందుకు వచ్చాడు. అతడు యజమాని ఎదుట వినయంగా తలవంచి నిలుచున్నాడు.

"కృష్ణా! తాంబూలం" యజమాని పిలిచాడు.

"ఇప్పుడు నీవు మీ వూరు వెళ్లిపోవడానికి నిశ్చయించుకున్నావన్న మాట?" చాత్తుకురూప్పు అన్నాడు.

"ఔను బాబుగారూ." ఓసేపు యజమానివైపు ముఖం మళ్లించి విషయం చెప్పసాగాడు. "నేను చాలా కష్టాల్లో వున్నాను. నా పెళ్లాం చనిపోయింది. నా యిద్దరు పిల్లలూ యిక్కడే చనిపోయారు. చేతిలో వున్న డబ్బంతా ఖర్చయిపోయింది. మూడువందల రూపాయలదాకా అప్పులు చేశాను."

"ఇతడి భూమి ఎక్కడుంది?" యజమాని అడిగాడు.

"ఇక్కడికి చాలా దూరంలో, తకరీ కొండకు దక్షిణపుమూల వుంది." చాత్తు కురూప్పు చెప్పాడు.

"అక్కడ యింకా పొలం ఏదైనా మిగిలివుందా?" చాత్తుకురూప్పు ఓసేపును అడిగాడు.

"బాబుగారూ! మీరు వెళ్లిచూడండి. నేను అసలు భూమినే వుపయోగించలేదు."

"అంతా అడివి పందులు వుపయోగిస్తుంటాయి." కృష్ణకురూప్పు తెచ్చిన తాంబూలం నముల్తూ యజమాని అన్నాడు. "సరే, నీవు ఆ భూమికి ఎంత డబ్బు చెల్లించావు?"

"నలభై ఎకరాల భూమికిగాను రెండు వందల రూపాయలు ఇచ్చాను. కచేరీ ఖర్చులు రెండువందలు, ఏజంటుకు నూట యాభై రూపాయలు, అడివినరికి

సాపు చేసినందుకు కూలి నూట యాభై, మొత్తం సుమారు వెయ్యి రూపాయలు దాకా ఖర్చయింది."

"ఇతర ఖర్చులు వదిలిపెట్టు" యజమాని మధ్యలో కలుగజేసుకొని "కున్నోలీ కుటుంబానికి నీవిచ్చింది నాలుగువందల రూపాయలే కదా?" అని అడిగాడు.

"ఔను బాబుగారు! నాలుగు వందలు"

"మంచిది. ఇక చెప్పు మేము యేమి చేయాలో?"

"నేను మూడువందల రూపాయలు బాకీ పడ్డాను. ఇకముందు ఇక్కడే వుండే ఆలోచనకూడ లేదు. నేను మళ్లీ మా వూరు వెళ్ళిపోతాను."

"మంచిది. అలాగే వెళ్లు."

"బాబుగారూ! నా పొలమూ తోటా మీరు వాపసు తీసుకోండి."

"మాకు పొలమూ తోటా మాకేమీ వద్దు. దాన్ని మీ వాళ్లకి యెవరికైనా యిచ్చేయి."

"ఇప్పుడు దీన్ని కొనేవాళ్లు ఎవరూ దొరకడంలేదు. మీరు తప్ప నన్ను రక్షించేవాళ్లెవ్వరూ లేరు."

"పొలమూ తోట వాపసు తీసుకొని మేము యేమి చేసుకోవాలి?"

"అందులో చాలా భాగం పంటపొలం."

"లేతపైరు. ఆ పొలంమీద ఖర్చు పెట్టడానికి మా దగ్గర డబ్బులేదు."

"మీరే నన్ను రక్షించాలి."

యజమాని చాత్తుకురుప్పు యిద్దరూ ఏదో రహస్యంగా మాట్లాడుకున్నారు. తరువాత చాత్తుకూరుప్పు ఓసేపునుద్దేశించి ఇలా అన్నాడు. "చూడూ, నీకు రెండువందలే తిరిగి యివ్వబడుతుంది. నీ భూమికి సంబంధించిన రిజిస్ట్రేషన్లు వగైరా కాగితాలన్నీ యిచ్చేయి."

ఓసేపు చకితుడయ్యాడు. కేవలం రెండువందలే? నేను చేసిన బాకీలే మూడొందల రూపాయలు.

"మూడు వందల రూపాయలు బాకీ చెల్లించందే ముసల్మాన్ వీరాన్ కుంజి నన్ను యిక్కడి నుండి అడుక్కూడా కదలనివ్వడు. బాబుగారూ! నేను మా వూరు వెళ్లాలంటే కనీసం వందరూపాయలైనా కావాలి. ఈ పేదవాడి మీద దయతలచి

అయిదువందల రూపాయలైనా యిప్పించండి."

"ఏంచూసి నీకు అయిదువందల రూపాయలియ్యాలి?" యజమాని కోపంగా అడిగాడు.

"చట్టం ప్రకారమైతే నీకు ఒక్కరూపాయి కూడా దక్కదు. పైగా మేం వ్యవసాయం చేయడంలేదు. కొత్తగా భూమి కొనేవాళ్లెవరైనా వచ్చినా, వాళ్లుకూడా కొత్త భూమినే కోరుకుంటారు. నీవు, పందులూ కలిసి తవ్విన భూమికి విలువేలేదు. నీకు దయతలచి రెండొందల రూపాయల్ని యిస్తున్నాం, ఆ పొలం ఆపాటి ఖరీదు కూడా చేయదు."

"బాబుగారూ! మీరు ఎవర్నైనా పంపించి చూచి రమ్మనండి. రెండువేల రూపాయల పంట పొలంలో వుంది. ఇప్పుడు ఆ పొలం కాపలా కాసే మనుషులూ లేరు చేతిలో చిల్లిగవ్వ డబ్బులేదు."

"వెళ్లి వాకబు చేసుకో ఎవరైనా కొనేవాళ్లున్నారేమో?"

"మా క్రైస్తవులు వాళ్ల పొలాల్నే సరిగ్గా చూసుకోలేకపోతున్నారు. నేను యిలాగే యింకొంతకాలం జారవిడుచుకుంటే వున్న పైరు కూడా నాశనమైపోతుంది. అంతేకాదు. ఈ పేదవాడు మలేరియా జ్వరంతో యిక్కడే చావడం ఖాయం." యింత ప్రాధేయపడినా మళ్లీ యజమాని చాత్తుకురూప్పు రహస్యంగా మంతనాలాడుకున్నారు. చివరికి చాత్తుకురూపు అన్నాడు "ఓసేపు ఫిర్యాదు గురించి యింకో రోజు ఆలోచిద్దాం."

"రేపు సాయంకాలం నీ పొలానికెళ్లి అంతా చూసి వస్తాను. నీవు సోమవారం వుదయం ఇక్కడికిరా. అప్పుడు చెబుతాం. ఇక నీవు వెళ్లొచ్చు."

ఓసేపు యజమానికి, గుమస్తాకు కృతజ్ఞతతో నమస్కరించి తలవంచుకొని వెళ్లిపోయాడు.

"ఓసేపు తలుపు దగ్గరకు వెళ్లాడో లేదో అతడి ఎదుట నలుగురైదుగురు స్థానీయులు కలిసి ఓ లావుపాటి క్రైస్తవుణ్ణి రెక్కలు విరిచి కట్టేసి ఈడ్చుకుంటూ అక్కడికి తీసుకొస్తున్నారు. విషయమేమిటో తెలుసుకోవడానికి అతడు కొద్దిసేపు అక్కడే ఆగాడు.

వాళ్లు అర్ధనగ్నంగా వున్న ఆ క్రైస్తవుణ్ణి ఈడ్చుకొని వచ్చి యజమాని ఎదుట నిలిపి వినయంగా చేతులు కట్టుకొని నిల్చున్నారు. యజమాని మందహాసం చేస్తూ

అరచేయి వూపుతూ 'ఏంటి విషయం? అని అడిగాడు.

"బాబుగారూ! వీడు ఓ పెద్ద దొంగ!" వాళ్లల్లో తలపాగా చుట్టిన ఓ ముసలివాడు అన్నాడు. "ఈ సైతాను కారణంగా మాకు శాంతి లేకుండాపోయింది. అరటి గెలలు దొంగిలించడం, కొబ్బరికాయలు కోయడం, ఇళ్లల్లో ఎవరూ లేకపోతే వంటింట్లోకి జొరబడి అన్నం తినేసి పారిపోవడం, పోతూ పోతూ దొరికిన వస్తువును చేతబట్టుకొని వెళ్లడం ఈ పంది చెట్టన్‌గాడి వృత్తి. ఈ సైతాను వల్ల యిక్కడి ప్రజలు చాలా యిబ్బందులపాలౌతున్నారు. ఓరోజు చాకల్ది రేవులో ఆరేసిన బట్టల్ని ఎవరో తీసుకెళ్లారు. బహుశా ఆ పని ఇతడే చేసుంటాడు. నిన్న రాత్రి దొంగిలిస్తున్న సమయంలో వీడు మా చేతికి దొరికిపోయాడు. వీడు వడ్రంగి ఆండీ యింట్లోకి ఆవును దొంగిలించడానికి వెళ్లాడు. వడ్రంగి భార్య యితణ్ణి చూస్తూనే గట్టిగా కేకలేసింది. వీడు ఇంటి వెనకనుండి పరుగు లంకించుకున్నాడు. పొరబాటున పేడగొయ్యిలో పడిపోయాడు. యితడు పేడ గొయ్యిలో ఈదులాడుతుంటే మేము ఇతణ్ణి పట్టుకున్నాం. అక్కణ్ణుంచి మీ దగ్గరకు లాక్కొచ్చాము. ఇక మీరు ఎలా చెబితే అలా..."

యజమాని ఆ ఖైదీని సానుభూతితో చూశాడు. అతడు పేడగొయ్యిలో పడుకొన్న దున్నపోతులా వున్నాడు. మెడలో ఓ లాకెట్టు వుంది.

"యితడి నివాసమెక్కడ?" యజమాని అడిగాడు.

"కలియన్ కొండమీద వ్యవసాయంచేసే చెట్టన్. వీణ్ణి వీళ్ళ వాళ్లు మార్టిన్ చెట్టన్ అనే పేరుతో పిలుస్తారు."

"ఏమోయ్! వీళ్లు నీ గురించి చెప్పేదంతా నిజమేనా?" యజమాని మార్టిన్‌ని అడిగాడు.

మార్టిన్ జవాబివ్వలేదు. అతడికి వాళ్ల మాటలతో తనకేమీ సంబంధం లేనట్టు ఎక్కడో దూరంగా తాడిచెట్టుమీద కూర్చున్న గద్దవైపు జాగ్రత్తగా చూస్తున్నాడు.

"రేయ్ చెట్టన్! నీవు అక్కడికి ఆవును దొంగిలించడానికి వెళ్లావా?" యజమాని గట్టిగా రెండవసారి అడిగాడు.

ఏమీ మాట్లాడకుండా నిలుచున్నాడు.

"ఒరేయ్ చెట్టన్! అయ్యగారి మాటలు నీకు వినిపించలేదా?" చాత్తుకురూప్పు కోపంగా అడిగాడు.

అప్పటికీ మార్టిన్ మాట్లాడలేదు.

"వీడు చెవిటివాడా?" యజమాని కోపంగా అడిగాడు.

"లేదు బాబుగారూ!" అని ముసలివాడు చెప్పాడు. "నిన్న దెబ్బ పడేటప్పటికి ఏనుగులాగా గీ పెట్టాడు. వీణ్ణి పోలీసుస్టేషన్‌కు తీసుకెళితే వాళ్ళు వీడి జబ్బును సరిగ్గా నయంచేస్తారు."

"అలాంటి అవసరం లేదు." యజమాని ఇలా ఆజ్ఞాపించాడు. "వీడిని వెంటనే శిక్షించి వదిలెయ్యండి. వీణ్ణి తీసుకెళ్ళి ఈరోజు కూడ వడ్రంగి కళ్ళం ఎదుట కట్టిపడెయ్యండి. రేపు పుదయాన్నే కట్లు విప్పండి. అప్పటికీ వీడు దొంగతనం మానకపోతే పోలీసులకు అప్పజెప్పండి. వీణ్ణి తీసుకెళ్ళండి."

ఆ అపరాధిని వాళ్ళు ఈడ్చుకు వెళ్ళారు. ఓసేపు అక్కడినుండి వెంటనే బయలుదేరి చాకో టీకొట్టు దగ్గర కూర్చున్నాడు.

# ముప్పై యేడు

కున్నేలీ కుటుంబ పెద్ద ఆజ్ఞానుసారం మార్టిన్‌ని లాక్కెళ్ళి వడ్రంగి కళ్ళంలో కట్టేశారు.

ఆ వార్తను తీసుకొని ఓసేపు టీకొట్టు చాకోదగ్గరకు చేరుకున్నాడు. మార్టిన్‌ను వడ్రంగి వాడి కళ్ళంలో కట్టేశారని, మూత్రం తాపించి మలం తినిపించారని, రోకటితో కొట్టి అతడి ఎముకల్ని పిండి చేశారని ఓసేపు గోరంతను కొండంత చేసి చెప్పాడు. చాకో ఆ వార్తవిని కోపంతో వణికిపోయాడు.

చాకో ఓసేపు కలిసి నలువైపులా కొండల్లో కాపురముంటున్న క్రైస్తవుల ఇళ్ళకు వెళ్ళి ఈ వార్తను ప్రచారం చేశారు. మార్టిన్‌కు భయంకరమైన శిక్ష వేస్తున్నారని, చంపేస్తామని బెదిరిస్తున్నారని చెప్పారు. ఈ వార్త క్రైస్తవ సమాజంలో దావానలంలా వ్యాపించింది. ఆ సమయంలోనే చాకో కల్లుదుకాణం చేరుకున్నాడు.

కల్లుదుకాణం నుండి వూరేగింపు మొదలయింది. ఆ వూరేగింపు మరో కొండలోయలో వున్న మైదానం చేరుకుంది. ముష్టి యుద్ధంచేసే ఓసేపు, తోడపుషతొమ్మన్, వర్గీస్, ఏనుగుమాత్తు, పిల్లికళ్ళ ముత్తయి వూరేగింపులో కలిశారు. ఓసేపు కూడా కొంతమందిని వెంటబెట్టుకొని వచ్చాడు. కురియన్ యిట్టూపు, జాకబ్, పౌలస్ వాళ్ళతో కలిశారు.

ఇలా అందరూ పగతీర్చుకోవాలనే ఆవేశంతో వడ్రంగి అందీ ఇంటిని

సర్వనాశనం చేయాలని బయల్దేరారు.

సాయంకాలమయింది. చీకట్లు కమ్ముకుంటున్నాయి. కర్రలు, బల్లేలు, కత్తులు, ఈటెలు చేతబూని దివిటీలు వెలిగించుకొని విజయభేరి మోగిస్తూ కోలాహలంగా కొండమీదికి ఎక్కుతున్నారు. యిట్టాపు చేతిలో ఓ ఇనుప కడ్డీ వుంది. ఒంటికన్ను వరీత దగ్గర కొడవలి వుంది. జాకబ్ చేతిలో గునపం వుంది.

దారిలో వాళ్లకు కుంజికంటన్ కల్లుదుకాణం కనిపించింది. వాళ్లు ఆ దుకాణాన్ని లూటీచేశారు. కల్లుదుకాణం యజమానిని, నౌకర్లనూ తన్ని తరిమేశారు. అక్కడ వున్న కల్లు, మసాలా కూర మొత్తం తిని తాగేశారు. ఇనుప పెట్టె విరగ్గొట్టి డబ్బంతా దోచేశారు. అక్కడ వున్న గిన్నెలు, కప్పులు, ప్లేట్లు అన్నిట్నీ పూర్తిగా విరగ్గొట్టేశారు. ఆ తర్వాత గుంపు అక్కడి నుండి ముందుకు కదిలింది.

ఏనుగు మాత్తు పీకలవరకూ కల్లు తాగాడు. నాలుగైదుసార్లు కిందపడ్డాడు. ఆ తర్వాత అతడికి ప్రాకడం కూడ కష్టమయిపోయింది. చెరియన్, లావుపాటి కురువిలా కలసి వాణ్ణి తీసుకెళ్లసాగారు.

దారిలో కనపడ్డ అరటి మొక్కల్ని, పూలమొక్కల్ని నరుక్కుంటూ పొదలకు నిప్పు అంటిస్తూ ముందుకు సాగిపోతున్నారు. అక్కడి స్థానీయులకు ఆ శతృసేనలను ఎదుర్కొనే సాహసం లేదు. నినాదాలు చేసుకుంటూ వాళ్లు ముందుకు నడుస్తున్నారు.

"చావాలనుకున్న వాళ్లెవరో మా ముందుకు రండి. ధైర్యముంటే రండి. ఎవడైనా సరే మాలో ఎవరిమీదైనా చేయేసి చూడండి. వాళ్ల పేగులు నరికి కుక్కలకు వేస్తాం." వాళ్లు గట్టిగా కేకలు వేస్తున్నారు. అంతేగాక స్థానీయులను నోటికి వచ్చినట్లు బందబూతులు తిడుతున్నారు.

కొబ్బరి చెట్టుపై నుండి బావురు బిల్లిమాత్తు ఆ గుంపును చూశాడు. రోజూ మాదిరిగానే బావురు బిల్లిమాత్తు కల్లు దొంగిలించడానికి కొబ్బరి చెట్టుమీదికి ఎక్కాడు. కల్లు కడవ చేత్తో పట్టుకొని చెట్టు దిగి అతడూ వూరేగింపులో కలిసిపోయాడు.

కల్లువాసన పసిగట్టిన ఏనుగుమాత్తు అరవసాగాడు. 'ఒరేయ్! నాకు కల్లు తీసుకరా!' అతడు గర్జిస్తున్నాడు.

తన కల్లును కాపాడుకోవడం ఇక కష్టమని తెలిసి బావురుబిల్లి మాత్తు వెనక వుండిపోయాడు. ఏనుగుమాత్తు ఏనుగుపాల కోసం వెంపర్లాడే పిల్ల ఏనుగులా కాళ్లూ చేతులూ కదుపుతూ, తల బాదుకుంటూ, తల నేలమీద బెట్టి దొర్లాడుతూ

తన పరాక్రమాన్ని చూపిస్తున్నాడు.

'ఒరేయ్ బావురుబిల్లీ, కొద్దిగా నన్నూ తాగనివ్వరా. దాహంతో నాలుక యెండిపోయింది. ఒరే గాడిదకొడకా. వడ్రంగి ఆండీగాణ్ణి వురి తీయడానికి నన్నుకూడా తీసుకెళ్లండిరా.'

దారిలో పడిపోయిన ఏనుగుమాత్తును గురించి యెవరూ పట్టించుకోలేదు. పెదవిమీద వాత పడ్డ కురియన్ అతడి దగ్గరకు వెళ్లాడు. అతడు తలవంచి నిలుచొని గొంతు పట్టుకొని త్రేన్పుతూ వాంతి చేసుకున్నాడు. బావురుబిల్లి మాత్తు ఓ బండరాయి వెనకాల దాగి కల్లు పూర్తిగా తాగేసి కడవను దూరంగా పారేశాడు. ఆ తర్వాత పెదవులూ మీసాలూ తుడుచుకొని పరుగెత్తుకుంటూ మళ్లీ గుంపులో చేరాడు.

ఆ రౌడీలు వడ్రంగి ఆండీ ఇంటికి ఎదురుగా వున్న పొలంలోకి చేరుకున్నారు.

వడ్రంగి ఆండీ, వాళ్ల కుటుంబీకులు కిరస్తానీ గూండాలు తమ యింటిమీదికి రావడం చూశారు. వాళ్లంతా భయపడిపోయి వెంటనే యిల్లు వదిలేసి వెనక వైపునుండి అడవుల్లోకి పారిపోయారు.

ఆ రౌడీలు వడ్రంగి తోటలో దూరారు. వడ్రంగి వాడి కుక్క మొరుగుతూ వాళ్లకు ఎదురుగా వచ్చింది. ఓసేపు దాన్ని నరికి రెండు ముక్కలుగా చేశాడు.

వాళ్లు మొదట మార్టిన్ కట్లు విప్పేశారు. వల తెంపుకొని బయట పడ్డ నక్కలాగా మార్టిన్ పరుగు తీశాడు.

ఆ తర్వాత వాళ్లు తోటలో కనిపించిన మొక్కల్ని, చెట్లను, అరటి మొక్కల్ని నరికి నేలమీద కుప్పబోశారు. తర్వాత వడ్రంగి వాడి ఇంట్లోకి చొరబడ్డారు. ఇంటిలో దొరికిన వస్తువునల్లా లూటీ చేశారు.

మిగిలిన సామాన్లు ముక్కలు ముక్కలుగా విరగ్గొట్టారు. జాకబ్, లావుపాటి ఓసేపు గోశాలలోకి వెళ్లి అక్కడున్న ఆవుదూడను నరికేశారు. జాకబ్ దాని గుండెకాయ, మాంసం కోసి సంచిలో వేసుకొని భుజానికి వేలాడేసుకున్నాడు. ఇల్లంతా సర్వనాశనం చేసి ఇక పాడు చేయడానికి ఏమీ దొరకలేదు. అప్పుడు ఒంటికన్ను వరీత వడ్రంగివాడి యింటికి నిప్పు అంటించాడు.

ఆ తర్వాత గొడవచేసుకుంటూ వెనుతిరిగారు. ప్రతి వక్కడి చేతిలోనూ లూటీ చేసిన ఏదో ఒక వస్తువు వుంది. కొచ్చువర్కీ నెత్తిమీద రెండు రాగిపాత్రలు, చేతిలో పుస్తకాల కట్టవుంది. జాకబ్ భుజానికి మాంసపు సంచి వేలాడుతోంది,

చేతిలో వడ్రంగి సామాన్ల పెట్టె, కొబ్బరికాయల బుట్టా వుంది. కొడవలి బొడ్లో దోపుకొని రెండు గిన్నెలు తీసుకొని ఒకదానికి ఒకటి కొడుతూ పాటపాడుకుంటూ ఒంటికన్ను వరీత వెడుతున్నాడు. అతడి వెనుక కురువిలా ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు. ఒకచేతిలో వడ్రంగివాడి చెర్నాకోల, మరోచేతిలో లాంతరు వుంది. కురువిలా తన చంకలో ఓ కోడిపెట్టను నొక్కిపట్టాడు.

వడ్రంగివాడి డబ్బు సంచిని చెరియన్ కొట్టేశాడు. యిట్టూపు వడ్రంగి వాడి పెళ్లాం బట్టలపెట్టెను నెత్తిమీద పెట్టుకున్నాడు.

వాళ్లలో ఖాళీ చేతులతో వచ్చేది ఒక్కడే. బావురుచిల్లి మాత్తు. అతడు అప్పుడప్పుడు చేయి విదిలిస్తూ బాధతో కేకలేస్తున్నాడు. అతడికి జరిగిన సంగతి యిదీ - వడ్రంగి వాడి గదిలో పెట్టిన చెక్కపెట్టె లోపల యితడు చేయిదూర్చాడు. అది ఎలుకలు పట్టడానికి వేసిన బోను. చేయి దూరుస్తూనే బోను మూత వడిగా వచ్చి చేతిమీద పడింది. అతడి వేళ్లన్నీ నలిగిపోయాయి. దాంతో బాధతో మూలుగుతున్నాడు. తక్కిన వాళ్ళంతా లూటీలో చేతికందిన సామాను తెచ్చుకుంటుంటే యితడేమో తెగిపోయిన వేళ్లతో ఏడుస్తూ తిరిగి రావలసివచ్చింది.

"యేమయ్యా! యీ ఇలాకాలో పోలీసులుంటారా?" వర్కీ సంశయంగా అడిగాడు.

"నేనెప్పుడూ చూళ్లేదు. వుంటే మాత్రం యేమిటి? నేనేమీ భయపడను." ఓసేపు ధైర్యంగా చెప్పాడు.

వర్గీస్ యిది విని అక్కడే నిలుచుండిపోయాడు. "కానీ ఒక్క విషయం, ఒకవేళ పోలీసులకు సాక్ష్యాధారాలు దొరికాయనుకో కథంతా అడ్డం తిరుగుతుంది."

"యే పోలీసులు పట్టుకుంటారయ్యా?" ఓసేపు తల ఆడిస్తూ అడిగాడు.

"అదే నేనూ చూస్తాను. పోలీసులు కాదు కదా వాళ్ల జేజమ్మలు కూడా నన్ను పట్టుకోలేరు. నన్ను పట్టుకొంటే ఒక్కొక్కడి యెముకలు విరగ్గొట్టి కుక్కల కేస్తాను " ఓసేపు అన్నాడు.

"బాబూ గొడవ చేయకు " కొచ్చువర్కీ భయంగా అన్నాడు. "మనం యీ సామాన్నంతా యీ కాలువలో పారేద్దాం."

"నువ్వు పారేయాలనుకుంటే పారేయి. నేను మాత్రం నాకు దొరికిన సామాన్లు యింటికి పట్టుకెళ్తాను యిట్టూపు ధైర్యం కూడ గట్టుకొని చెప్పాడు.

కాని యిప్పుడు చాలామందికి భయం పట్టుకొంది. వాళ్ల మనసుల్లో వాళ్లు చేయరాని పెద్ద అపరాధం చేశామనే భావం కలుగుతోంది.

"మనమంతా యీ సామాన్లన్నిటినీ యిక్కడే పారేసి వెళ్లడం మంచిది." వర్గీస్ తన అభిప్రాయం చెప్పాడు. "పోలీసులు యిండ్లలో చొరబడి సోదా చెయ్యవచ్చు. అప్పుడు విషయం అంతా తెలిసిపోతుంది."

చివరకు వాళ్లల్లో చాలామందికి వర్గీస్ చెప్పిన సలహా మంచిదనిపించింది.

చెరియన్ వడ్రంగివాడి డబ్బుసంచి విప్పి చూశాడు. అందులో పదిహేడున్నర రూపాయల డబ్బు, వెండిహారం, ఒక బంగారు నాణెం వుంది. అవి తీసి బొడ్లో దోపుకున్నాడు. ఆ సంచిని తీసి కాలువలో విసిరేశాడు. కురువిలా తన చేతిలోని లాంతరూ, చెర్నాకోల అడివిలో పారేశాడు. కోడిమెడ విరిచి చేతిలోకి తీసుకున్నాడు. వడ్రంగివాడి పనిముట్ల పెట్టెను బురదలో వేసి కాలితో తొక్కేశాడు. కానీ జాకబు ఆవు మాంసాన్ని, కొబ్బరికాయల బుట్టను విసిరివేయలేదు.

ఇలా ఆహారపదార్థాలు తప్పించి మరేమీ వెంట తెచ్చుకోకుండా వాళ్ల గుడిసెలకు బయలుదేరారు.

# ముప్ఫై యెనిమిది

ఉదయం పది గంటలయింది. మార్టిన్‌కు మెలకువ వచ్చింది. కానీ చాపమీదే పడుకొని కంబళి కప్పుకొని తీపికలలు కంటున్నాడు. మేరీకుట్టీ గాబరాగా పరుగెత్తుకొని వచ్చి "అమ్మో! అమ్మో! ఎర్రటోపీ లేసుకొని కొంతమంది ఇటువైపే వస్తున్నారు. వాళ్లు పోలీసులనుకుంటాను."

ఈవార్త చెవిని బడుతూనే చొక్కాకు నిప్పు అంటుకున్నట్లు మార్టిన్ ప్రక్కమీదినుంచి ఎగిరి గంతేసి అటూ యిటూ చూసి ఇల్లుదాటి పడమటివైపు పరుగుతీశాడు. అతడు ఎక్కడికి పరుగెడుతున్నాడో ఆలోచించడానిక్కూడా అతడికి సమయంలేదు. ఏదో అడివిపంది శత్రువును చూసి పరుగెత్తినట్లు కాలువలు, గట్లూ దాటుకుంటూ పోతున్నాడు. అతడు ఓ కొండమీదికి చేరుకున్నాడు. అక్కడినుండి అడివిలోకి ప్రవేశించాడు. అతడి కోరికల్లా యెట్టి పరిస్థితుల్లోనూ తాను పోలీసుల కంటబడకూడదని. అందుకోసం తాను పులిగుహలోకి ప్రవేశించడానికి కూడా సిద్ధమే.

ఆరోజు పుదయం ఓ సబ్‌ఇన్‌స్పెక్టరూ నలుగురు కానిస్టేబిళ్లూ ఆ పల్లెకు

వచ్చారు. వడ్రంగి ఆండీ యింటికి యెవురు నిప్పు ముట్టించారో వాళ్లను పట్టుకోడానికి పోలీసులు వచ్చారు. వడ్రంగి ఆండీ యింటిలో యింకా కొన్ని సామాన్లు రగులుకుంటూనే వున్నాయి. తల నరికిన కుక్క శవాన్ని కాకులు పొడుచుకు తింటున్నాయి. పశువులపాకలో అవుదూడ రక్తం పడివుంది. పెరటితోటలో మొక్కలన్నీ నేలమీద తెగిపడివున్నాయి. యిదంతాచూసి ఆండీ కుటుంబీకులు పెల్లుబికిన దుఃఖంతో రోదిస్తున్నారు.

ఇన్‌స్పెక్టరు మొదట వడ్రంగి ఆండీని మరో యిద్దరు యిరుగు పొరుగువాళ్ల దగ్గర రిపోర్టు తీసుకున్నాడు. ఆ తర్వాత పోలీసులు క్రైస్తవుల కాలనీలోకి ప్రవేశించారు.

పోలీసులు కురియన్ యింటికి వెళ్లారు. అక్కడ కురియన్, సారమ్మా ఒకే కంచంలో భోంచేస్తున్నారు. కురియన్ నోటమాట రాలేదు. కనీసం నిన్న జరిగిన దోపిడీ గురించి తనకేమీ తెలియదని కూడా చెప్పలేకపోయాడు.

"యీ మనిషి నిన్న రాత్రి కల్లు దుకాణంలోనే నిద్రపోయాడు. కల్లుదుకాణం కుర్రాడు కేలన్ యీ మనిషిని వుదయం యింటికి తీసుకవచ్చాడు." అని సారమ్మ తన భర్తను రక్షించుకోవడానికి ప్రయత్నించింది. కురియన్ ఔను అన్నట్లు తలవూపాడు.

పోలీసువాళ్లు నాలుగైదు గుడిసెల్లో చొరబడ్డారు. వాళ్లకి ఆధారాలేమీ దొరకలేదు. ఆ తర్వాత వాళ్లు మార్టిన్ యింటికి వెళ్లారు. వాళ్లు చేరకముందే మార్టిన్ యింటి వెనకనుండి అడివిలోకి పారిపోయాడు.

"యీ యింట్లో చెట్టన్ ఎక్కడ? వాణ్ణి ఇలా పిలవండి." హెడ్ కానిస్టేబుల్ కోరన్ ముంగిలిలో నిల్చొని మరియమ్మను ఆజ్ఞాపించాడు.

"యిక్కడ లేడు. రెండు రోజుల్నుండీ యింటికి రాలేదు." మరియమ్మ జాన్‌ను ఎత్తుకొని ముంగిట్లోకి వచ్చింది.

"ఎక్కడికి వెళ్లాడు?"

"తెలియదు."

"ఈ చెట్టన్ పేరేమిటి?" మరియమ్మకు తన భర్త పేరు చెప్పడానికి సిగ్గేసింది.

"చెప్పు . పేరేమిటి?"

"మార్టిన్ యజమాని" మరియమ్మ కొద్ది అభిమానంతోను, సిగ్గుతోను

చెప్పింది.

"అతడు ఎవరు? నీ భర్తా?" మరియమ్మ నవ్వుతూ, సిగ్గుపడుతూ నిల్చుంది.

"ఎందుకానవ్వు? అడిగిందానికి సమాధానం చెప్పు. ఈ మార్టిన్ నీ భర్తేనా?" ఔనన్నట్లు మరియమ్మ తల ఆడించింది.

"తప్పుకో, ఈ యింటిని మేము సోదా చేయాలి." అనిచెప్పి హెడ్‌కానిస్టేబుల్ తక్కిన పోలీసులు లోపలికి ప్రవేశించారు. మరియమ్మ గుండెలు బాదుకుంటూ ఏడవసాగింది.

"అరవకు!" పోలీసు మరియమ్మను గద్దించాడు.

పోలీసులకు అక్కడ దొంగిలించిన వస్తువులేవీ కనిపించలేదు.

ఆరోజు మధ్యాహ్నం వరకూ వాళ్ళు యిల్లిల్లూ శోధించారు. చివరకు యిట్టూపు గుడిసెలోపల వాళ్లకు వడ్రంగి వాడి పెళ్లాం బట్టల పెట్టె కనిపించింది. యిట్టూపు ఆ పెట్టెను కుంపటి దగ్గర్లో దాచి వుంచాడు.

పోలీసులు యిట్టూపును రెండు గుద్దులు గుద్దేప్పటికి విషయమంతా వివరంగా చెప్పేశాడు.

ఆరోజు సాయంకాలానికి పోలీసువాళ్లు టీకొట్టు చాకోను, తోడుపుషతొమ్మన్‌ను, పిల్లికళ్ల మత్తయినూ అరెస్టు చేశారు.

కొచ్చువర్కీ పోలీసులకు దొరకలేదు. అతడు కొండలు దాటి కూర్గు వెళ్లి తప్పించుకున్నాడు.

ఒంటికన్ను వరీత వయనాబ్‌లో తన బావమరిది యిల్లు చేరుకున్నాడు. పెదవిమీద వాతలున్న కురియన్ ఆ తర్వాత ఎక్కడా ఎవరికీ కనిపించలేదు. బాక్సర్ ఓసేపును పోలీసులు పట్టుకోలేకపోయారు.

# ముప్పై తొమ్మిది

మార్టిన్ అడివి లోపలికి చొచ్చుకుపోయాడు. పరుగెత్తి పరుగెత్తి బాగా అలసిపోయాడు. ఒక్కో చెట్టు నీడన పొడవైన లావుపాటి వేళ్లమీద కూర్చుని సేద తీర్చుకొనేవాడు.

నాలుగువైపులా దట్టమైన అడవి. భయంకరమైన వాతావరణం. అక్కడ మనుషులెవ్వరూ లేరు. అక్కడక్కడా పెద్ద పెద్ద చెట్లున్నాయి. అవి లావుపాటి తీగలతో కప్పబడివున్నాయి. మధ్యమధ్యలో పెద్ద పెద్ద బండరాళ్లున్నాయి.

నేలమీదంతా ఎండుటాకులు రాలివున్నాయి.

పోలీసులు ఎంత ప్రయత్నించినా ఆ ప్రదేశానికి చేరుకోలేరు. మార్టిన్‌కి అక్కడ పోలీసుల భయం తొలగిపోయింది.

అతడు కూర్చొని వగిరిస్తున్నాడు. శరీరమంతా చెమటతో తడిసిపోయింది. విపరీతమైన వేడిగా వుంది.

అతడు కట్టు పంచె విప్పి చెట్టువేరు మీద పరిచాడు. పడుకొని ఆకాశంవైపు చూస్తున్నాడు.

అతడికి యేమిచేయాలో తోచడంలేదు. తన కళ్ల ఎదుట యేదో పొగమంచువలే తెర ఏర్పడ్డట్టుంది. ఆ పొగమంచు నుండి కొన్ని యెర్రటోపీల ఫొటోలు కనిపిస్తున్నాయి.

వడ్రంగి ఆండీ యింటిలో నిన్న రాత్రి జరిగిన దోపిడీ గురించి మార్టిన్‌కు బొత్తిగా తెలియదు. కట్లు విప్పుతూనే అతడు నేరుగా యింటికి పరుగుతీశాడు. రాత్రి భోంచేసి హాయిగా నిద్రపోతున్నాడు. ఆ తర్వాత మేరీకుట్టీ 'అమ్మా! పోలీసు!' అన్న మాటలే అతణ్ణి యింత దూరం పరుగెత్తించడానికి కారణాలయ్యాయి.

ఎలాగైతేనేం చివరకు తన పాత అలవాటు ప్రకారం శరీరానికి పూర్తిగా విశ్రాంతినిచ్చి సమాధిలో తల్లీనమైపోయాడు. యింతలో తను పడుకున్న వేరు కదులుతున్నట్లు అనిపించింది. కానీ అతడు అదేమీ పట్టించుకోలేదు. మళ్లీ ఆ వేరు కదలడం మొదలైంది.

మార్టిన్ ఆశ్చర్యపోయి నలువైపులా చూశాడు. ఏ ప్రాణీ కనిపించలేదు. ఆ తర్వాత తల పైకెత్తి చూశాడు.

"ఓరి దేవుడా!" అని కేకేసి మార్టిన్ ముందుకు దుమికాడు. రెండు చేతులూ నొసలుమీద పెట్టుకొని తల వంచుకొని పడుతూ లేస్తూ పరుగుతీశాడు.

మార్టిన్ వేరు అనుకొని పడుకొన్నదానికి వెనకవైపు చెట్టుదగ్గర ఓ కొండచిలువ గుహలాగా నోరు తెరిచి అతడివైపు వచ్చేస్తోంది.

మార్టిన్ తాను చెట్టువేరు మీద కాకుండా ఓ కొండచిలువ వీపుమీద పడుకున్నాడని తెలుసుకొని అతడి శరీరమంతా భయంతో నీరైపోయింది. దాంతో వేగంగా పరుగుతీశాడు.

అతడి పరుగు ఎంత వేగంగా వుందంటే ఇక అతడు భూమి అంచులు

తాకేవరకూ ఆగేటట్లు లేదు.

పరుగెత్తి పరుగెత్తి అతడు బాగా అలసిపోయాడు. కానీ ఆ భయంకర దృశ్యం అతణ్ణి యింకా ముందుకు పరుగెత్తిస్తోంది. దాదాపు అతడు ఎక్కడా ఆగకుండా మూడు మైళ్లదాకా పరుగెత్తాడు.

చివరికి ఓ గడ్డిమైదానం చేరుకున్నాడు.

కాని సమీపానవున్న అడివిలో ఏనుగులు చెట్లను విరుస్తున్న చప్పుడు విని మార్టిన్ మళ్లీ పరుగు లంకించుకున్నాడు. అతడు ఆ కొండకు రెండోవైపు నున్న బండరాళ్ల వెనుక పడిపోయాడు.

ఇప్పుడు తన గుడిసెకు ఎలా చేరుకోవాలి అని ఆలోచనలో పడ్డాడు. కానీ అతడికి ఏదిక్కుగా వెళ్లాలో తెలీదు. నాలుగువైపులా కొండలు. ఆ కొండలపైన లేత నీలిరంగు పొగవ్యాపించి వుంది. అంచేత దారి కనుక్కోవడం కష్టంగా వుంది.

దప్పికతో మార్టిన్ నాలుక యెండిపోయింది. ఎండ మండిపోతోంది. అతడు మెల్లగా లేచి నీళ్లకోసం వెదకసాగాడు. కొండకి ఓ మూల నుండి పిల్లకాలువ ప్రవహిస్తోంది. ఆ కాలువలోకి దిగి ఎద్దులాగా నీరు నోటితో తాగసాగాడు. కడుపునిండా తాగాడు. నీళ్లు తాగాక మనసుకు శాంతి లభించింది.

అతడు అరగంటవరకూ ఆ కాలువగట్టున నీడలో విశ్రాంతి తీసుకున్నాడు. ఆక్కడ కూడా అతడికి భయంగావుంది. కాలువ వడ్డున బురదలో అక్కడక్కడా పులిపాదాల గుర్తులు కనిపిస్తున్నాయి.

మార్టిన్‌కు త్వరగా యింటికి వెళ్లాలని కోరికగా వుంది. అంచేత అక్కడినుండి లేచి బయలుదేరాడు. అతడు చాలా కొండలు దాటుకుంటూ అడివిలోకి ప్రవేశించాడు. అక్కడినుండి ముందుకు వెళ్లడం కష్టంగా వుంది. అది ఓ పెద్ద కీకారణ్యం.

ఏంచేయాలో అతడికేమీ దిక్కు తోయడంలేదు. అతడు ఓ బండరాయి నీడలో నిలుచుండిపోయాడు.

అక్కడికి కొంత దూరంలో మనుషుల అరుపులు, కేకలు వినిపిస్తున్నాయి. మార్టిన్ కళ్లు తెరిచి చూశాడు. మనుషుల అలికిడి వినిపిస్తోంది. అతడికి సంతోషం కలిగింది. కానీ అతడు తనను తాను చూసుకొని వులిక్కిపడ్డాడు. అప్పుడు అతడి వంటిమీద బట్టలు లేవు. తను కట్టుకొన్న పంచెను అతడు పడుకొన్న కొండచిలువ

శరీరం మీదే వదిలేసి పరిగెట్టాడు. మనుషుల కోలాహలం ఎక్కువయింది. వాళ్లంతా తనకు దగ్గరౌతున్నట్లుంది. అతడు తుపాకీ గుండు ప్రేలిన చప్పుడు విన్నాడు.

మార్టిన్ బెదిరిపోయి ఆ బండరాయికి అనుకొని నిలుచున్నాడు.

అకస్మాత్తుగా మార్టిన్ ఎదుట ఏదో ప్రాణి ఎగిరిపడింది.

అతడు ఓ అడివిమనిషిలా వున్నాడు. అతడి శరీరం కారు చీకటిలావుంది. అతడి ముఖంమీద చిన్న చిన్న మచ్చలున్నాయి. ఆ అడివి మనిషి చంకలో ఓ నగ్న స్త్రీ వుంది. ఆమె అతడి నుండి తప్పించుకోడానికి కాళ్లు చేతులు జాడిస్తోంది. ఆ ఆడమనిషిని అతడు బలపూర్వకంగా భుజంమీద అదిమిపట్టి అడివిలోకి పారిపోయాడు. ఆ భయంకరమైన అడివిమనిషి క్షణంలోనే అడివిలోపలికి పారిపోయాడు.

"అదిగో, అదిగో అక్కడున్నాడు, ఆ బండరాయి వెనకాల. వాణ్ణి అక్కడే చంపెయ్యండి." వెంటనే తుపాకిగుండ్లు ప్రేలిన చప్పుడు వినిపించింది. మార్టిన్ ముందు ఓ బండరాయి ముక్క పగిలి ఎగిరిపడింది. అతడు కిందపడిపోయాడు. మార్టిన్ లేచి నిలబడేలోపలే అతడి కాళ్లూ చేతులూ కట్టివేయబడ్డాయి.

"ఒకడు దొరికాడు." అని కొందరు అరవసాగారు.

తుపాకీ, కర్రలు, కటార్లు చేతబూని నలుగురైదుగురు నాయర్లు, పది పదిహేనుమంది పణియర్లు ఒక గుంపుగా ఏర్పడి మార్టిన్‌ను చుట్టుముట్టారు. నగ్నంగా వున్న మార్టిన్‌వైపు కసిగా చూస్తున్నారు.

"ఈ అడివిమనిషి మెళ్లో ఏదో వేలాడుతోంది "ఒకడు అన్నాడు.

"వీడు ఎక్కడో ఈ ఇనుపముక్కను దొంగిలించి వుంటాడు. మరొకడు జవాబు చెప్పాడు.

"వీడు అడివిమనిషిలా లేడు. వీడి వెంట్రుకలు శుభ్రంగా వున్నాయి."

"ఒరేయ్! వీడు అరబ్బీ వాడులా వున్నాడు " మరొకడు గట్టిగా అన్నాడు. "ఇలాంటి ప్రాణి కిందటేడు కూడ కనిపించింది. దాన్ని చూసి కుంజుబు నాయర్ భయపడి పరుగుతీశాడు."

"ఒరేయ్! యింతకీ నీవు అడివిమనిషివా లేక అరబ్బువాడివా?" ఓ యువకుడు మార్టిన్ నెత్తిమీద గట్టిగా కొట్టి అడిగాడు.

మార్టిన్ జవాబు చెప్పలేదు. అతడి తలకాయ ముందే మరియమ్మ

ముష్టిదెబ్బలతో వాచిపోయివుంది.

"వీడు ఏదో మాట్లాడుతున్నాడు. తురకవాడై వుండొచ్చు" అని వాళ్లనుకున్నారు.

వాళ్లు ఆ ఖైదీని ఈడ్చుకుంటూ నారాయణన్ నంబియార్ కళ్లం వైపు తీసుకవెళ్లారు.

## నలభై

ఆ కళ్లంలో నారాయణ నంబియార్ పొలాల్లో పండిన పంటను కోయించి అక్కడ కుప్పలు పోయించేవాడు. అతడు అరుదుగా అక్కడ కట్టిన యింటిలో వుండేవాడు. ఆ యిల్లు అడివిలో కట్టబడింది. వాళ్లు వేటకు వచ్చినప్పుడు కొద్దిరోజులు ఆ యింట్లో బసచేసేవారు.

ఆ యిల్లు అందమైన కొండలోయలో కట్టబడింది. ఆ యింటికి కొద్దిదూరంలో పణియర్ల చిన్న పల్లె వుంది.

ఆ యింటికి మైలుదూరంలో ఓ దట్టమైన అడవి వుంది. ఆ అడవి లోపలకి మనుషులెవరూ ప్రవేశించేవారు కాదు. ఆకాశాన్నంటే ఎత్తైన చెట్లు, లోపలికి వెళ్లటానికి దారే లేదు. ఆ భయంకరమైన అడివిలోకి ప్రవేశించడానికి ఎవరూ ధైర్యం చేసేవారు కాదు. నాలుగువైపులా కొండలూ మధ్యలో సెలయేరు. ఆ సెలయేట్లో ప్రాచీనకాలపు జలప్రాణులుండేవి. నీళ్లపైన పెద్ద పెద్ద కలువపూలు కనిపించేవి. ఆ దట్టమైన అడివిలోపల పాతకాలంనాటి కోట శిథిలాలు కనిపించేవి. అడివి ఏనుగులు ఆ కోటకు దగ్గరగా వెళ్లి మళ్లీ భయంతో వెనుదిరిగేవి.

ఆ అడివిలో నివసించే అడివిమనషుల శరీరాలు పూర్తిగా మసిపూసినట్లు వుండేవి. వళ్లంతా వెంట్రుకలుండేవి. అడవి స్త్రీలు ఆ సెలయేట్లో స్నానాలు చేసి కలువ కాడలవేళ్లను తుంచుకొని తెచ్చేవారు. ఆ అడవిలో చెట్లమీద వేలాడే పాముల తలలపైన పువ్వులుండేవి.

ఇలా ఎన్నో కట్టుకథలు ఆ అజ్ఞాతప్రదేశం గురించి ప్రచారం అయ్యాయి. ధైర్యవంతులైన వేటగాళ్లు ఆ అడవి అంచులవరకూ మాత్రమే వెళ్లగలిగేవారు.

ఆ కోట లోపల అరబ్బులూ వాళ్ల పిల్లలూ వుంటారని అనుకునేవారు. ఈ అరబ్బులు ఎవరు? వాళ్ల కొడుకులు ఏమిటి? అన్న విషయం వివరంగా ఎవరికీ

తెలీదు. ఆ అడవిలోపలి రహస్యాలు పగటి కలల్లాంటివి.

కానీ ఆ మాయాలోకంలో ఎక్కడో అడవి మనుషులుంటారని అందరూ అనుకొనేవారు. ఆ అడవి రాక్షసులు అప్పుడప్పుడూ లోయలోకి దిగి మణియర్ల స్త్రీలను పట్టుకొని పోయేవారని కూడా అనుకేనేవారు. ఆ సమయంలో మణియర్లు గట్టిగా కేకలు వేసి అరిచేవారు. వాళ్లంతా కలిసి దొంగల్ని పట్టుకొని కొట్టేవారు. తుపాకులు పేల్చేవారు. సాధారణంగా ఆ అడివి మనుషులు చాలా సులువుగా స్త్రీలను ఎత్తుకొని అడవిలోకి పారిపోయేవారు.

ఓసారి అడవి రాక్షసుడు స్త్రీలను ఎత్తుకెళ్లడానికి లోయ దిగివచ్చి ఓ స్త్రీని లాక్కెళుతున్నప్పుడు ఆ అడవి మనుషి బదులు పొరబాటున పల్లె ప్రజలకు మార్టిన్ దొరికిపోయాడు.

నారాయణనంబియార్ అతడి సహచరులూ మార్టిన్‌ను ఈడ్చుకొని తనకళ్ళంలోకి తీసుకెళ్లారు. అక్కడే అయిదుమంది అతిథులు కూర్చొని వున్నారు. వాళ్లల్లో ఒకడు నారాయణనంబియార్ బావమర్ది కుంజి అనంతకురూప్పు.

నారాయణనంబియార్ నవ్వుతూ తన బావమర్ది దగ్గరకు వెళ్లాడు.

"ఎలా వున్నావోయ్? ముందుగా కబురు పంపిస్తే నేను నీకోసం ఎదురు చూసేవాణ్ణిగదా? వీళ్లు ఎవరు?"

"ఇప్పుడే చెబుతా." కుంజి అనంత కురూప్పు బట్టలు లేని ఆ ఖైదీని చూసి ఆశ్చర్యంగా అడిగాడు. "మీరు వేటాడుతున్నప్పుడు ఈ మనిషిని ఎట్లా పట్టుకున్నారు? వీడు అడివిమనిషా?"

"వీడు అరబ్బువాడు! మీరు కేవలం అరబ్బువాళ్ల గురించి యింత వరకూ వినే వుంటారు. యిప్పుడు మీరు మీ కళ్లతో చూస్తున్నారు. పణియర్లు అరబ్బువాళ్లను తరుముతున్నారు. అప్పుడు ఈ అరబ్బువాడు బండరాళ్ల మధ్య దాక్కొని వున్నాడు. ఆ సమయంలో పట్టుబడ్డాడు." నంబియార్ వివరించాడు. మార్టిన్ చాలా దుఃఖపడుతున్నాడు. మెల్లగా తల యెత్తి అందర్నీ దీనంగా చూస్తున్నాడు. అక్కడ కూర్చున్న వాళ్లలో తనకు తెలిసిన ముఖాన్ని చూసి కళ్లు పెద్దవయ్యాయి. అతడు వెంటనే చేతులెత్తి ప్రాధేయపడుతూ "జాన్‌గారూ! బాబూ జాన్‌గారూ నన్ను రక్షించండి."

వాళ్లంతా అతణ్ణి అరబ్బువాడనే అనుకుంటున్నారు. అతడు మలయాళంలో

మాట్లాడ్డం చూసి వాళ్లు ఇప్పుడు ఆశ్చర్యచకితులయ్యారు.

జాన్ ముందుకు వచ్చి మార్టిన్ భుజంమీద చేయి వేసి అడిగాడు "అయ్యయ్యో! నీవు ఇక్కడికి ఎలా వచ్చావు? నీవు మా మార్టిన్‌వే కదూ? నీవు వీళ్ళకు ఎందుకు పట్టుబడ్డావు?"

"బాబుగారూ! నేను మీకు వివరంగా చెబుతాను." మార్టిన్ బాధపడుతూ అన్నాడు.

"బాబుగారూ! ముందు ఈ కట్లు విప్పించండి." మార్టిన్ రెండుసార్లు నేలమీద పడిపోయాడు.

జాన్, నారాయణన్ నంబియార్‌వైపు వినయపూర్వకంగా చూసి "దయచేసి అతడికి కట్లు విప్పండి. అతడు అరబ్బీవాడూ కాదు, నీగ్రోవాడూ కాదు. ఇతడు మాలాగే తిరువాన్‌కూరు నుండి వలస వచ్చిన పేద క్రైస్తవుడు."

నారాయణన్ నంబియార్ ఆశ్చర్యపోయి మార్టిన్‌వైపు చూశాడు. తర్వాత గట్టిగా నవ్వి "ఓరి దుర్మార్గుడా! నీవు మమ్మల్ని మూర్ఖుల్ని చేశావు. వంటిమీద నూలుపోగుకూడా లేకుండా అడవుల్లో తిరుగుతూ వున్నావు. ఇంతవరకూ ఒక్కమాట కూడా మాట్లాళ్లేదు? బహుశా యితడు పిచ్చోడేమో!" నారాయణన్ నంబియార్ జాన్‌వైపు చూస్తూ అన్నాడు.

"పిచ్చివాడు మాత్రం కాదు" జాన్ నవ్వు ఆపుకుంటూ అన్నాడు. "ఈ మనిషి తత్వమే అంత."

జాన్ తన కండువాతీసి మార్టిన్ నడుముకు చుట్టాడు.

"ఇతడు ఏం పని చేస్తాడు? యిలా తిరగడమేనా యితని పని?" కుంజి అనంత కురూప్పు అడిగాడు.

"అలాంటిదేమీ కాదు. యితడికి పొలమూ గట్రా వున్నాయి " అతిథులతో చెరియన్ అన్నాడు.

"ఎక్కడ?"

"జాన్‌గారి తోటకు ఆరుమైళ్లదూరంగా పడమటివైపు కలియన్ కొండమీద."

"బాపురే! కలియన్ కొండమీదా?" నారాయణన్ నంబియార్ ఆశ్చర్య చకితుడయ్యాడు. "ఇక్కడి నుండి కనీసం పదిమైళ్ల దూరంలో వుంది. అక్కడినుండి ఇతడు ఏమార్గం గుండా ఈ చిట్టడివిని దాటుకొని వచ్చాడు?"

"ఇవన్నీ తరువాత అడిగి తెలుసుకుందాము. ముందు కట్లు విప్పించండి."

"ఒరే అంబూ! వీడికి కట్లువిప్పు " నారాయణన్ నంబియార్ తన గుమాస్తా అంబుకురూప్పును ఆజ్ఞాపించాడు.

యిలా మార్టిన్ స్వతంత్రుడయ్యాడు.

గుమస్తా అంబుకురూప్పుకు, అతడి మిత్రులకూ కోపం నిరాశా రెండూ కలిగాయి. వాళ్లు యెంతో కష్టపడి అతణ్ణి పట్టుకొని తీసుకవచ్చారు. ఎలుగుబంటిని పట్టి బంధించినట్లు బిగించి కట్టేశారు. చివరకు అతడు దక్షిణాది నుండి వచ్చిన చెట్టన్! ఆ బట్టతల చెట్టన్ తల పగలగొట్టాలనిపించింది వాళ్లకు.

మార్టిన్ చేతులు చాచుకొని ముంగిలిలో తలవంచుకొని కూర్చున్నాడు. జాన్ మెల్లగా అతడి దగ్గరకు వెళ్లి కూర్చొని జరిగిన సంగతంతా తెలుసుకున్నాడు.

మార్టిన్ తాలూకు యాత్రా వృత్తాంతం విని అక్కడవున్న వాళ్లంతా ఆశ్చర్యపోయారు. నవ్వుకున్నారు.

కుంజీ అనంత కురూప్పు తన స్నేహితులను నారాయణన్ నంబియార్‌కు పరిచయం చేశాడు.

"వీరు రిటైర్డు పోలీసు ఇన్‌స్పెక్టరు మాధవన్ అటియోడీ. వీరు అటియోడీ బావమర్ది దామోదరకురూప్పు - మిలటరీలో కమీషన్డ్ ఆఫీసరు. వీరేమో మిస్టర్ జాన్ యిక్కడ ఓ ఎస్టేటు యజమాని. వాళ్లిద్దరూ జాన్ మిత్రులు - మిస్టర్ వర్గీస్, మిస్టర్ చెరియన్, తిరువాన్కూరు నుండి ఇక్కడికి వలసవచ్చిన జమీందార్లు. మేమంతా యిక్కడికి వేటకోసం వచ్చాము."

"చాలా సంతోషం." నారాయణన్ నంబియార్ అతిథులకు స్వాగతం పలికాడు.

"వేటకు కావలసిన యేర్పాట్లు అన్నీ చేస్తాను. నేను కూడా మీతో వుంటాను. సాయంకాలానికి బయల్దేరదాము. ఇప్పుడు మీరంతా భోంచేసి హాయిగా రెస్టు తీసుకోండి."

నారయణన్ నంబియార్ అంబుకురూప్పును పిలిపించి మంచి భోజనం తయారు చేయించమని ఆదేశించాడు.

"మీరు యిక్కడే కూర్చోండి. నేను పణియర్లు గుడిసెలవద్దకు వెళ్లివస్తాను. అడవి అరబ్బులు యెంతమంది పణియరు ఆడవాళ్లను లాక్కెళ్లారో తెలియదు."

నారాయణన్ నంబియార్ ఇద్దరు నాయర్లను వెంటబెట్టుకొని పణియర్ల గుడిసెలవైపు బయల్దేరాడు.

పణియర్ గుడిసెల్లో యేడుపులూ, పెడబొబ్బలూ వినిపిస్తున్నాయి. ముగ్గురు పణయర్ స్త్రీలు కనిపించడం లేదట.

భార్యలను పోగొట్టుకున్న పణియర్లు మళ్లీ పెళ్లి చేసుకోవడానికి కావలసిన బియ్యం, బట్టలు, సారా, కొంత డబ్బు యిస్తానని నారాయణన్ నంబియార్ భరోసా యిచ్చాడు. అప్పటికిగాని వాళ్ల యేడుపులూ అరుపులూ శాంతించలేదు.

తర్వాత వేటకు కావలసిన ఏర్పాట్లు చురుకుగా కొనసాగాయి.

తుపాకుల్ని శుభ్రంగా తుడిచిపెట్టారు. టార్చిలైట్లలో కొత్త బ్యాటరీలు వేశారు. తుపాకిగుళ్లు సరిచేశారు. వేట సంచులు కట్టేశారు. అడవిలో భోంచేయడానికి కావలసిన ఆహారపదార్థాలు కట్టుకున్నారు. అడవిలో దారి చూపడానికి, సామాన్లు మోయడానికి పణియర్ వేటగాళ్లను పిలిపించారు.

సాయంకాలానికి వేటకు బయల్దేరారు. ఆ గుంపులో మార్టిన్‌ను కూడా కలుపుకున్నారు. నారాయణన్ నంబియార్ మార్టిన్‌కు ఓ నిక్కరూ కాకీ కోటు యిచ్చాడు.

## నలభై ఒకటి

మైసూరులోని కూర్గ కొండలనుండి మొదలయ్యే సెలయేరు కొండలూ, గుట్టలూ, లోయలూ దాటుకొని విశాలమైన అడవుల్లోకి వేగవంతంగా ప్రవహిస్తోంది. ఆ సెలయేరు రెండు కొండలమధ్య నుండి మైదానంలోకి ప్రవేశించి చివరకు ఒక పెద్ద లోతైన తటాకం చేరుకుంటుంది.

ఆ వృత్తాకార తటాకానికి నాలుగువైపులా దట్టమైన అడవి. ఎత్తైన వృక్షాలకు లావుపాటి తీగలు అల్లుకొని వ్రేలాడుతున్నాయి. వాటిమీద విషసర్పాలు నివాసముంటున్నాయి. అడవి దట్టంగా వుండటం చేత నేల అంగుళం మాత్రం కూడా కనిపించడంలేదు. వెదురు పొదలమధ్య నుండి వింతస్వరాలు ఎప్పుడూ వినిపిస్తుంటాయి.

ఫాల్గుణమాసం ప్రారంభమయింది. అక్కడ గోతుల్లో నీరు సగంవరకూ యింకిపోయింది. ఆ గోతుల అంచున వున్న బండరాళ్లు వర్షాకాంలో పూర్తిగా

మునిగిపోయి వుంటాయి. కానీ నేడు అవి పూర్తిగా బయటపడ్డాయి. నీళ్లు యెండిపోయి బురదమాత్రమే మిగిలిన చోట పులులపాదాల గుర్తులు కనిపిస్తున్నాయి. సెలయేరు నీరు ప్రవహించే చోట ఇప్పుడు రంగురంగుల గుండ్రని రాళ్లు పడివున్నాయి.

వంపులు తిరిగిన ఆ సెలయేరు చూడ్డానికి యేదో అడవిపాము పడుకొని వున్నట్లు అది అక్కడక్కడా గుడ్లు పెట్టినట్లుంది.

ఆ రాత్రిపూట అక్కడ ఎప్పుడూ లేని కోలాహలం వినిపిస్తోంది. ఆ నీరవ ప్రదేశంలో మనుషుల మాటలు వినిపిస్తున్నాయి. తీగలూ పొదలూ నరుక్కుంటూ కొందరు మనుషులు ఆ సెలయేరు వెంబడీ వస్తున్నారు. చేతులతో కత్తులు పట్టుకొని నెత్తిమీద కర్రల మోపులున్నాయి. వారి వెనక విల్లూ బాణాలు, చేపలబుట్టలు తీసుకొని ఆడవాళ్లు వస్తున్నారు. వారి వెనుక చాపలు, దివిటీలు, కుండలూ తీసుకొని చాలామంది పిల్లలు వస్తున్నారు. వారితోపాటు చాలా కుక్కలు కూడా వస్తున్నాయి. ఆ నీళ్ల చెరువు చేరుకొని వాళ్లు నెత్తిమీదున్న కర్రల మోపులు క్రిందికి దింపి అలసట తీర్చుకుంటున్నారు. స్త్రీలు విల్లూబాణాలు కిందబెట్టి చెరువుకు దగ్గర కొంత నేల శుభ్రం చేసుకుంటున్నారు. పిల్లలు చేతుల్లో వున్న వస్తువులు పడేసి ఈదడానికి చెరువులో దుమికారు. కుక్కలు అటూ యిటూ తిరుగుతున్నాయి.

వాళ్లు అక్కడికి ఆరుమైళ్లదూరంలో వుండే కారంపాలా గ్రామస్తులు. దాదాపు వాళ్లు వందమంది వుంటారు. వాళ్లు ఆ చెరువులో చేపలు వేటాడ్డానికి వచ్చారు. చేపలకు మైకం కలిగించే ఆకులు తెచ్చి దంచి చెరువులో కలిపే ప్రయత్నంలో వున్నారు.

సాయంకాలమైంది. స్త్రీలు వంట వండుతున్నారు. మగవాళ్లు చెరువుకు రెండువైపులా గట్లు కడుతున్నారు. చెరువులోకి సెలయేరు నీరు ప్రవేశించేచోట ఓ చెట్టు వుంది. "ఆ చెట్టు కింద గట్టు కట్టండి" చందిరన్ సలహా యిచ్చాడు.

వాళ్లు పెద్ద పెద్ద రాళ్లను తెచ్చి గట్లు కడుతున్నారు. పెద్దరాళ్ల మధ్య రంధ్రాలను చిన్నచిన్న రాళ్లు, చెట్లకొమ్మలు తెచ్చి నీళ్లు కారకుండా గట్లు కట్టారు. చెరువు కింద రెండో గట్టుకూడా కట్టారు.

చిన్నపిల్లలు అడవిమొక్కలు నరికి విల్లు, అంబులు తయారు చేసుకుంటున్నారు.

రాత్రి కావస్తోంది. అడివి జంతువుల్ని భయపెట్టడానికి యెండుచెట్లకు నిప్పు అంటించారు. ఎండు కర్రలను దివిటీలుగా చేత బుచ్చుకొని అటూ యిటూ తిరుగుతున్నారు. నీడలను చూచి కుక్కలు గట్టిగా మొరుగుతున్నాయి.

చందిరన్ యేటి వడ్డున అక్కడక్కడా కొన్ని గోతులు తీశాడు. చామన్, అంబూ చేపలకు మైకాన్నిచ్చే చెట్లఆకులు విరిచి తెచ్చి ఆ గోతుల్లో నింపుతున్నారు. ఆకులపైన ఇసుకచల్లి కొద్దిగా నీళ్లు పోశారు. ఆడవాళ్లు, మగవాళ్లు చేతుల్లోకి కర్రలు తీసుకొని గోతుల్లో వేసిన ఆకును విషంగా తయారు చేయడానికి దంచేందుకు సిద్ధమయ్యారు. ఒక్కొక్క గోతికి నాలుగువైపులా ఆరు-ఏడుమంది ఆడా మగా నిలుచున్నారు. పాటపాడ్డం మొదలయింది.

పాటతోపాటు లయబద్ధంగా రోకళ్లు గోతుల్లోవున్న ఆకును దంచుతున్నాయి. కుమ్మరి వాడి చక్రం తిరుగుతున్నట్లు వాళ్లు చుట్టూ తిరుగుతూ దంచుతున్నారు.

వాళ్లు గతించిన వీరుల వీరగాథలు పాడుతున్నారు. వాళ్లల్లో ముసలివాడు చందప్పన్ పాట పాడుతున్నాడు. తక్కినవాళ్లు అతడికి వంత పాడుతున్నారు.

వేటగాడు వేటాడే సమయంలో పులిని చంపాడు. దాని నాలుక కోసేశాడు. కానీ తిరిగివచ్చే సమయంలో పాము కరిచి దారిలోనే చనిపోయాడు.

ఇంగ్లీషువాళ్ళతో యుద్ధంచేస్తూ నపశీ రాజు ఓడిపోయాడు. తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోడానికి అతడు తన వేలికివున్న వజ్రపు వుంగరాన్ని మింగి యిహలోకయాత్ర చాలించాడు. వాళ్ల పాటల్లోని సారాంశం అదే. పాటపాడుతూ మధ్యమధ్యలో చప్పట్లు చరుస్తూ గట్టిగా కేకలేశేవారు.

ఆ మత్తు కలిగించే ఆకులనూ, కొమ్మలనూ దంచి దాన్నంతా ఒకచోట కుప్పగా పోశారు. మళ్లీ రెండోసారి ఆకులను, కొమ్మలనూ గోతుల్లో పోసి ఇసుక, నీళ్లూ చల్లి దంచసాగారు.

"రామా, యీ దంచిన దాన్ని తీసి కుప్పవేయి " అని కేకవేశారు.

'కేలా! మట్టి తీసుకరా " మరొకరు పిలిచారు.

అప్పుడే కుక్కలు మొరగడం ప్రారంభించాయి. అడివిలో యేదో అలికిడి వినిపిస్తోంది. వెలుతురు కిరణాలు ప్రసరిస్తున్నాయి.

కరిపాలా వాళ్లు పాట ఆపి చప్పుడు వినిపిస్తున్న వైపు చూడసాగారు. వాళ్లు వేటకోసం వచ్చిన వాళ్లు, టార్చిలైటు వెలిగించి జంతువుల కోసం వెదుకుతున్నారు.

నారాయణన్ నంబియార్, అతడి స్నేహితులూ యేరు దగ్గరకు చేరుకున్నారు.

కరిపాలా పల్లె పెద్ద చందప్పన్ ముందుకు వెళ్లి నంబియార్‌కు నమస్కరించి తలవంచుకొని వినయంగా నిలుచున్నాడు.

చందప్పన్‌తోపాటు కరిపాలా ప్రజలంతా నారాయణన్‌నంబియార్ సేవకులు.

"యేమిటి చందప్పా? నీళ్ళల్లో మత్తు కలపడానికి వచ్చారా? సంతోషం మేం కూడా యిటువైపు వేటాడ్డానికి వచ్చాం."

"దొరగారి ఆజ్ఞ" చందప్పన్ చేతులు జోడించి నిలుచున్నాడు.

నారాయణన్‌నంబియార్ అడియోడీవైపు తిరిగి "మీకు వంట్లో బాగా లేకపోతే పడుకొని విశ్రాంతి తీసుకోండి. మీకు తోడుగా మార్టిన్‌ను యిక్కడే వదిలేసి వెడతాము. మేము వేటాడి తెల్లవారు జాముకల్లా యిక్కడికి చేరుకుంటాము."

అడియోడీ నంబియార్ చెప్పినట్లు విశ్రాంతి తీసుకోదలచాడు. చందప్పన్‌ను పిలిచి నంబియార్ ఆజ్ఞాపించాడు. "అయ్యగారిని యిక్కడే వదిలి మేము ముందుకు వెడుతున్నాము. వీరికి కావలసిన సపర్యలు చేయాలి."

"దొరగారి ఆజ్ఞ" చందప్పన్ వినయంగా అంగీకరించాడు.

"మార్టిన్ యెక్కడ?" నారాయణన్ నంబియార్ మార్టిన్‌ను పిలిచాడు.

మార్టిన్ తలవంచుకొని ముందుకువచ్చాడు. అతడి భుజమ్మీద రెండు లేళ్లు కొన్ని కుందేళ్లు వున్నాయి. అవి వేటాడుతున్నప్పుడు చనిపోయాయి.

"నీవు యిక్కడే కూర్చో" నారాయణన్‌నంబియార్ చెప్పాడు.

"నిద్రపోవద్దు"

నారాయణన్ నంబియార్ తన స్నేహితులను వెంటబెట్టుకొని అడవిలోకి వెళ్లిపోయాడు.

చందప్పన్, అడియోడీ పడుకోడానికి ఆకులతో పక్క తయారుచేశాడు. అడియోడీ ఆ పచ్చని ఆకులపక్కమీద పడుకున్నాడు.

మళ్లీ అడివిలో అస్పష్టంగా ఏదో చప్పుళ్లు వినిపించాయి. అది విని మార్టిన్ భయపడ్డాడు. అతడు ఆ సమయంలో మంట వేసి చలి కాచుకుంటున్నాడు. నిప్పుకు దగ్గరగా పచ్చిమాంసం వుంచుకోవడం మార్టిన్ మంచిది కాదనుకున్నాడు.

అతడు లేడి తొడకోసి నిప్పులో కాల్చాడు. మాంసం కాలడంతో ఆ వాసన పసిగట్టి కుక్కలన్నీ మార్టిన్ చుట్టూ తిరుగుతున్నాయి. మార్టిన్ ఆ కుక్కల్ని పట్టించుకోకుండా కాలిన మాంసాన్ని కోసుకొని తింటున్నాడు.

అడియోడీ ఆకాశంవైపు ముఖం మళ్లించి పక్కమీద పడుకొని వున్నాడు. మేఘాలు ఎక్కడా కనిపించడంలేదు. ఆకాశంలో వేలకొలది నక్షత్రాలు వెలిగిపోతున్నాయి. అప్పుడు కూడా కరిపాలా పల్లెవాళ్లు మందస్వరంతో పాట పాడుతున్నారు. ఆ పాటవింటూ వింటూ వింటూ అడియోడీ నిద్రలోకి జారుకున్నాడు.

అతడు యెంతసేపు నిద్రపోయేడో తెలియలేదు. కుక్కలన్నీ మొరుగుతుంటే అడియోడీ మేల్కొని కళ్లు విప్పాడు.

కరిపాలా వాళ్లంతా చాపలమీద పడుకొని నిద్రపోతున్నారు. అతడు మెల్లగా మార్టిన్‌వైపు చూశాడు. దగ్గర్లోనే చెట్లమధ్య యేదో నీడ కదుల్తోంది. వున్నట్లుండి ఓ చిన్నపొట్లం మార్టిన్ దగ్గరపడింది. మార్టిన్ వెంటనే దాన్ని తీసుకొని తన ఖాకీ కోటుజేబులో పెట్టుకున్నాడు. మార్టిన్ సంశయంగా అడియోడీవైపు చూశాడు. అడియోడీ యేమీ ఎరగనట్లు కళ్లుమూసుకొని నిద్ర నటించాడు.

అయిదు నిమిషాల తర్వాత అడియోడీ సగం కళ్లు తెరచి చూశాడు. నీడ మాయమైపోయింది. మార్టిన్ ఓ కర్రమీద తలమోపి నిద్రకు వుపక్రమిస్తున్నాడు.

ఎంత ఆలోచించినా ఆ ఘటన వెనుక దాగిన రహస్యం బోధపడలేదు. ఆ ఘటన వెనుక యేదో బలమైన రహస్యముందని అతడు నిర్ధారించుకున్నాడు.

అది యేమై వుండవచ్చు?

అరగంట తర్వాత అడియోడీ లేచి కూర్చొని నలువైపులా చూశాడు. మత్తుపదార్థం దంచి దంచి అలసిపోయిన కరిపాలా వాళ్లు గాఢంగా నిద్రిస్తున్నారు. చెట్లకింద స్త్రీలు, పిల్లలూ నిద్రిస్తున్నారు. మార్టిన్ గట్టిగా గురకబెట్టి నిద్రపోతున్నాడు.

అడియోడీ చప్పుడు చేయకుండా మెల్లగా మార్టిన్ దగ్గరకు వెళ్లాడు. అతడి ఎదురుగా మంటలు ఆరిపోయి కేవలం నిప్పులు మాత్రమే మిగిలాయి.

అడియోడీ మార్టిన్ ముఖంవైపు చూశాడు. అతడు మంచి నిద్రలో వున్నాడు. అడియోడీ చాలా జాగ్రత్తగా మార్టిన్ ఖాకీ కోటు జేబులో చేయివేసి పొట్లాం బయటకు తీశాడు. అందులో ఓ కవరుంది. కవరులోపల పది రూపాయల నోట్ల కట్ట వుంది.

అన్నీ కొత్త నోట్లే! అతడు నోట్లు లెక్కించలేదు. కానీ వందనోట్లు వుంటాయని అంచనా వేసుకున్నాడు.

అడియోడీ నోట్లకట్టను కవరులో వుంచి మార్టిన్ కోటుజేబులో వుంచి తిరిగి తన పక్కమీద పడుకున్నాడు. ఆ తర్వాత అడియోడీకి నిద్ర పట్టలేదు. మళ్లీ యేదైనా జరగవచ్చునని మార్టిన్‌వైపే చూస్తూ పడుకొన్నాడు. కానీ యేమీ జరగలేదు.

# నలభై రెండు

తెల్లవారుజామునే కరిపాలా వాళ్లు నిద్రలేచి దివిటీలు వెలిగించారు. పెద్దపెద్ద కర్రదుంగలు నరికి నీటివద్దున వేసివున్నాయి. వాళ్లు దివిటీలు చేతపట్టి కర్రలమీద కూర్చొని చెరువు లోపలికి దిగి మత్తు పదార్థాన్ని నీళ్లల్లో అన్ని వైపులా కలిపేశారు. మత్తు పదార్థాన్నంతా నీళ్లల్లో కలిపాక వాళ్లు వద్దుకు చేరుకొని మళ్లీ పడుకున్నారు.

అడియోడీ నిద్ర మేల్కొని కళ్లు తెరచి చూశాడు. దాదాపు తెల్లవారింది. కరిపాలా వాళ్లు అమిత వుత్సాహంతో చేపల వేటకు తయారవుతున్నారు. కరిపాలా స్త్రీలు వుదయంపూట భోజనానికి పొయ్యి రగిలిస్తున్నారు. మార్టిన్ కాళ్లమధ్య చేతులు చేర్చి గట్టిగా గుర్రుపెట్టి నిద్రిస్తున్నాడు.

అడియోడీ పక్కమీద కూర్చుని సిగరెట్టు పీల్చుతున్నాడు. రాత్రి జరగిన సంఘటన మళ్లీ అతడి మెదడులో కదిలింది. వేటకు వెళ్లిన వాళ్లు యింకా తిరిగిరాలేదు.

పూర్తిగా తెల్లవారింది. గడ్డిమీద, చెట్ల ఆకులమీద పడిన మంచుకణాలు సూర్యోదయంతో కరిగిపోయాయి. ఆ చెరువులో నీరు సూర్య కిరణాలతో మెరుస్తోంది. పొద్దు ఎక్కేకొద్దీ చెరువులో నీరు వేడెక్కసాగాయి. దాంతోపాటు నీళ్లల్లో మత్తుదనం ఎక్కువయింది. మత్తుతో చేపల కళ్లు మండిపోసాగాయి. అవి నీళ్లల్లో పైకీ కిందికీ మునుగుతున్నాయి.

కరిపాలా స్త్రీలూ పురుషులు విల్లంబులూ, తట్టలూ తీసుకొని నీళ్లల్లోకి దిగి నిలబడ్డారు. కొందరు ఈటెలు తీసుకొని చెరువులోకి వెళ్లారు. ఒకరిద్దరు వలలు తీసుకొని నీళ్లల్లో అటూ యిటూ తిరగసాగారు.

మత్తు ఎక్కువ అవడంతో విలవిలలాడుతూ చేపలు నీటిపైన ఈదుతున్నాయి. వాటిమీద వాళ్లు బాణాలు విసురుతున్నారు. బాణం తగులుతూనే

చేపలు విలవిలలాడుతూ నీళ్లలోపలికి మునిగిపోసాగాయి. కాని బాణమూ, బాణానికి కట్టిన తాడూ చేపను లోపలికి పోనీకుండా చేస్తాయి. వాళ్లు తాడుపట్టి లాగి పైకితీసి బాణానికి గుచ్చుకుపోయిన చేపను పట్టేస్తున్నారు. పట్టిన చేపల తల పగులకొట్టి తట్టలో వేస్తున్నారు. గట్లపైన యిటూ అటూ పెట్టిన తట్టలు చేపలతో నిండిపోయాయి.

నీళ్లు బాగా వేడెక్కినాక పెద్దపెద్ద చేపలు కూడా బయటికి రాసాగాయి. కఱ్ఱ దుంగలమీద కటార్లతో కూర్చున్న కరిపాలా యువకులు ఆ పెద్దచేపల్ని వేటాడుతున్నారు.

అడియోడీ వాచీ చూసుకున్నాడు. పదిగంటలయింది. వేటకు వెళ్లిన వాళ్లు యింకా తిరిగిరాలేదు. అతడి మనసులో యెన్నో అనుమానాలూ భయం కలిగాయి.

మార్టిన్ తన ఖాకీ కోటును విప్పి ఓ చెట్టుకింద పెట్టాడు. కేవలం నిక్కరు మాత్రమే వేసుకొని కరిపాలా వాళ్లతో పాటు చేపలు పడుతున్నాడు.

పదకొండు గంటలయింది.

చేపలు వేటాడి కరిపాలా వాళ్లు భోజనాలు చేస్తున్నారు. చిన్నపిల్లలు చిన్నచిన్న చేపలను నిప్పులో కాల్చుకొని తింటున్నారు. స్త్రీలు చేపల పొలుసు తీసి కడుపులోనున్న పేగులూ వగైరా తీసేసి యెండబెడుతున్నారు. వాళ్లు ఆ యెండు చేపల్ని వర్షాకాలంలో తినడానికి వుపయోగిస్తారు.

కరిపాలావాళ్లు యిండ్లకు వెళ్లడానికి తయారవుతున్నారు. పట్టిన చేపల్లో పెద్ద పెద్దవి యెంచి ఒకచోట కుప్పపోశారు. ఆ చేపల్ని నంబియార్ దొరగారికి సమర్పించుకుంటారు. వాళ్లు దొరకోసం యెదురు చూస్తున్నారు.

చెరువుగట్టు మీద చెట్లపొదలున్నాయి. ఆ పొదల్లోంచి నారాయణన్ నంబియార్ అతడి మిత్రులూ వస్తున్నారు.

నంబియార్ రెండు భుజాలమీదా రెండు తుపాకులున్నాయి. వెనక వర్గీస్ శవాన్ని కుంజి అనంతకురూప్పు, దామోదర కురూప్పు మోసుకొని వస్తున్నారు. వేట సంచులు, టార్చిలైట్లు, తుపాకులూ వగైరా మోసుకొని తక్కినవారు వస్తున్నారు. వాళ్లవెంట దయ్యంలాగా ఖాళీ చేతుల్తో చెరియన్ కూడా వస్తున్నాడు.

అంతా మౌనంగా దుఃఖంగా కనిపిస్తున్నారు. యేదో స్మశానం నుండి వస్తున్నారా అన్నట్లుంది.

అడియోడీ బెదిరిపోయి వాళ్లవైపు పరుగుతీశాడు. "ఏమయింది?" అని అడిగాడు.

వాళ్లు వర్గీస్‌ను ఓ చాపమీద పడుకోబెట్టారు. అడియోడీ వర్గీస్ నాడి చూడాలని ప్రయత్నించాడు. కానీ నారాయణన్ నంబియార్ అడ్డుపడి 'వద్దు' తాకవద్దు. అది శవం మాత్రమే."

"అయ్యో! వర్గీస్ చచ్చిపోయాడా? ఎలా? పులియేమైనా పట్టేసిందా?"

"లేదు," నారాయణన్ నంబియార్ తలవూపి భుజాలమీదున్న తుపాకులను కిందపెట్టి రాతిమీద కూర్చున్నాడు. కొంతసేపు మౌనంగా వుండిపోయాడు. ఎవరూ మాట్లాడలేదు.

"వర్గీస్ ఎలా చనిపోయాడు?"

"తుపాకీ గుండు తగిలి చనిపోయాడు." నారాయణన్‌నంబియార్ చాలా దుఃఖంగా చెప్పాడు.

అడియోడీ అందరి ముఖాలవైపూ ఒకసారి సందేహంగా చూశాడు.

"పొరబాటున యేమైనా గుండు తగిలిందా?" అడియోడీ నారాయణన్ నంబియార్‌ను అడిగాడు.

"అలాగే అనుకోవాలి."

అడియోడీ సంశయంగా చెరియన్‌వైపూ మార్టిన్‌వైపూ చూశాడు. మార్టిన్ చేతిలో చేపలబుట్ట పట్టుకొని చెరియన్‌కు దగ్గరగా ఆశ్చర్యంతో నోరుతెరిచి నిలబడ్డాడు.

గతరాత్రి తమకు దగ్గరగా వచ్చిన నీడే మార్టిన్‌వైపు పొట్లం విసిరింది. ఆ పొట్లంగురించి అడియోడీ గుర్తుకు తెచ్చుకున్నాడు. అది మార్టిన్ - చెరియన్‌ల మధ్య జరిగిన ఘటనకు ప్రధానమైన ఆధారం అని అడియోడీ గ్రహించాడు.

"ఇప్పుడు మీరు ఏమి చేయాలనుకుంటున్నారు?" అడియోడీ అడిగాడు.

"వెంటనే కల్లంవైపు వెళ్లాలి. వెళుతూనే పోలీసులకు వర్తమానం పంపాలి." నంబియార్ అన్నాడు.

కానీ వాళ్లు అప్పుడే బయలుదేరలేక పోయారు. వాళ్లు చాలా అలసిపోయి ఆకలితో వున్నారు. అందుచేత కొంతసేపు విశ్రాంతి తీసుకొని ముందుకు కదలాలని నిశ్చయించుకున్నారు.

# నలభై మూడు

కల్లం చేరుకుంటూనే నారాయణన్ నంబియార్ ఓ ఉత్తరం రాసి దాన్ని తన గుమస్తాకిచ్చి పోలీస్‌స్టేషన్‌లో ఇవ్వమన్నాడు. వాళ్లు జాన్, మార్టిన్, చెరియన్‌లను బలవంతంగా అక్కడే కూర్చోబెట్టారు.

సాయంకాలం కాబోతుందనగా పోలీసులను వెంటబెట్టుకొని పోలీసు ఇన్‌స్పెక్టర్ సులేమాన్ కల్లం చేరుకున్నాడు. అడియోడీ సబ్ ఇన్‌స్పెక్టరుగా వున్నప్పుడు సులేమాన్ అతడి కింది ఆఫీసరుగా వుండేవాడు. తరువాత ఇన్‌స్పెక్టర్ అడియోడీ సిఫారసు మేరకు సులేమాన్‌కు ప్రమోషన్ వచ్చింది.

తన పాత ఆఫీసరును అక్కడ చూసి చాలా గౌరవంగా సెల్యూట్ చేశాడు. అడియోడీ సులేమాన్‌ను మేడమీదికి తీసుకువెళ్లాడు. అక్కడ వాళ్లిద్దరూ గంటసేపు రహస్యంగా మాట్లాడుకున్నారు. వాళ్లతోపాటు నారాయణన్ నంబియార్ కూడా వున్నాడు. తర్వాత ఇన్‌స్పెక్టరు సులేమాన్ కిందికి దిగివచ్చి జాన్‌ను ఓ మూలకు పిలిపించి మాట్లాడాడు. తర్వాత చెరియన్‌నూ మార్టిన్‌నూ పిలిపించాడు.

''వర్గీస్ చావు గురించి మీకేమైనా తెలుసా?'' ఇన్‌స్పెక్టరు అడిగాడు.

''బాబుగారూ! నాకేమీ తెలీదు. మేమంతా తుపాకులు బారు చేసుకొని అడివిలో అక్కడక్కడా కూర్చున్నాము. అప్పుడే తుపాకీ గుండు పేలిన చప్పుడు వినిపించింది. నేనే యే లేడివైపో గుండు పేలి వుంటుందనుకున్నాను. అందుకే నేను టార్చి చూపించి మిత్రులను పిలిచాను. కానీ ఎవరూ మాట్లాడలేదు. నేను అడివంతా వెతికాను. వర్గీస్ ఓ చోట పడివున్నాడు. అప్పటికే అతడు చనిపోయాడు. నేను నమ్మలేకపోయాను. నాకు ఆశ్చర్యం కలిగింది. కొంతసేపటికి నారాయణన్ నంబియార్ ఇతర మిత్రులూ అక్కడికి చేరుకున్నారు. నాకు యింతే తెలుసు. యెవరి తుపాకి గుండుతో వర్గీస్ చనిపోయిందీ నాకు తెలీదు. బహుశా, వర్గీస్ తుపాకీతోనే పొరపాటున గుండు పేలిందేమో! మేము వర్గీస్ తుపాకీ చూశాము. అందులో ఒక గుండు తక్కువగా వుంది.''

దుఃఖంచేత చెరియన్ ఆ తర్వాత యేమీ చెప్పలేకపోయాడు. ముంగిలిలో అరుగుమీద పడివున్న శవాన్ని వుద్దేశించి చెరియన్ ఇలా చెప్పాడు - ''నేనూ వర్గీసూ అన్నదమ్ముల్లా వుండేవాళ్లం. గత కొంతకాలంగా వర్గీస్ ఖర్చులకు నేనే డబ్బు

సర్దుతున్నాను.

"నీవు ఎప్పుడూ తుపాకీ పేల్చలేదా?" ఇన్స్పెక్టరు అడిగాడు.

"నేను నిన్న ఒక్కగుండు కూడా పేల్చలేదు. నా తుపాకీలో గుళ్లన్నీ అట్లే వున్నాయి."

ఇన్స్పెక్టరు మార్టిన్ను పిలిచాడు. "రేయ్! యితడి చావు గురించి నీకేమైనా తెలుసా?"

మార్టిన్ కిందికి చూస్తూ తలవూపాడు.

"రోయ్! నావైపు చూసి మాట్లాడు." ఇన్స్పెక్టరు మార్టిన్ తలమీద చేయి వేశాడు. మార్టిన్ తలపైకి ఎత్తాడు.

"ఈ చొక్కాను నీకు యెవరు ఇచ్చారు?" ఇన్స్పెక్టరు వెంటనే మార్టిన్ చొక్కా లోపల చేయి వేసి అడిగాడు.

మార్టిన్ జవాబు చెప్పకముందే ఇన్స్పెక్టరు కోటు జేబులోంచి ఆ పొట్లాన్ని బయటికి తీశాడు. మార్టిన్ నోరు తెరిచి నిలుచుండిపోయాడు. చెరియన్ ముఖం పాలిపోయింది.

"ఈ పొట్లం నీకు ఎక్కడ దొరికింది?" ఇన్స్పెక్టరు మెల్లగా అడిగాడు. మార్టిన్ ఏమీ మాట్లాడలేదు.

"దీనిలోపల యేముంది? చెప్పు?" ఇన్స్పెక్టరు పొట్లం చూపిస్తూ అడిగాడు.

జవాబు యేమీ చెప్పలేదు.

ఇన్స్పెక్టరు వాళ్లముందు పొట్లం విప్పాడు.

అందులో చాలా పదిరూపాయల నోట్లు చూసి అందరూ చకితులైపోయారు. జాన్ ఆ నోట్లను రెండువైపులా తిప్పిచూశాడు.

"యిన్ని నోట్లు నీచేతికి ఎలా వచ్చాయి?" ఇన్స్పెక్టరు మార్టిన్వైపు సూటిగా చూశాడు.

మార్టిన్ జవాబే చెప్పలేదు.

"అది అతడి కోటుకాదు. నారాయణన్ నంబియార్ ఇచ్చారు. నిన్న ఈ మార్టిన్ బట్టలు లేకుండా నగ్నంగా యిటువైపు వచ్చాడు." మార్టిన్ గురించి చెరియన్ చెప్పాడు.

"నేను నిన్ను అడగలేదు. నీవు అక్కడే నోరుమూసుకొని కూర్చో" ఇన్స్పెక్టరు

చెరియన్‌ను బెదిరించాడు.

"ఒరే చెట్టన్! నిన్నే అడుగుతున్నాను. యింత డబ్బు నీ చేతికి ఎట్లా వచ్చింది?" ఇన్‌స్పెక్టరు చాలా శాంతంగా అడిగాడు.

మార్టిన్ బొత్తిగా జవాబు చెప్పలేదు.

టపాసు పేలినట్లు మార్టిన్ చెంప చెళ్‌మంది. మార్టిన్‌కు కూడా తర్వాతే తెలిసింది, తన చెంపమీదనే దెబ్బపడినట్లు. అతడు రెండు చేతులూ చెంపలకు చేర్చి కుక్కలాగా భౌభౌమని యేడవసాగాడు.

"త్వరగా చెప్పు" ఇన్‌స్పెక్టరు రూపం మారిపోయింది. అతడు మరోమారు చెంప వాయించడానికి చేయి పైకి యెత్తి నిలుచున్నాడు.

"బాబుగారూ! నన్ను కొట్టకండి " మార్టిన్ చేతులు జోడించి ప్రార్థించాడు.

"అయితే నిజం చెప్పు."

"నా చేతికి యితడే ఇచ్చాడు." మార్టిన్ చెరియన్ వైపు చేయి చూపించాడు.

"అబద్ధం! అంతా అబద్ధం! నాకు పూర్తిగా యేమీ తెలియదు." చెరియన్ దయ్యంలాగా ముఖం వంకరగా పెట్టి జవాబిచ్చాడు.

"నువ్వు నోరుముయ్యి " ఇన్‌స్పెక్టరు చెరియన్ భుజంమీద ఓ గుద్దుగుద్ది అన్నాడు.

"ఎప్పుడు యిచ్చాడు?" ఇన్‌స్పెక్టరు మార్టిన్‌వైపు చూసి అడిగాడు.

"నిన్నరాత్రి. చేపలు పట్టే చోట యిచ్చాడు."

"ఏమి చెప్పి యిచ్చాడు?"

"నీ దగ్గర వుంచు, అని చెప్పి యిచ్చాడు."

"దీని లోపల యేముందో తెరిచి చూశావా నీవు?"

"లేదు, నేను ఆ సంగతే మరిచిపోయాను."

నోట్లకట్ట కట్టిన కాగితాన్ని ఇన్‌స్పెక్టరు అక్కడ కూర్చున్న వాళ్లందరికీ చూపించాడు. నోట్లను ఓ న్యూస్‌పేపరు కాగితంలో చుట్టాడు. ఆ కాగితానికి ఓ మూల చెరియన్ పేరు, అడ్రసూ రాసి వుంది.

ఇన్‌స్పెక్టరు కానిస్టేబుళ్లను పిలిచి చెరియన్‌కూ, మార్టిన్‌కూ బేడీలు వేయించాడు.

వర్గీస్ శవాన్ని పోస్టుమార్టమ్ చేయడానికి పట్టణానికి పంపించాడు.

ఇన్‌స్పెక్టరూ, కానిస్టేబుళ్లు ఆరోజు నారాయణన్ నంబియార్‌తో పాటు కల్లంలోనే వుండిపోయారు. చెరియన్, మార్టిన్‌లను ఖైదీలుగా అక్కడే వుంచారు. జాన్‌కూడా అక్కడే వున్నాడు. రెండోరోజు తెల్లవారు ఝామునే వాళ్లు చెరియన్‌నూ, మార్టిన్‌నూ తీసుకొని చెరియన్ యింటివైపు బయలుదేరారు. వెంట నారాయణన్ నంబియార్, అడియోడీ కూడా వున్నారు. వెళుతూ వెళుతూ ఆ ప్రాంతపు గ్రామాధికారిని కూడా వెంటబెట్టుకొని వెళ్లారు.

చెరియన్ యిల్లు సోదా చేయగానే ఇన్‌స్పెక్టరు అనుమానిస్తున్నట్లు వస్తువులన్నీ పట్టుబడ్డాయి. ఓ రహస్యగదిలో దొంగనోట్లు తయారుచేసే మిషను, ప్రింటు చేసే మిషను, సిరా మొదలైన వస్తువులు పట్టుబడ్డాయి. ఓవైపు ముద్రించిన నోట్లు ఆరబెట్టాడు. అవికూడా దొరికిపోయాయి.

ఇన్‌స్పెక్టరు సోదా చేసిన తర్వాత వస్తువులన్నిటినీ మూటగట్టి సీల్‌వేసి రిపోర్టు తయారుచేశాడు. ఆ తర్వాత సాక్షుల సంతకాలు తీసుకున్నాడు. నారాయణ నంబియార్‌కూ, అడియోడీకి ధన్యవాదాలు తెలిపి బేడీలు వేసిన ఖైదీలను వెంటతీసుకొని పోలీసుస్టేషను వైపు బయలుదేరారు.

స్టేషన్ చేరుకుంటూనే చెరియన్‌ను తన గదిలోకి పిలిపించాడు.

చెరియన్‌వైపు చూసిన వెంటనే ఇన్‌స్పెక్టరు అడిగాడు. "వర్గీసును తుపాకీతో పేల్చి హత్య చేయడానికి గల కారణమేమిటి?"

చెరియన్ వణికిపోయాడు. అతడు కళ్లు పెద్దవి చేసి నలువైపులా చూశాడు.

"నీవు వర్గీసును ఎందుకు చంపావు?" ఇన్‌స్పెక్టరు చాలా కోపంతో అడిగాడు.

"నేను చంపలేదు." చెరియన్ అలిసిపోయిన స్వరంతో అన్నాడు.

"మాయమాటలు చెప్పకు మిస్టర్ చెరియన్! ఇప్పుడే నీవు అన్నీ జరిగింది జరిగినట్లు చెప్పడంవల్ల నీకు మేలు జరుగుతుంది. ఇప్పుడు నేను ఒక స్నేహితుడిగా అడుగుతున్నాను. అన్నీ నిజంగా తెలిపితే మంచిదే. లేకపోతే లాకప్పులో కలుసుకుందామంటే, అందుకూ సిద్ధంగానే వున్నాను."

ఇన్‌స్పెక్టరు సిగరెట్టు రగిలించాడు. మండే అగ్గిపుల్లను చిరునవ్వుతో చూస్తూ తనలో తాను యేదో అనుకున్నాడు.

ఇన్‌స్పెక్టరు చిరునవ్వూ, అతడి బెదిరింపూ చెరియన్ గుండెల్ని మండించాయి.

నల్లని గుంతల్లో వున్న అతడి కళ్లు చలిస్తూ అటూ యిటూ తిరిగాయి. అతడు ఓ పెద్ద విషవాయువులో చిక్కుపడినట్లు భావించాడు.

"ఏం చెబుతావు?" ఇన్స్పెక్టరు ప్రశ్నించాడు. అతడి ఒక్కొక్కమాటా రోకటిపోటులా గుండెలమీద గట్టిగా తగులుతోంది.

"నేను వర్గీసును చంపినట్లుగా మీ దగ్గర సాక్ష్యమేముంది?" ధైర్యంచేసి చివరకు చెరియన్ ఇన్స్పెక్టరును అడిగేశాడు.

"మిస్టర్! సాక్ష్యాలు నేను చూసుకుంటాను" ఇన్స్పెక్టరు మూతి వంకరగా పెట్టి అన్నాడు. "నీవు వర్గీసును ఎందుకు హత్య చేశావు? దానికి కారణమేమిటి? ఇదే నా ప్రశ్న అర్థమయిందా?"

చెరియన్ కొంతసేపు మౌనంగా కిందికి చూస్తూ నిలుచున్నాడు. తర్వాత మెల్లగా తలపైకెత్తి అన్నాడు. "నా గుండు పొరబాటున వర్గీస్ గుండెలపై తగిలింది. అతడు చనిపోయాడు. నాకు వర్గీసును చంపాలనే వుద్దేశం బొత్తిగా లేదు."

ఇన్స్పెక్టరు నిర్వికారంగా చెరియన్ కళ్లలోకి చూశాడు.

"నిన్న నీవు తుపాకీ పేల్చలేదని చెప్పలేదూ? నీ తుపాకీలో నింపిన గుండ్లన్నీ వున్నాయి. వర్గీసు తుపాకీలో ఒక గుండు ఖాళీ అయింది. ఇది యెలా జరిగింది?"

"వేటకు ముందే మేము ఇద్దరమూ తుపాకులు మార్చుకున్నాము. నా తుపాకీ మంచిదని వర్గీసు అన్నాడు. అందుకే నా తుపాకీ అతడికి యిచ్చి, అతడి తుపాకీ నేను తీసుకున్నాను."

"వర్గీసుకు తుపాకీ గుండు తగిలిన తర్వాత తుపాకీ మార్చేశావుకదా?"

"ఔను."

"మిస్టర్ చెరియన్! యిప్పుడు నీవు చెప్పింది బహుశా నిజం కావచ్చు. అంతమాత్రాన నీకు మేలు జరగదు. పూర్తిగా నిజం చెప్పు. నీవు ఒక్కవిషయం గుర్తుంచుకో, సగం సత్యం చెప్పడం పూర్తిగా అబద్ధం చెప్పిన దానికంటే అపాయకరం."

"నేను యిక చెప్పవలసింది యేమీ లేదు."

"నీవు చెప్పాల్సింది చాలా వుందని నీ కళ్లే చెబుతున్నాయి." ఇన్స్పెక్టరు చెరియన్ కళ్లల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ నిలుచున్నాడు.

చెరియన్ పెదవిని పంటితో కొరుకుతూ దూరంగా ఎటో చూస్తున్నాడు.

"నా ప్రశ్నకు యింకా నీవు సమాధానం చెప్పలేదు. నీవు ఆలోచించు కోవడానికి నేను అయిదుగంటలు టైము యిస్తున్నాను. ఆరుగంటలకు నేను మళ్లీ వస్తాను. ఆ సమయానికి అన్నీ ఆలోచించుకొని రెడీగా వుండు."

ఇన్‌స్పెక్టరు కుర్చీనుండి లేచి 513ను పిలిచాడు.

"ఈ మనిషికి అన్నంపెట్టి లాకప్‌లో బంధించు. ఎవరూ ఇతడి దగ్గరకు వెళ్లకూడదు. నేను ఆరుగంటలకు మళ్లీవస్తాను. అప్పుడు నా దగ్గర హాజరుపరుచు."

కానిస్టేబుల్ చెరియన్‌ను లాకప్‌లోకి తీసుకవెళ్లాడు. ఇన్‌స్పెక్టరు భోంచేసి విశ్రాంతి తీసుకోడానికి యింటికి వెళ్లాడు.

సాయంత్రం ఆరుగంటలకు ఇన్‌స్పెక్టరు గదిలోకి ప్రవేశించాడు. కానిస్టేబుల్ చెరియన్‌ను హాజరుపరచాడు.

"ఏమి ఆలోచించుకున్నావు?" ఇన్‌స్పెక్టరు శాంతంగా అడిగాడు.

"వర్గీసును నేనే చంపాను."

"ఎందుకు? ఎందుకు చంపావు?" ఇన్‌స్పెక్టర్ మెల్లగా అడిగాడు.

చెరియన్ వివరంగా అంతా చెప్పాడు. నేను దొంగనోట్లు ప్రింటు చేసేవాణ్ణి. ఎలాగో ఈ విషయం వర్గీసుకు తెలిసిపోయింది. ఈ విషయం బయట పెట్టకుండా వుండడానికి లంచంగా మధ్యమధ్యలో వర్గీసుకు చాలా డబ్బు ఇచ్చాను. చివరిసారిగా తిరువాన్‌కూరు వెళ్లడానికి చాలా డబ్బు కావాలని అడిగాడు. నేను దొంగనోట్లు యివ్వబోయాను. కానీ అతడు ఆ డబ్బు తీసుకోలేదు. అతడు అసలు నోట్లు కావాలని మొండికేశాడు. అసలు నోట్లు రెండురోజుల తర్వాత యిస్తాను. అంతవరకూ దొంగనోట్లు తనవద్ద వుంచమని చెప్పాను. అందుకు అతడు ఒప్పుకున్నాడు. అసలు నోట్లు యిచ్చిన తర్వాత వర్గీస్ బతికివున్నంత కాలం తనకు శాంతి లభించదని అడవిలో సరైన అవకాశం దొరుకుతూనే తాను వర్గీసును హత్యచేశాను అని చెప్పాడు.

"మార్టిన్ దగ్గర దొరికిన నోట్లు...?" ఇన్‌స్పెక్టరు అడిగాడు.

"వర్గీసు కోటు జేబులో వున్న డబ్బే అది. అతడి శవాన్ని పరిశోధించేటప్పుడు పోలీసుల దృష్టి దొంగనోట్లపై పడకుండా వుండడానికి వర్గీసు జేబు నుండి తీసి మార్టిన్ చేతికిచ్చాను."

"మిస్టర్ చెరియన్! నా పనిని చాలా సుకరం చేశావు. ధన్యవాదాలు!" ఇన్‌స్పెక్టరు చెరియన్ భుజంమీద తడుతూ "నిజం చెప్పినందుకు నీకు నా

అభినందనలు. నాకు నీమీద సానుభూతి వుంది. ఇకపై నీ జీవితం చట్టం చేతిలో ఆధారపడివుంది. ఆ ధైర్యంతోనే కోర్టుకు వెళ్లు. దేవుడు నిన్ను రక్షించుగాక" అన్నాడు.

ఇన్స్పెక్టరు, చెరియన్ సాక్ష్యాధారాలతో రికార్డు తయారుచేశాడు.

చెరియన్ను లాకప్లోకి తీసుకవెళ్లారు. చెరియన్ గుండెలమీదినుండి ఓ పెద్ద భారం తొలిగింది. అయినా తన భవిష్యత్తు సంపూర్తిగా అంధకారంతో నిండిపోయిందని భావించుకున్నాడు.

## నలభై నాలుగు

ఆరోజు పాలకోట జమీందారు విశాలమైన బంగళాముందు ఫిర్యాదు చేసుకోడానికి చాలామంది వచ్చారు. వాళ్లల్లో ఎక్కువమంది క్రైస్తవులు. వాళ్లు తమ పొలాలను ఎంతో కొంతకు తెగనమ్మి తిరిగి తిరువాన్కూరు వెళ్లదలచారు. ఎందుకంటే వాళ్ల కుటుంబీకులు చాలామంది అక్కడ మలేరియా జబ్బుతో చనిపోయారు. వాళ్ల పంటపొలాలను అడివిపందులు సర్వనాశనం చేశాయి. వాళ్లవద్ద మళ్లీ వ్యవసాయం చేసుకోడానికి చిల్లిగవ్వకూడా మిగల్లేదు.

జమీందారు తాంబూలం సేవిస్తూ పడక కుర్చీలో పడుకొని వున్నారు. మధ్యమధ్యలో వుమ్మి వూయడానికి వుమ్మి పాత్ర దగ్గరలో వుంచారు. గుమస్తా అక్కడే నిలుచొనివున్నాడు. గుమస్తా పేరు రామకిటావు. రామకిటావు ఫిర్యాదీదారులతో మాట్లాడుతున్నాడు.

సన్నగా పొడవుగా పూర్తి కాకినలుపు క్రైస్తవుడు, తెల్లని పెద్దపెద్ద పళ్లను బయటపెట్టి నవ్వుతున్నాడు. అతడు జమీందారు యెదుట చేతులు జోడించి నిలుచున్నాడు.

"నీవు ఎవరు?" రామకిటావు అడిగాడు.

"సైతాను పమాడీ గుడిసెలో వుండే ఓసేపును నేను." ఓసేపు నోట్లో వున్న పళ్లన్నిట్నీ బయటపెట్టి మరోమారు నవ్వాడు.

"నీకు యేమి కావాలి?"

"నేను ఈ ప్రాంతం నుండి వెంటనే వెళ్లిపోవాలి."

"దానికి ఎవరు అడ్డగిస్తున్నారు? నీవు మీ వూరు వెళ్లడానికి యిక్కడ ఎవరి అనుమతీ అవసరంలేదు." రామకిటావు కటువుగా సమాధానమిచ్చాడు.

"బాబుగారికి చివరిసారిగా వీడ్కోలు తెలుపుకోడానికి వచ్చాను." ఓసేపు మరోమారు జమీందారుకు ప్రణామం చేశాడు.

"సరే, మంచిదే. నీవు వెళ్లటానికి రెడీ అయ్యావన్నమాట. చాలా మంచిది. కానీ ఒక్కమాట, నీ పొలమూ తోటా యేంచేశావు?" జమీందారు అడిగాడు.

"కొద్దిగా నా దగ్గరే వుంచుకున్నాను." ఓసేపు తన చంకలో నున్న కాగితపు పొట్లాన్ని బయటికి తీసి దాన్ని విప్పి జమీందారుకు చూపించాడు.

ఒక సేరు యర్రమట్టి.

"ఒక కిలో మట్టి వుంటుంది." ఓసేపు దాని బరువును అందాసుగా చెప్పాడు." - ఈ సంపదను వెంటతీసుకొని నేను తిరిగి తిరువాన్కూరు వెళుతున్నాను. యీ మట్టే నా నలుగురు పిల్లల్ని, నా ప్రియమైన పెళ్లాన్ని, మూడువేల అయిదు వందల రూపాయలను, నా జీవితంలో అతి విలువైన మూడు సంవత్సరాల కాలాన్ని నాశనం చేసింది. ఈ మట్టిపొట్లాన్ని నా రాజ్యపు ప్రధానమంత్రి అయిన సర్ సి.పి. రామస్వామి అయ్యర్‌కు బహుమతిగా యిస్తాను." [1]ఓసేపు ఆ పొట్లాన్ని చంకలో పెట్టుకొని గట్టిగా నవ్వాడు.

ఆ మనిషి ప్రవర్తన ఆ ముసలి జమీందారుకు, గుమస్తా రామ కిటావుకూ యేమీ బోధపడలేదు. కిటావు అన్నాడు "ఒరే చెట్టన్! నీ బుద్ధి సరిగ్గా పనిచేయడం లేద"నుకుంటాను.

కిటావు అన్నమాటలు పట్టించుకోకుండా ఓసేపు తన బాధలు చెప్పకో సాగాడు. - "మేము తిరువాన్కూరులో రెండు విషయాలకు భయపడి ఇక్కడికి వచ్చాము. ఒకటి పేదరికం, రెండు అక్కడి ప్రధానమంత్రికి. కాని మేము పాడైపోవడానికి ఇక్కడ ముందే మూడు శక్తులు రెడీగా వున్నాయి - ఒకటి గడ్డి, రెండు అడవిపందులు, మూడు మలేరియా. మేము ఆ బ్రాహ్మడికి భయపడి యిక్కడికి వచ్చాము. కానీ యిక్కడి గడ్డి (కలుపు మొక్కలు) పందులు, మలేరియా మమ్మల్ని పూర్తిగా నాశనం చేశాయి. నేను యిప్పుడు బికారిలా వెళ్లిపోతున్నాను. నా పొలాన్ని అమ్మడం మంచిదనిపించడం లేదు. అక్కడ మిగిలిన పంటలను నేనే

1. క్రైస్తవుల అభిప్రాయం ప్రకారం తిరువాన్కూరు ప్రధానమంత్రి సర్ సి.పి. రామస్వామి అయ్యర్ తమకు బద్ధ విరోధులనీ, ఆ కారణంచేతే తమ వూళ్లు వదిలిపెట్టి మలబారు వెళ్లాల్సిన పరిస్థితి యేర్పడింది.

నా చేతుల్తో కోసి కోసి పాడు చేశాను. అంతేకాదు, ఆ నేలలో విషబీజాలు చల్లేశాను. అక్కడ విషవృక్షాలతో నిండిన అడివి పెరగాలని నా కోరిక. ఆ విషవృక్షాలు వీచే గాలులతో ఈ ప్రాంతమంతా విషపూరితం కావాలి. ఎందుకంటే విషభూమిలో విషవృక్షాలు పెరగడమే మంచిది. ఈ మట్టి పాట్లాన్ని తీసుకొని నేను నేరుగా త్రివేంద్రం వెళతాను. అక్కడికి వెళ్లి నేను ప్రధానమంత్రి సి.పి.తో చెబుతాను. "మిస్టర్ స్వామీ! మొదట మా తిరువాన్కూరు క్రైస్తవులంతా మా పాలిట ప్రపంచంలోకల్లా విషతుల్యుడవని నమ్మేవాళ్లం. కానీ ఇప్పుడు నేను నీకంటే కూడా అధిక విషం కలిగిన వస్తువును కనిపెట్టాను. అందుచేత ఈ భయంకరమైన వస్తువును మీకు బహూకరిస్తున్నాను."

"జమీందారుగార్కి నా చివరి ప్రణామం. బహుశా నేను మరో పదేళ్లబాటు బ్రతికివుంటే నేను తప్పకుండా మిమ్మల్ని కలుసుకుంటాను. ఎందుకంటే విషవృక్షాలున్న ఈ అడివిని చూడాలని కోరిక." ఓసేపు మలబారుకు వీడ్కోలు చెప్పాడు.

అతడు మరోమారు తన పళ్లను బయటపెట్టి నవ్వాడు. వెనుతిరిగి లెఫ్ట్, రైట్ అంటూ వెళ్లిపోయాడు. ఆ తర్వాత ఓసేపును ఆ ప్రాంతంలో ఎవరూ చూడలేదు. అతడు తిరువాన్కూరు వెళ్లి డాక్టర్ సి.పి.కి ఆ మట్టిపాట్లాన్ని అందించలేకపోయాడు. ఎందుకంటే అప్పటికి సి.పి. తిరువాన్కూరు నుండి పారిపోయాడు.

ఓసేపు వెళ్లిన తర్వాత మరో సన్నపాటి పొడవైన మనిషి చాలా బాధగా మెట్లు ఎక్కివస్తున్నాడు. కళ్లజోడు పెట్టుకున్నాడు. అతడు బిడియపడుతూ వినయంగా జమీందారు యెదుట నిల్చున్నాడు.

"నీవు ఎవరు?" కిటావు అడిగాడు.

"నా పేరు పాల్. యిక్కడ నాకు అయిదు వందల ఎకరాల భూమివుంది" పాల్ చెప్పాడు.

జమీందారు అతణ్ణి గుర్తుపట్టాడు. రెండేళ్లక్రితం అదే వరండాలోకి వచ్చి కూర్చున్న ఇండియన్ ఇంగ్లీషువాణ్ణి మరిచిపోలేదు. కానీ ఈరోజు అతడి రూపు, పద్ధతీ పూర్తిగా మారిపోయాయి. అతడి వికారమైన ముఖంమీద పొడవైన మచ్చలు కనిపిస్తున్నాయి. ప్రస్తుతం అప్పటి పట్టువస్త్రాలు, రిస్టువాచి, మెళ్లో బంగారుగొలుసూ లేవుగాని ముక్కుమీద పాత కళ్లజోడు మాత్రం మిగిలివుంది.

"వ్యవసాయం బాగా జరుగుతోందా?" జమీందారు అడిగాడు.

"బాబుగారు! నేను ఆ కథనంతా చెప్పే స్థితిలో లేను. నేను సర్వ నాశనమైపోయాను. ఒకవేళ నా ఆరోగ్యం కుదుటబడితే మా వూరు వెళ్లిపోతాను. మీకు మూడువేల అయిదువందల రూపాయలిచ్చి కొన్న భూమి మీద నేను ఎనిమిదివేల రూపాయలు ఖర్చుచేశాను. ఇకదాని మీద ఖర్చుచేసే స్తోమత నాకులేదు. అంచేత అంతా పాడైపోయింది. ఆ పొలాల్ని, తోటల్నీ మీరే తీసుకోండి. మీకు తోచినంత నాకు యివ్వండి."

"పాల్‌కు అయిదువందల రూపాయలిచ్చి దస్తావేజులు తీసుకో" కురూప్పు గుమస్తాతో చెప్పాడు.

"రేపు వుదయాన్నే దస్తావేజులు తీసుకొని యిక్కడికి వచ్చేయి " గుమస్తా పాల్‌కు చెప్పాడు.

పాల్ కురూప్పుకు నమస్కరించి మౌనంగా వెళ్లిపోయాడు.

"రామా! రెండేళ్ల క్రితం ఈ మనిషిని ఎకరా ఆర్రూపాయలు చొప్పున భూమి యిచ్చేటప్పుడు నీవు యేమన్నావో గుర్తుందా?" కురూప్పు నవ్వుతూ తన గుమస్తావైపు వేలు చూపి అడిగాడు.

అప్పుడే సన్నగా పొట్టిగా వున్న మనిషికూడా అక్కడికి వచ్చాడు. అతడి పెద్దపెద్ద కళ్లు పాలిపోయాయి. ఆ మనిషి మధ్య మధ్యలో విపరీతంగా దగ్గుతున్నాడు. అతడు గుండెలమీద చేయి మోపి దగ్గుతూ "బాబుగారూ! నా భూమిని వాపసు తీసుకోండి. మీకు యిష్టమొచ్చినంత యివ్వండి " అన్నాడు.

అతడి బాధ, దుఃఖాన్నీ చూచి జమీందారుకు దయకలిగింది. "ఇతడు ఎవరు? యితడి భూమి ఎక్కడుంది?" జమీందారు గుమస్తాను అడిగాడు.

కిటావు కొద్ది క్షణాలు ఆలోచనలో పడ్డాడు. "ఔను, ఔను! గుర్తుకొచ్చింది. యితడి భూమి కలియన్ మాలా - చక్కరా కొండల దగ్గర వుంది. యితడు చాలా ధైర్యవంతుడు. అతడు మొదట యిక్కడికి వచ్చినప్పుడు అతడివెంట పాతికమంది వున్నారు. వాళ్లందరికీ నాయకుడు ఇతడే. ఆరోజుల్లో యితడు బాగా డబ్బు వున్నవాడు. మంచి వేటగాడుకూడా. కిందటేడు కల్లోరా కొండమీద యితడే రెండు పెద్దపులుల్ని వేటాడి చంపాడు. ఇతడి పేరు వర్కీ" "నీది యేవూరు?"

"ముండక్కయం" వర్కీ ఛాతీమీద రుద్దుకుంటూ చెప్పాడు.

"వర్కీకి మొత్తం యెంత నష్టం జరిగింది?" జమీందారు విచారంగా అడిగాడు.

"పూజ్యులైన బాబుగారూ! నా ముగ్గురు పిల్లలూ, పెళ్లాం చనిపోయారు. ఆరువేల రూపాయల నష్టం జరిగింది. ఇప్పుడు నా దగ్గర కేవలం ఈ శరీరం మాత్రమే మిగిలింది."

"నీ పొలంలో యేమేమి వేశావు?"

"జీడిమామిడి, టొప్పాయి యింకా ఎన్నో వుండేవి. కానీ దాన్ని ఉపయోగించుకొనే యోగం నాకు లేదు."

వర్కీ వణుకుతున్నాడు. అతడి పాలిపోయిన కళ్లు ఎర్రబడసాగాయి. వణుకుతూ, మూలుగుతూ అతడు స్తంభాన్ని పట్టుకొని మెల్లమెల్లగా నేలమీద కూర్చున్నాడు.

"దయచేసి కొద్దిగా వేడినీళ్లు యిప్పించండి" వర్కీ మూలుగుతూ అడిగాడు.

"ఎవరక్కడ? సొంఠి కలిపిన వేణ్ణీళ్లు తీసుకరా" జమీందారు కేకవేశాడు.

సేవకుడు కణ్ణన్ ఒక రాగిచెంబు నిండుకూ సొంఠి కలిపిన వేణ్ణీళ్లు తీసుకవచ్చి యిచ్చాడు.

వర్కీ ఒకే గుక్కలో అన్నీ తాగేశాడు. యింకా నీళ్లు తీసుకరమ్మని సైగచేశాడు. కణ్ణన్ ఓ పెద్ద రాగిపాత్రలో సొంఠి కలిపిన వేణ్ణీళ్లు తెచ్చి ముందు వుంచాడు. వర్కీ తన కళ్లు పెద్దవి చేసి ఆ వేడినీళ్లన్నీ తాగేశాడు.

కిటావు కణ్ణన్‌ను పిలిచి దక్షిణదిశలో వున్న వరండాలో చాప పరచమన్నాడు.

"లేచి అక్కడ పడుకో" కిటావు మెల్లగా వర్కీని నిల్చోబెట్టాడు. వర్కీ చాపమీద పడుకున్నాడు.

జమీందారు భోంచేయడానికి లోపలికి వెళ్లాడు. రామకిటావు ఏదో పాత దస్తావేజు తీసి చదువుతూ పడక కుర్చీలో కూర్చున్నాడు.

వర్కీకి జ్వరం ఎక్కువయింది. వణుకుతున్నాడు. తన గుండె తన స్థానం వదిలి శరీరమంతటిలోను తిరుగుతున్నట్లుంది. ఎముకలన్నీ కరిగి రక్తంలో కలిసిపోయినట్లుంది.

ఒక గంటతర్వాత వర్కీ జ్వరం తగ్గింది. అతడు మెల్లగా లేచి కూర్చున్నాడు. వేడి నీళ్లు తాగుతున్నాడు.

జమీందారు భోంచేసిన తర్వాత కోర్టు విషయాలు చర్చిస్తున్నాడు.

వర్కీ మెల్లగా జమీందారు దగ్గరకు చేరుకున్నాడు.

"ఓ నా స్వామీ! నన్ను రక్షించండి" వర్కీ మూలుగుతూ దగ్గుతూ చెప్పాడు. "లేకపోతే, నేను ఇప్పుడే చచ్చిపోతాను. నాకు యెంతో కొంత సహాయం చేయండి."

జమీందారు రామకిటావుతో చర్చించి వర్కీకి నూరు రుపాయలు ఇవ్వడానికి నిశ్చయించుకున్నాడు.

"దస్తావేజులన్నీ యెక్కడున్నాయి?" కిటావు అడిగాడు.

"తెచ్చాను." వర్కీ మాసిన గుడ్డలో చుట్టిన దస్తావేజులు వరండాలో వుంచాడు.

కిటావు వర్కీ చేతిలో వందరూపాయల నోటు వుంచాడు. తర్వాత కాగితాలమీద సంతకాలు చేయించుకున్నాడు.

వర్కీ వంద రూపాయల నోటు బొడ్లో దోపుకున్నాడు. జమీందారుకు గుమస్తాకు నమస్కరించి సెలవు తీసుకున్నాడు.

అక్కడినుండి కలియస్ కొండ చేరుకోవడానికి మూడు మైళ్లు నడవాలి. తీవ్రంగా ఎండ కాస్తోంది. వర్కీ తలకు తుండుగుడ్డ చుట్టుకొని నీడలాగా తూర్పుదిశగా వెడుతున్నాడు.

కొండదారికి దగ్గర్లో, అక్కడక్కడా అడివినరికి కంచె వేసివుంది. అవి కొత్తగా వలస వచ్చినవారి కర్మ క్షేత్రాలు. ఆ కంచెలకు దగ్గర్లోనే అక్కడక్కడా పాడైపోయిన కంచెలు కూడా కనిపిస్తున్నాయి. అవి పాతవి. ఆ భూముల యజమానులు మలేరియాతోను, అడవిపందులతో విసిగి అక్కడి నుండి పారిపోయారు. అక్కడక్కడా ఖాళీ గుడిసెలూ పాడుపడిపోయిన బావులూ కనిపిస్తున్నాయి.

ఆ అడవి పొలాల్లో మలేరియా సోకి చనిపోయినవారి ఆకారాలు, ప్రతికూల పరిస్థితులను తట్టుకోలేక అన్నీ వదిలేసి వెళ్లిపోయినవారి ఆకారాలు కదులుతున్నట్లుంది. ఆ కొండల్లో వ్యవసాయభూములుగా మార్చుకోవడానికి వాళ్లు డబ్బూ, చెమటను నీళ్లలాగా ఖర్చుపెట్టారు. వుదయం మొదలు సాయంత్రం వరకూ ప్రకృతితో పోరాడేవారు. వారు నేలరాల్చిన ప్రతి స్వేద బిందువూ ఒక స్వర్ణముద్రికను పండిస్తుందని ఆశించారు. కానీ వాళ్ల ఆశలూ అడియాసలే అయ్యాయి. దేవుడు వారి నొసటిమీద వాళ్ల శ్రమకు తగ్గ ఫలితాన్ని రాయలేదు.

వర్కీ కళ్లు చెమ్మగిల్లాయి. అతడు మనసును బాధించే దృశ్యాలను చూస్తూ చూస్తూ తన తోటలోకి చేరుకున్నాడు.

అడివిపందులు పొలాన్నంతా తవ్వి పాడుచేశాయి. జీడిమామిడి, అరటిచెట్లూ కాపుకు వచ్చాయి. వాటిని అతడు తన చెమటా రక్తంతో తడిపాడు. ఇంకా తన గుడిసె ముందు తన పిల్లలు ఆడుకుంటున్నట్లు పగటికలలు కంటున్నాడు. అతడికి ఆ కలలో తన భార్య సారమ్మ పొలంలోకి పనికి వెళ్ళినట్లు కనిపిస్తోంది. వర్కీ తన కళ్లనుండి కారే కన్నీటిని ఆపుకోలేకపోతున్నాడు.

అస్తమించే ఎర్రని సూర్య కిరణాలు అక్కడ పడుతున్నాయి. ఆ ప్రశాంత వాతావరణంలో అతడి చెవులకు యేవో వింత స్వరాలు వినిపిస్తున్నాయి.

అతడు యెక్కడికో వెళ్లటానికి నిలబడ్డాడు. కానీ యెక్కడికి వెళ్లాలో నిర్ణయించుకోలేకపోయాడు. అతడు ఆ ప్రేత భూమివైపు కన్నార్పకుండా చూస్తుండిపోయాడు. ఆ సుందరమైన కొండపాలం వలయంలో తన జీవితం చిక్కుపడిపోయింది. తన కుటుంబీకులంతా ఆ మట్టిలోనే కలిసిపోయారు. ఇప్పుడు అతడు ఎక్కడికి వెళ్లగలడు?

మరుసటిరోజు వుదయం అక్కడే ఓ జీడిచెట్టు కొమ్మకు వర్కీ శరీరం వేలాడుతూ కనిపించింది. అది హత్యకేసు కాదు. ఎందుకంటే జమీందారు యిచ్చిన వంద రూపాయలనోటు యింకా అతడి బొడ్లో సురక్షితంగా వుంది.

# నలభై అయిదు

మాధవి వుదయాన్నే ఇంటి పనంతా పూర్తిచేసింది. ఆమె వరండాలోకి వచ్చి నిల్చుంది.

ఇంట్లో ఆమె ఒక్కతే వుంది. ఆమె మామ కృష్ణన్‌నంబియార్ తూర్పు కొండలపై నున్న పొలాలవైపు వెళ్లాడు. అక్కడ పంటలు కోసే సమయం. పంటంతా కోయించడానికి యింకా నాలుగైదురోజులు పడుతుంది. వాళ్ల మామ్మ తన చిన్న చెల్లెలు కూతురు యింటికి వెళ్లింది. అక్కడికి సుమారు ఆరుమైళ్ల దూరంలో వుంది. అక్కడ విందు చేయడానికి వెళ్లింది. మాధవి దాసి మంజులాకు ఈరోజు సెలవు దొరికింది.

మాధవి ఏదో అసాధారణమైన చికాకుతో వరండాలో అటూ యిటూ పచార్లు చేస్తోంది. ఏమి చేయడానికి తోయక తాంబూలం వేసుకొంది. ఆ తర్వాత జుట్టువిప్పి

వరండాలో స్తంభానికి వీపు ఆనించి తల దువ్వుకుంటూ తూర్పువైపు ముఖం మళ్లించి నిలుచుంది. తూర్పువైపున వున్న కొండమీదికి తాను వెళ్లకూడదు. ఆ వాన కురిసిన రాత్రి జరిగిన ఘటన తర్వాత ఆమె ఏంతోనీకి బద్ధ శత్రువయింది. ఏంతోనీ పవిత్రమైన భావాలను పుణికి పుచ్చుకున్నాడు. కానీ మాధవి ముద్దులతో అతడి ఆశయాలన్నీ బూడిద పాలయ్యాయి. మరోవైపు ఆమెలో రగిలిన దావానలం యింకా ఆరిపోలేదు. ఆనాటి మధురమైన రాత్రులకోసం ఆమె హృదయం విలవిలలాడిపోతోంది. కానీ ఆరోజు నుండీ ఏంతోనీ రెక్కలు విరిగిన పక్షిలా అయిపోయాడు. "ఇకముందు నీ నీడ కూడా యీ కొండమీద పడకూడదు" అని ఆగ్రహించాడు.

మాధవి స్తంభానికి తల ఆనించి విప్పిన కురులను వ్రేళ్లతో సవరించింది. మాధవి ఏంతోనీ బలిష్టమైన శరీరం గురించీ, ఆ రంగులు విరిసిన రాత్రి గురించీ ఊహించుకుంటోంది. కామదేవునివంటి ఆ అందమైన బాలబైరాగిని తన ప్రేమజ్వాలతో వశపరచుకోవాలన్న ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

ఆమె నిరాశతో రక్తంలాంటి వుమ్మిని ముంగిలివైపు వూసింది.

మెల్లమెల్లగా ఆమె పొలాలవైపు దృష్టి మళ్లించింది.

ఆ పొలంలో పంట కోసేశారు. పొలమంతా ఖాళీగా వుంది. అక్కడ గడ్డిమేసే ఆవులన్నీ ఎండవేడికి తట్టుకోలేక చెట్టు నీడన పడుకొని సేద తీర్చుకుంటున్నాయి.

ఆకాశంలో ఎగురుతున్న గద్ద చెట్టుకొమ్మ మీద వాలింది.

మధ్యాహ్నం కావడంవల్ల వాతావరణమంతా నిశ్శబ్దంగా వుంది. నీడలు పొడవుకాసాగాయి.

నిండైన ఆమె యౌవ్వనం, ఆమె హృదయాన్ని మండిస్తోంది. యేదో తెలియని ఆవేదన.

ఆమె వుత్తరదిశలోనున్న పొలాలవైపు చూసింది. మధ్యాహ్నపు నీడలాగా ఓ చిన్న నీడ పొలాల్లోనుండి ఆమెవైపే వస్తోంది.

ఆమె ముఖం ఎర్రబడింది. మందహాసం చేస్తోంది. ఆ నల్లని ఆకారం విల్లులా వంగి చేతికర్ర సహాయంతో అతి కష్టంమీద వరండా మెట్లు ఎక్కింది. ఆ ఆకారం యెండుచేపలా వున్న ఓ ముసలామెది. మోకాళ్లవరకూ ఓ నల్లని చీర కట్టింది. యెండుటాకులాగా ఆమె ముఖం వణుకుతోంది. నెత్తిమీద యెండి చెదిరిన

జుట్టు. మెడలో నల్లదారానికి రుద్రాక్షలు వ్రేలాడుతున్నాయి. కుడివైపు చంకలో తాటాకులతో అల్లిన చిన్నబుట్ట వుంది.

ఆమే 'కరింపాతీ కుంబా' కరింపాతీ పల్లె ముసలి మంత్రగత్తె.

''కుంబా వచ్చింది. చాలా సంతోషం.'' మాధవి ముసలావెను పలకరించింది.

ముసలామె మాధవి మాటలు వినలేదు. ఆమె చెవిటిది. ఆమె తన చిన్న కళ్లతో మాధవిని చూసి మందహాసం చేస్తోంది.

''రా,రా! లోపల గదిలో కూర్చుందాం'' మాధవి ముసలామె చెవిలో గట్టిగా చెప్పింది.

ఇద్దరూ లోపలి గదిలో కూర్చున్నారు.

మాధవి గది తలుపుకు గడియవేసి చాపమీద కూర్చుంది. ముసలామె కర్ర కిందపెట్టి తట్టచేతిలోకి తీసుకొని నేలమీద కూర్చుంది.

''నిన్ను నేను ఎందుకు యిక్కడికి పిలిచానో నీకు తెలుసా?'' మాధవి అడిగింది.

''తెలీదు. కానీ చిన్న దొరసానిగారికి యేదో మోసం జరిగినట్లుంది.''

మాధవి బిగువైన జాకెట్టు కింద నున్నని పొట్టను చూసి సైగచేస్తూ నల్లని నాలుకను బయటపెట్టి అడిగింది. ''అక్కడ యేమీ చొరబడలేదు కదా?''

''లేదు కంబా. అలాంటిదేంలేదు.'' మాధవి తన పొట్టకింది భాగాన్ని తడుతూ చెప్పింది.

''మరి యేం జరిగింది? శత్రువులెవరైనా వున్నారా?''

''మనిషిని చంపాల్సిన అవసరం లేదు. కానీ వశ పరుచుకోవాలి. అందుకే నీ సహాయం కావాలి.''

''మగాణ్ణి వశపరచుకోడానికి నా చిన్న దొరసానికి మందూ మంత్రాలూ ఎందుకూ? కేవలం యీ కళ్లు, యీ ముఖం చాలు. యే మొనగాడైనా వశమైపోతాడు.''

'కేవలం యీ కళ్లూ ముఖమే కాదు, ఎన్నివిధాల ప్రయత్నించినా ఆ మనిషి వశం కావడం లేదు.'' మాధవి విచారంగా చెప్పింది.

''ఎవడా వెధవ? వాడూ ఒక మనిషేనా? ఎవడో చెప్పు.'' కుంబా దవడలు

కదుపుతూ అడిగింది.

"మందు పనిచేయడానికి మనిషి పేరు చెప్పాల్సిన అవసరం లేదుకదా? మంత్రించేటప్పుడే కదా ఆ వివరాలన్నీ కావలసింది?"

"మందూ మంత్రమూ ఒకేసారి ప్రయోగిస్తే పని త్వరగా జరుగుతుంది."

"ఇప్పుడు మందు మాత్రమే ప్రయోగిద్దాం, మంత్రం వద్దు."

"చిన్న దొరసానికి యేది ఇష్టమైతే అదే. ఈ దాసీది కేవలం తెలుసుకోడానికే అడిగింది. యేమైనా ఈ దాసీదానికి తెలిపినంత మాత్రాన యే ప్రమాదమూ జరగదు."

"ఓహో! కంబాతో చెప్పడానికి యే బాధాలేదు. ఆ మనిషి గురించి చెబుతాను. అటు చూడు. ఆ తూర్పుకొండ మీద ఓ సన్యాసి వున్నాడు."

"సన్యాసా? గడ్డమున్న సన్యాసా?"

"మీసాలూ గడ్డాలూ పెరగనేలేదు. చాలా లేత యువకుడు."

"అతడు అక్కడ తపస్సు చేస్తున్నాడా?"

"లేదు, నేనే ఆ యువకుడి కోసం తపస్సు చేస్తున్నాను. అతడు ఓ రైతు."

"వ్యవసాయం చేసుకొనే సన్యాసా?" కంబా ఆశ్చర్యంగా అడిగింది.

"ఔను, దక్షిణాది క్రైస్తవుడు."

"అరే! చెట్టన్?" కంబా భయంతో నాలుక కరుచుకొని, "అయితే, ఏంచేయాలి? ఈ చట్టన్లు దేనికీ వెనుకాడరు. ఈ జంతువులు గుడిని, గుడిలో వున్న లింగాన్ని మట్టిలో కలిపేసే సైతాన్లు. నేను అలాంటి ఇద్దరు సైతాన్లను మంత్రమేసి మట్టిలో కలిపేశాను. ఒకణ్ణి పిచ్చివాణ్ణిగా చేశాను. చిన్న దొరసాని అలాంటి సైతాన్ను ప్రేమించడం మంచిదికాదు."

"కుంబా! ఆ యువకుడు చెరుకు గడలాగా చాలా బలంగా మజాగా వుంటాడు. కానీ అతడు గుండెల్లో మతమనే బలమైన కోటను కట్టుకున్నాడు. ఆ కోటలోకి వెళ్లే మార్గమే లేదు. అతడు స్త్రీలను చూస్తూనే కళ్లు మూసుకొని ఏసునామ స్మరణం మొదలెడతాడు. అయినా అతణ్ణి ఓసారి వశపరచుకున్నాను."

మాధవి వర్షం కురిసిన రాత్రి జరిగిన ఘటన గురించి వివరంగా చెప్పింది. అది విని ముసలామె తన బోసినోటిని చూపిస్తూ చాలాసేపు నవ్వింది.

"మరో స్త్రీ వాసనకూడా ఆ యువకుడిమీద పడలేదు. నేను అతణ్ణి నా బానిసగా చేసుకోవాలనుకుంటున్నాను. అతడి పొందుకోసం నా హృదయం మండి

మసైపోతోంది. కుంబా నా కోరిక తీర్చు." మెరిసే కళ్లతో మాధవి అడిగింది.

కుంబా కొంతసేపు ఆలోచనలో పడింది. ఆమె కింది దవడను ఛాతీకి ఆనించి నోరు తెరిచి మౌనంగా కూర్చుంది. తర్వాత మెల్లగా తట్టలో చేయి వేసింది. అందులోంచి చిన్న చిన్న సీసాలు, వనమూలికలూ బయటకు తీయసాగింది.

ఓ చిన్న సీసా తీసుకొని మూత తెరిచి ముక్కుతో వాసన చూసింది. ఇది పులి నాలుకతో తయారుచేసిన చూర్ణం. దీనికి మించిన విషం పాతాళంలో కూడా దొరకదు.

ఆ సీసాకు మూత బిగించి పక్కన పెట్టింది. మరో సీసాను చేతిలోకి తీసుకుంది.

"ఈ తైలం పంది పండ్లతో తయారయింది. ఇందులోంచి ఒక్క బొట్టు నోట్లో వేస్తే చాలు ఎనిమిదో మాసం గర్భం కూడా పడిపోతుంది. చిన్న దొరసానికి దీనితో యేమైనా అవసరం వుంటుందో ఏమోనని తీసుకువచ్చా... చిన్న దొరసానికి కావలసింది యిక్కడుంది. వశీకరణ చూర్ణం."

కుంబా ఓ చిన్న సీసా చేతిలోకి తీసుకొని అంది. "దీంట్లోది అరతులం అన్నంలో కలిపి తినిపిస్తే ఇక చూడు మగాడు ముంగీస, పాముతో కూడా కలవడానికి ఉత్తేజితుడౌతాడు."

మాధవి చేయి చాచి ఆ సీసా తీసికొంది.

"ఇదే మరో సీసా కూడా యివ్వు." మాధవి రెండోసారి చేయి ముందుకు చాచింది. కుంబా తలవూపి వద్దంది.

"యిది చాలు. మోతాదు ఎక్కువయితే మనిషి పిచ్చివాడైపోతాడు."

"నేను జాగ్రత్తగా వాడతాను. మరో సీసా నా దగ్గర వుంచుకుంటాను" మాధవి మొండికేసింది. కుంబా తట్టలో చేయి పెట్టి మరో సీసా మాధవికి యిచ్చింది. ఓ పొట్లం మాధవికి యిస్తూ "చిన్న దొరసానీ దీన్నికూడా దగ్గరుంచుకోండి. ఇది కాటుక. సిరాలా వున్న యీ కాటుకను మీ కళ్ళకు రాసుకొని నీవు కోరిన మగాణ్ణి ఒకసారి చూస్తే చాలు వాడు కప్పలాగా నీ వెంట దుముకుతూ వచ్చేయగలడు."

మాధవి ఆ పొట్లాన్ని జాగ్రత్తగా వుంచుకొంది.

కుంబా తక్కిన పొట్లాలను, సీసాలను తన తట్టలోకి సర్దుకొని వెళ్లటానికి సిద్ధమయింది.

మాధవి లేచి తన పెట్టె తెరిచింది. అందులోంచి ఓ కొత్త చీర, ఓ రూపాయి తీసి కుంబాకు యిచ్చింది. కుంబా చేతులు జోడించి వాటిని తీసుకొంది.

"చిన్న దొరసానీ! నీ బానిసదాన్ని వెళ్లొస్తా. కరింపాతీ కుంబా మళ్లీ మీ అందమైన ముఖాన్ని చూడగలుగుతుందో లేదో? అందాకా నేను బతుకుతానో చస్తానో తెలీదు, చాలా ముసలిదాన్నయ్యాను. కుంబా బతికే వుంటే వచ్చే సంవత్సరం పంటల సమయానికి తప్పకుండా వస్తుంది."

"కుంబా నీవు చాలా దుఃఖంతో వున్నావు." మాధవి ఓదార్చుతూ అంది. "కుంబా బాధపడకు. యింకో పాతికేళ్లు బతుకుతావు. నేను అనుకున్న కార్యం జరగాలేగాని నీకు పెద్ద యినాము యిప్పించడానికి తప్పకుండా పిలిపిస్తాను. అప్పుడు యిక్కడికి తప్పక రావాలి. వినపడిందా?"

మాధవి కుంబాతోపాటు ముంగిలివరకూ వచ్చింది.

కుంబా వణుకుతున్న కాళ్లతో వెళ్లిపోతోంది. మాధవి ద్వారం దగ్గరే నిలుచుంది.

తక్షణం ఆమె కళ్లు తూర్పు కొండలపై పడ్డాయి. ఏంతోనీ కొండమీది నుంచి దిగుతున్నాడు.

ఏంతోనీ చొక్కా వేసుకొని వున్నాడు. ఏంతోనీ యిప్పుడు వాళ్ల బాబాయి చెరియన్ యింటికి వెడుతున్నాడని మాధవికి తెలిసిపోయింది.

ఏంతోనీ కొండదిగి పొలాలు దాటుకొని మరో కొండలోయలో అదృశ్యమయ్యేంత వరకూ ఆమె అతణ్ణి చూస్తూ వుండిపోయింది.

తర్వాత ఆమె తన గదిలోకి వెళ్లి మందులు చేతికి తీసుకొని పరీక్షగా చూస్తోంది.

మాధవికి ఆ మందుమీదా, ఆ మందు తయారుచేసిన ముసలి మంత్రగత్తెమీదా మంచి గురివుంది. కుంబాకు తెలిసినన్ని ఔషధాలూ, వనమూలికలూ ప్రపంచంలో మరెవ్వరికీ తెలియవు. కుంబా తండ్రి కూడా ఓ పేరుమోసిన మంత్రగాడు, వైద్యుడు. అది కరింపాలా కుటుంబానికే పరిమితమైన రహస్య విద్య.

మాధవి కొంతసేపు తర్వాత స్నానం చేయడానికి చెరువుకు వెళ్లింది. స్నానం చేసిన తర్వాత బట్టలు కట్టుకొని తిరిగి యింటికి బయలుదేరింది. సంపెంగ పూలు

తుంచి తల్లో పెట్టుకుంది. తర్వాత నాలుగువైపులా చూసింది.

ఆమె పొలాల వెంబడి తూర్పు వైపునున్న తొండియాన్ కొండమీదికి ఎక్కి ఏంతోనీ యిల్లు చేరుకుంది. ఏంతోనీ పిల్లి వంటగది దగ్గరే పడుకొనివుంది. గుడిసెలో ఎవ్వరూ లేరు.

మాధవి వంటగదిలోకి వెళ్లి గిన్నెలు మూతలు తెరిచి చూసింది. ఓ మట్టిపాత్రలో అన్నం వండివుంది. మరోపాత్రలో కర్రపెండలం కూర.

మాధవి కూరపాత్రలో తాను తెచ్చిన సీసా మూత తీసి చూర్ణం వేసి వేలితో బాగా కలిపేసింది. తర్వాత యథాప్రకారం మూత మూసి త్వరగా బయటికి వచ్చింది. ఒకసారి బయట నలువైపులా చూసింది. ఎవ్వరూ లేరు. చకచకా కొండదిగి కిందికి వచ్చింది. కిందలోయలో పొయ్యిలోకి కర్రలు ఏరుకొని తన యిల్లు చేరుకుంది.

## నలభై ఆరు

ఏంతోనీ జాన్ బంగళా చేరుకున్నాడు. అక్కడ వర్కీ ఒక్కడే వున్నాడు. జాన్, వర్గీసు, చెరియన్ కలిసి ఒక కొత్త వ్యక్తితో పాటు వేటాడ్డానికి అడివిలోకి వెళ్లారని వర్కీ చెప్పాడు.

"బాబాయిగారు యీ రోజు వాపసు వస్తారా?" ఏంతోనీ కొంచెం నిరాశగా అడిగాడు.

"తెలీదు. బహుశా రావచ్చు. అరబ్బుల కొండలవైపు వెళ్లారు."

"నేను వెంటనే బాబాయిని కలుసుకోవాలి. బాబాయి చాలా రోజులుగా మా పొలం చూడ్డానికి రాలేదు."

"ఎందుకనీ? అక్కడ విశేషాలేమిటి? వ్యవసాయం బాగానే జరుగుతోంది కదా?"

"కూలీలు దొరకడం లేదు. కర్రపెండలం కోతకు వచ్చింది."

"చెరియన్ రేపు వుదయానికల్లా తప్పకుండా వస్తారు. ఏంతోనీ ఈరోజు యిక్కడే వుంటావు కదూ?"

"వెళ్లాలి గుడిసెలో యెవ్వరూ లేరు."

"అలాగా! నీవు బాధపడకు. నేను అక్కడికి వెళతాను. నేను యెటూ వేటకు వెళ్లాలనుకుంటున్నాను. తొండియాన్ కొండల్లోకి సాంబార్ లేళ్లు వస్తుంటాయని

విన్నాను. కనీసం ఒకదాన్నైనా పట్టాలి. రాత్రికి ఏంతోనీ గుడిసెలో పడుకుంటాను."

ఏంతోనీ నిర్వికారంగా వర్కీ వైపు చూశాడు.

"నేను వేటకు వెళితే యీ బంగళాలో ఎవరూ వుండరు. తొమ్మన్ నౌకరు కూడా పట్నం వెళ్లాడు. ఏంతోనీ! నీవు ఈరాత్రికి యిక్కడే నిశ్చింతగా విశ్రాంతి తీసుకో. వేటాడి నేను ఏంతోనీ గుడిసెలో పడుకుంటాను. సరేనా?" ఏంతోనీ వద్దని చెప్పలేకపోయాడు.

"అక్కడ గుడిసెలో తినడానికి ఏమైనా వుందా?" వర్కీ అడిగాడు.

"కర్రపెండలం కూర, అన్నం వండి పెట్టాను."

"చాలు, అంతకంటే యింకేం కావాలి."

వర్కీ లేచి బట్టలు మార్చుకుంటున్నాడు. నిక్కరు, నీలంరంగు బనీను, బూట్లు వేసుకొని తుపాకీ, గుండ్లు, టార్చిలైటు వగైరా తీసుకొని బయలుదేరాడు.

"నేను రేపు వుదయం యిక్కడికి వస్తూనే నీవు వెళ్లిపోదువు. లేడి మాంసం వండికొని తిందాం. అప్పటికి చెరియన్‌కూడా వచ్చేస్తాడు."

"నన్ను బాబాయి గుడిసెకు వెళ్లమంటారా?" ఏంతోనీ అడిగాడు.

"వద్దు, ఒంటరిగా అక్కడికి వెళ్లకు. ఈమధ్య అక్కడికి అడవి ఏనుగులు వస్తున్నాయి. అక్కడ భూత-ప్రేతాలు కూడా తిరుగుతున్నాయని చెరియన్ చెప్పాడు. అందుకే చెరియన్ కూడా బొత్తిగా వెళ్లటంలేదు. ఇప్పుడు చెరియన్ ఇక్కడే పడుకుంటున్నాడు. ఏంతోనీ నీవు నా గదిలో పడుకో. నా కోసం వండిన భోజనం నువ్వు తిను." అని చెప్పి వర్కీ ముంగిలి దిగి నేరుగా దక్షిణదిశగా వెళ్లిపోయాడు.

సాయంకాలానికి వర్కీ ఏంతోనీ గుడిసె చేరుకున్నాడు.

తాను ఆ రోజు చూసిన అమ్మాయికీ ఏంతోనీకి మధ్య ప్రేమ సంబంధం వుందనీ, ప్రతి రాత్రీ ఆమె ఏంతోనీ గుడిసెకు వస్తుంటుందనీ వర్కీకి గట్టి నమ్మకం కుదిరింది. ఒకవేళ ఆ అమ్మాయి ఆ రాత్రికి వస్తే తన పని సులువుగా నెరవేరుతుందనుకున్నాడు. ఆ అమ్మాయి రాత్రి పది గంటలకు లోపల వచ్చేస్తే తన అదృష్టం పండినట్లే. ఓ వేళ రాకపోతే ధైర్యం చేసి తానే స్వయంగా వాళ్ల యింటికి వెళ్లి ఆనందించాలని ఆ కాముకుడి ఆలోచన. ఏ స్త్రీయైనా కనకానికీ, కాసుకూ లోబడిపోతుందని అతడి అభిప్రాయం. మాధవిని లోబరుచుకోవడానికి ఓ తులం బంగారం తన దగ్గర వుంచుకున్నాడు.

వర్కీ తుపాకీని, యితర వస్తువులను చాప కింద దాచివుంచాడు. దీపం వెలిగించి ఓసారి గుడిసెనంతటినీ పరిశీలనగా చూశాడు. తర్వాత దీపం తీసుకొని వంటగదిలోకి వెళ్లాడు. ఏంతోనీ చెప్పినట్లు భోజనం రెడీగా వుంది. భోంచేసిన తర్వాత చాపమీద కంబళి కప్పుకొని నిద్రిస్తున్నట్లు నటించాలి అని తనలో తాను అనుకున్నాడు. అతడు అన్నం, కర్రపెండలం కూర తినసాగాడు.

# నలభై యేడు

మెత్తని పట్టు పరుపుపై పడుకోవడం వల్ల ఏంతోనీకి నిద్రపట్టలేదు. అతడికి చెక్కబల్లమీద పడుకోవడం అలవాటు. అర్ధరాత్రి వరకూ అటూ యిటూ దొర్లుతున్నాడు. కానీ నిద్రపట్టలేదు. చివరకు లేచి నేలమీద దుప్పటిపరిచి దానిమీద నిద్రపోయాడు.

యథాప్రకారం ఏంతోనీ వుదయం అయిదు గంటలకల్లా లేచి పొద్దు పొడిచేవరకూ దైవప్రార్థన చేసుకున్నాడు.

ఎవరోవకరు వచ్చేంతవరకూ బంగళా విడిచి వెళ్లడం మంచిదికాదనుకున్నాడు. వుదయం పదిగంటలయింది. కానీ వర్కీ రాలేదు. సాయంత్రానికి నౌకరు తొమ్మన్ వచ్చేశాడు. కానీ వర్కీ వచ్చేంతవరకూ బంగళా విడిచి వెళ్లడం మంచిది కాదనుకున్నాడు. అందుచేత విధిలేక ఏంతోనీ ఆ రాత్రికూడా అక్కడే గడిపాడు.

ఆ మరసటిరోజు వుదయాన్నే నిరాశగా ఏంతోనీ, తొండియన్ కొండకు బయలుదేరాడు.

యింతవరకూ వర్కీ, చెట్టన్ ఎందుకు తిరిగి రాలేదని అతడి మనసులో భయం పట్టుకుంది. ఏంతోనీ ఎప్పుడూ వరసగా రెండు రోజులపాటు తన పొలమూ గుడిసెను వదిలి మరోచోట గడపలేదు. వర్కీ ఆరోజు అంత పట్టుదలగా వుండమని చెప్పకపోతే సాయంత్రానికే తన గుడిసె చేరుకొని వుండేవాడు.

అతడి హృదయంలో భయంకరమైన ఆలోచనలు చెలరేగాయి. తన గుడిసెలో యేమైనా ప్రమాదం జరిగిందేమో అని అనుమానం కలిగింది. ప్రభువును స్మరిస్తూ అతడు అక్కడినుండి బయలుదేరాడు.

ఏంతోనీ కులియన్ కొండకింది మలుపు చేరుకున్నాడో లేదో ఓ జీడిమామిడి చెట్టుకింద ఓ చిన్నపిల్ల యేడుస్తోంది.

ఏంతోనీ ఆ పిల్ల దగ్గరకు వెళ్లి ఆశ్చర్యపోయాడు. ఆ అమ్మాయి మార్టిన్ చెట్టన్ కూతురు.

"పాపా, నీవెందుకు యిక్కడ నిలుచొని యేడుస్తున్నావు?" ఏంతోనీ మేరీకుట్టీ భుజంమీద చేయి వేసి బుజ్జగిస్తూ అడిగాడు.

"అమ్మ వంట్లో బాగాలేదు. రక్తంతో తడిసిపోయింది. పిలిస్తే పలకడంలేదు." మేరీకుట్టీ ఏడుస్తూ చెప్పింది.

"హే ప్రభూ! ఏమయింది, పాపా నాన్నగారు అక్కడ లేరా?"

"నాన్నగారు ముందే ఎక్కడికో వెళ్లిపోయారు. డాక్టరును పిలవడానికి ఇంట్లో ఎవరూ లేరు. పిలిచినా అమ్మ పలకడంలేదు." ఆ అమ్మాయి వెక్కి వెక్కి యేడుస్తోంది.

"పాపా, నీవు ఏడవకు. బహుశా అమ్మ అలిసిపోయి మాట్లాడలేదేమో. నీవు నాతోపాటు రా. వెళ్లిచూద్దాం."

ఏంతోనీ, మేరీకుట్టీ కొండ ఎక్కి గుడిసెవైపు బయలుదేరారు. జాన్‌కుట్టీ ఏడస్తూ వరండాలో నిల్చొని వున్నాడు.

గుడిసె లోపలి దృశ్యం చూసి ఏంతోనీ స్పృహ తప్పి పడిపోయాడు. మరియమ్మ కండ్లు మూసుకొని పడివుంది. ఆమె బట్టలు రక్తంతో తడిసి శరీరానికి అంటుకుపోయాయి. ఎవరో ఆమె పొట్టలో కత్తితో పొడిచి చంపినట్లుంది.

ఏంతోనీకి, ఆమె చావుకు గల కారణం తెలియలేదు. అతడు మరియమ్మ నాడి పరిశీలించాడు. శ్వాస ఆర్థంలేదు.

"పాపా, నీవు యిక్కడే వుండు. నేను వెళ్లి డాక్టర్ను తీసుకవస్తా." ఏంతోనీ మేరీకుట్టీని అక్కడ వదిలి డాక్టర్ను పిలవడానికి పరుగుతీశాడు.

అక్కడికి మూడు మైళ్లదూరంలో డాక్టర్ థామస్ యిల్లు వుంది. ఏంతోనీ త్వరత్వరగా అడివిని, కొండనూ దాటాడు. డాక్టర్ను కలుసుకొని వివరంగా చెప్పాడు. డాక్టర్ వెంటనే ఏంతోనీతోపాటు బయలుదేరాడు.

డాక్టర్ మరియమ్మను పరీక్షచేసి తలవంచుకొని గది బయటకు వచ్చాడు.

"ఆమె చనిపోయింది." డాక్టరు సబ్బుతో చేయి కడుక్కుంటూ ఏంతోనీతో చెప్పాడు.

"అలాగా! మరియమ్మవదిన చనిపోయిందా? నేను పోలీసులకు

కబురుచేస్తాను." మరియమ్మను ఎవరో కత్తితో పొడిచి చంపారని ఏంతోనీ భావించాడు.

"ఇది ఒక హత్య."

"ఆ ఆడమనిషిని ఎవరూ ముట్టుకోలేదయ్యా. గర్భపాతం వల్ల చనిపోయింది. బహుశా ఆమె గర్భంతో వున్నప్పుడు క్వినైన్‌మాత్రలు అధికంగా వాడి వుంటుంది. మానం దగ్గర పుండు సెప్టిక్ అయ్యింది."

ఏంతోనీకి యివన్నీ కొత్త విషయాలు. అతడు మౌనంగా నిలుచొని వింటున్నాడు.

డాక్టరు, ఏంతోనీ బయటకు నడిచారు. డాక్టరు తన యింటివైపు, ఏంతోనీ చర్చికి వెళ్లారు.

ఫాదర్ చుల్లి పరంబన్ ఏంతోనీ చెప్పిందంతా జాగ్రత్తగా విన్నాడు. తర్వాత ఫాదర్ చేయి పైకెత్తి "ఆ మార్టినేనా, ఓసారి ఏసుప్రభువు విగ్రహం మీదికి రాళ్లు విసిరింది. అతడు మహాపాపి " అన్నాడు.

"అతడి సంగతి నాకు తెలీదు. కానీ మరియమ్మవదిన ఓ పవిత్ర ఆత్మ. అనునిత్యం ప్రభువుని సేవించేది." ఏంతోనీ కరుణస్వరంతో అన్నాడు.

"ఆమె నాకు బాగా తెలుసు" ఫాదర్ గడ్డం సవరించుకొంటూ అన్నాడు.

"మరియమ్మ అంతిమ సంస్కారానికయ్యే ఖర్చంతా మేం భరిస్తాం."

ఏంతోనీ పురోహితునికి ధన్యవాదాలు తెలిపి నమస్కరించి తిరిగి వచ్చాడు.

అతడు మళ్లీ తన గుడిసె గురించీ, వర్కీ గురించి ఆలోచనలో పడ్డాడు. అతడు చాలావేగంగా తన కొండవైపు వెళ్లసాగాడు.

దారిలో పాల్ గుమస్తా పాపచ్చన్ ఏంతోనీని ఆపాడు.

"ఏంతోనీ, ఎక్కణ్ణుంచి వస్తున్నావు?"

ఏంతోనీ దుఃఖంతో మరియమ్మ వదిన చావు గురించి చెప్పాడు.

"నీవు మీ బాబాయి గురించి యేమీ వినలేదా?" పాపచ్చన్ అడిగాడు.

"లేదు, లేదు! మా బాబాయి జాన్‌గారితో పాటు వేటాడ్డానికి వెళ్లాడు. కానీ యింకా తిరిగి రాలేదు."

"నీ బాబాయిని పోలీసుస్టేషన్‌లో బంధించారు. అతడు దొంగనోట్లు తయారుచేస్తూ పట్టుబడ్డాడు. అతడి దొంగపనులన్నీ పోలీసులకు తెలిసి పోయాయి.

ఈరోజు వుదయాన్నే పోలీసులు చెరియన్‌ని పోలీస్‌స్టేషన్‌కు తీసుకువెళ్లారు.''

ఏంతోనీ యిది విని అన్నీ మరిచి బొమ్మలాగా నిలుచుండిపోయాడు.

"వాళ్లు మార్టిన్‌ను కూడా పట్టుకపోయారు. వర్గీసును ఎవరో అడివిలో తుపాకీతో కాల్చి చంపారు. మార్టిన్, చెరియన్-యిద్దరూ కలిసి వర్గీసును చంపారని అనుకుంటున్నారు.''

పాపచ్చన్ చెప్పినదంతా ఏంతోనీ విన్నాడు. కానీ ఒకేసారి యిన్ని బాధాకరమైన వార్తలను సహించగలిగే శక్తి ఏంతోనీకి లేదు.

"పాపచ్చన్ చెట్టన్, ఇప్పుడు నేను యేంచేయాలి?'' ఏంతోనీ వెక్కి వెక్కి ఏడవసాగాడు.

"అన్నిటికంటే ముందు నీవు పోలీసుస్టేషన్‌కెళ్లి మీ బాబాయిని కలుసుకో.'' పాపచ్చన్ అతడికి సలహా యిచ్చాడు.

ఏంతోనీ పోలీసుస్టేషన్‌వైపు పరుగుతీశాడు. పోలీసుస్టేషన్ అక్కడికి సుమారు ఆరుమైళ్ల దూరంలో వుంది. అంత దూరమూ పరుగుతీసి చేరుకున్నాడు.

అతడు పోలీసుస్టేషన్ చేరుకొని ఓ పోలీసు కానిస్టేబుల్‌ని తన బాబాయి గురించి అడిగాడు. చెరియన్ లాకప్‌లో వున్నాడని సాయంత్రం ఆరుగంటల వరకూ ఎవరినీ అతడితో కలుసుకోనివ్వవద్దని ఇన్‌స్పెక్టర్ ఆజ్ఞాపించి వెళ్లారని ఆ కానిస్టేబుల్ చెప్పాడు.''

ఏంతోనీ పోలీసుస్టేషన్ వరండాలో నిరీక్షిస్తూ గడిపాడు.

ఆరుగంటలకు ఇన్‌స్పెక్టరు పోలీసేస్టేషన్ చేరుకున్నాడు.

ఏంతోనీ, ఓ కానిస్టేబుల్ వెంట తన బాబాయి సబ్ ఇన్‌స్పెక్టర్ గదిలోకి వెళ్లడం చూశాడు. ఆరున్నర గంటలకు ఇన్‌స్పెక్టరు బయటికి వచ్చాడు.

ఏంతోనీ వినయంగా ఇన్‌స్పెక్టరుకు నమస్కరించి "చెరియన్ మా బాబాయి. నన్ను ఓ సారి ఆయనతో కలుసుకోనిస్తారా?'' అని అడిగాడు.

"మాట్లాడ్డానికి అయిదు నిముషాలే టయిముంది.''

చెరియన్ కొడుకుతో మనసువిప్పి మాట్లాడలేదు. "నీవు గుడిసెలోనే వుండు. కోర్టు జడ్జిమెంటు యిచ్చేంతవరకూ నీవు నన్ను కలుసుకోడానికి రావద్దు. నేను దేవుడు విధించే శిక్షకోసం ఎదురు చూస్తుంటాను.''

ఏంతోనీ ఏడుస్తూ తిరిగివచ్చాడు. పోలీసుస్టేషన్ ఎదురుగా ఏంతోనీ

జాన్‌గారిని కలుసుకున్నాడు. జాన్, మార్టిన్‌ను జామీను మీద విడిపించుకెళ్లడానికి వచ్చాడు.

"నీ బాబాయి మాకూ చెడ్డపేరు తెచ్చాడు. అతడు ఓ విషసర్పమని మాకు తెలీదు " జాన్ కోపంగా అన్నాడు.

ఏంతోనీ యేమీ మాట్లాడలేదు, కేవలం అరిచేతులతో కళ్లు మూసుకొని ఏడుస్తూ నిలబడ్డాడు.

ఏంతోనీ ఓ శవంలాగా అడివి కాలిబాట మీద నడుచుకుంటూ వెళుతున్నాడు. బాగా చీకటిగా వుంది. అక్కడి నుండి గుడిసె ఏడుమైళ్లు దూరంలో వుంది. అంతా కాలిబాటే.

అతడి భవిష్యత్తు ఆ చీకటి అడివికంటే నల్లగా కనిపిస్తోంది.

రాత్రి పదిగంటలకు అతడు తన గుడిసె చేరుకున్నాడు. బాగా అలసిపోయి, మానసిక వ్యథతో కుంగిపోయిన ఏంతోనీ తన పక్కమీద పడుకోబోయాడు. తన పక్కమీద మరెవ్వరో పడుకొని వున్నట్లనిపించింది.

ఏంతోనీ దీపం వెలిగించి చూశాడు. వర్కీ తన చాపమీద చచ్చి పడివున్నాడు! ఆ శవం దుర్వాసన కొడుతోంది.

## నలభై యెనిమిది

అర్ధరాత్రి అయింది. జాన్ మంచి నిద్రలో వున్నాడు.

తలుపు కొడుతున్న చప్పుడు వినిపిస్తోంది. జాన్ కళ్లు తెరిచాడు. "ఎవరూ?" అని పిలిచాడు.

"నేను, ఏంతోనీని." భయమూ, అలసటతో హీనస్వరంతో జవాబిచ్చాడు.

జాన్ దీపం వెలిగించి తలుపు తెరిచాడు. ఏంతోనీ ద్వారంమీద పడబోయాడు.

"ఏంతోనీ, ఏమయింది?" జాన్ ఏంతోనీని పట్టుకొని అడిగాడు.

"వర్కీగారు నా గుడిసెలో చాపమీద చనిపోయి పడివున్నాడు..." ఏంతోనీ యింతకంటె యెక్కువ చెప్పలేకపోయాడు. స్పృహ తప్పి జాన్ రొమ్ము మీద పడిపోయాడు.

జాన్ ఏంతోనీని ఎత్తుకొని పక్కమీద పడుకోబెట్టాడు. అతడు నౌకరు

తొమ్మన్‌ను లేపి ఏంతోనీకి సపర్యలు చేస్తూండమని ఆదేశించాడు.

జాన్ కూడా తెల్లవారేంతవరకూ మేలుకొని వున్నాడు. తెల్లవారుఝామునే పోలీసులకు కబురు చేయడానికి పోలీసుస్టేషన్‌కు బయలుదేరాడు.

ఇన్‌స్పెక్టరుకు జాన్ వర్కీ చావుగురించి చెప్పాడు. వెంటనే ఇన్‌స్పెక్టరు ఇద్దరు కానిస్టేబుళ్లను వెంటతీసుకొని జాన్‌తో పాటు తొండియన్ కొండవైపు బయలుదేరాడు.

వర్కీ శవం దుర్వాసన కొడుతోంది. ఇన్‌స్పెక్టరు గుడిసెలోపలా, చుట్టుప్రక్కలా జాగ్రత్తగా పరిశోధించాడు. వర్కీ తుపాకీ, సంచులూ వగైరా చాపకింద దొరికాయి. వర్కీ బంగారు రిస్టువాచి మణికట్టుకు వుంది. ప్యాంటుజేబులో పర్సు వుంది. అతడు పర్సు విప్పి చూశాడు. అందులో ఓ బంగారు నాణెం, పది రూపాయలనోట్లు సుమారు వందదాకా వుంటాయి. కొంత చిల్లర డబ్బులుకూడా వున్నాయి. పర్సు సైడుపాకెట్‌లో ఓ క్రైస్తవ అమ్మాయి ఫొటో వుంది.

"ఇది హత్యకాదు." ఇన్‌స్పెక్టరు అన్నాడు.

వంటగది బయట ఓ మూలగా పిల్లి చచ్చి పడివుంది. దాన్ని ఓ కానిస్టేబుల్ కనుగొన్నాడు. ఇన్‌స్పెక్టరు అక్కడికి వెళ్లి చూశాడు. పిల్లి శవంకూడా చెడువాసన కొడుతోంది. వంటగదిలో పాత్రలో వున్న కూరలో యేదో నల్లగా జిగట పదార్థం కనిపించింది. ఇన్‌స్పెక్టరు ఆ కూరను జాగ్రత్తగా పరిశీలించాడు.

"యిది కర్రపెండలం కూర. బహుశా యీ కూర తినడంవల్లే వర్కీ, యీ పిల్లీ చనిపోయి వుంటారు. ఇందులో యేదో విషపదార్థం పడివుంటుంది." ఇన్‌స్పెక్టరు తన సందేహాన్ని వ్యక్తపరచాడు.

జాన్‌కూడా ఇన్‌స్పెక్టరు అనుమానాన్ని సమర్థించాడు.

"ఇక ఆలశ్యం చేయొద్దు. శవానికి ఈరోజే అంత్యక్రియలు యేర్పాటు చేయండి." ఇన్‌స్పెక్టరు జాన్‌తో చెప్పాడు.

ఏంతోనీ జాన్ బంగళాలో పక్కమీది నుంచి లేచి కూర్చొని బయటకు చూస్తున్నాడు.

ఇంకా అతడి మెదడు మొద్దుబారి వుంది. అతడి మనసులో కలల మాదిరి అస్పష్టమైన ఆలోచనలు చెలరేగుతున్నాయి.

బంగళావున్న కొండకు దిగువగా కాలిబాటమీద మనుషులు వెడుతున్నారు.

ముందు ఒక నల్లపెట్టె వుంది. అప్పుడప్పుడూ దుఃఖంతో కూడిన ప్రార్థన వినిపిస్తోంది.

మరియమ్మ శవాన్ని స్మశానంవైపు తీసుకవెళుతున్నారు.

ఆరోజు సాయంత్రం కూడా అదే స్థానంలో కూర్చొని వర్కీ శవాన్ని మోసుకువెళ్లడం చూశాడు.

రెండోరోజు వుదయాన్నే ఏంతోనీ తన గుడిసె చేరుకున్నాడు. అక్కడ ఒంటరిగా వుండటానికి అతడికి భయంగావుంది. కానీ అక్కడి నుండి దూరంగా వెళ్లిపోవడానికి మరో మార్గం కూడా లేదు.

మరియమ్మను స్మశానంలో పాతిపెట్టినరోజు రాత్రివూట మార్టిన్ గుడిసెలోపల అన్నివైపులా తవ్విచూశాడు. మరియమ్మ డబ్బూ, బంగారమూ గుడిసెలోనే యెక్కడో దాచిపెట్టి వుంటుందని మార్టిన్‌కి గట్టి నమ్మకం. మోకాటిలోతు తవ్వినప్పటికీ మార్టిన్‌కు మరియమ్మ ఖజానా దొరకలేదు. అతడు నిరాశ చెంది అలసటతో పడుకున్నాడు.

మార్టిన్ మరుసటిరోజు వుదయాన్నే మెల్లగా కళ్లు తెరిచాడు. వంట చేయడానికీ, తనను నిద్రలేపడానికీ యిప్పుడు యెవరూలేరు. మార్టిన్ మరియమ్మను గుర్తుకు తెచ్చుకొని యేడవసాగాడు.

అతడు మేరీకుట్టీని పిలిచాడు. ఆ అమ్మాయి తమ్ముడు జాన్‌కుట్టీతో పాటు చాపమీద పడుకొని నిద్రపోతోంది.

జాన్‌కుట్టీ నిద్రమేల్కొని ఏడుస్తున్నాడు. మార్టిన్ జాన్‌ను ఎత్తుకొని బుజ్జగిస్తూ మేరీకుట్టీని లేపడానికి ప్రయత్నించాడు. కానీ బొత్తిగా లేవడంలేదు. మార్టిన్ భయపడ్డాడు. మేరీకుట్టీ వళ్లు తాకి చూశాడు. వేడిగా కాలిపోతోంది.

మార్టిన్ మేరీని లేపడానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ అతడి ప్రయత్నం ఫలించలేదు.

ఏడుస్తున్న జాన్‌కుట్టీని భుజంమీదికి ఎత్తుకొని మార్టిన్ కొంతసేపు ఆలోచనలో పడ్డాడు. ఆ తర్వాత మెల్లగా లేచి గుడిసెనుండి బయటకు నడిచాడు.

ఏంతోనీ గుడిసెలోపల కసువు వూడుస్తున్నాడు. వంటగదిలో అతడికి ఒక వాడిపోయిన సంపెంగపూవు దొరికింది. అతడు ఆ పూవును చేతిలోకి తీసుకొని అది యెక్కడినుండి వచ్చి వుంటుందో ఆలోచించసాగాడు.

ఆ ప్రాంతంలో ఒక్క మాధవి ఇంట్లోనే సంపెంగ మొక్క వుంది. మాధవి

తన గుడిసెకు వచ్చేటప్పుడు సంపెంగపూవు జుట్టులో దోపుకొని వస్తూండేది. బహుశా తను లేనప్పుడు మాధవి యిక్కడికి వచ్చి వుండవచ్చు. కానీ యెందుకు వచ్చి వుంటుంది?

ఏంతోనీ ఆలోచనలో పడ్డాడు. అప్పుడు అతడి హృదయంలో ఎన్నో భయంకరమైన సత్యాలు బయటపడ్డాయి. బహుశా మాధవి నన్ను చంపాలనే వుద్దేశంతో కూరలో విషం కలిపి వుంటుందని అనుమానించాడు. నాకోసం కలిపిన విషపు కూర వర్కీ తినివుండవచ్చు. హే భగవాన్! అలాంటి స్త్రీలను నీవు యెందుకు సృష్టించావు తండ్రీ?

అతడు బయటకు చూశాడు. మార్టిన్ బయటనుండి పిల్లవాణ్ణి ఎత్తుకొని మెట్లు ఎక్కి వస్తున్నాడు. ఏంతోనీ నేరుగా మార్టిన్ దగ్గరకు వెళ్లాడు.

"మార్టిన్ చెట్టన్! యేమి సమాచారం?"

మార్టిన్ భయపడుతూ చెప్పాడు. "మేరీకుట్టీ ఎంత తట్టినా పలకడంలేదు."

"ఓ ప్రభూ పాపకు యేమయింది?"

"తెలీదు. యెంత లేపినా లేవడంలేదు."

"మేరీని డాక్టరుకు చూపించారా?"

"డాక్టరు ఎక్కడున్నాడు? ఏంతోనీ డాక్టర్ను త్వరగా తీసుకరా. నేను గుడిసెదగ్గర వుంటాను."

ఏంతోనీ చొక్కా తొడుక్కొని డాక్టర్ను పిలవడానికి బయలుదేరాడు.

మధ్యాహ్నానికి ఏంతోనీ డాక్టర్ను తీసుకవచ్చాడు.

డాక్టరు మేరీకుట్టీని పరీక్షించాడు. నాడి చూశాడు. మేరీకుట్టీ అప్పటికీ స్పృహలో లేదు.

డాక్టరు పరీక్షించిన తర్వాత "ఈ అమ్మాయికి సెరిబ్రెల్ మలేరియా వచ్చినట్లుంది. నా చేయి దాటిపోయింది. మీరు వెంటనే పెద్దాసుపత్రికి తీసుకవెళితే బ్రతకవచ్చు" అని నిరాశగా అన్నాడు.

అక్కడినుండి పట్నంలోవున్న ఆసుపత్రి సుమారు ముప్పై అయిదు మైళ్లు దూరంలో వుంది.

ఏంతోనీ - మార్టిన్‌లు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. వాళ్ల నోటినుండి ఒక్కమాట కూడా వెలువడలేదు. డాక్టర్ వెళ్లిపోయేముందు ఓ

యింజక్షను యిచ్చాడు. కానీ దానివల్ల యేమీ ప్రయోజనం కనపడలేదు.

మేరీకుట్టీని పెద్దాసుపత్రికి చేర్పించలేకపోయారు. ఆమె మరుసటిరోజు వుదయానికి అక్కడే చనిపోయింది.

మేరీకుట్టీ శవాన్ని చర్చికి తీసుకవెళుతున్నప్పుడు ఏంతోనీ కూడా వెంట వున్నాడు.

మేరీకుట్టీని కూడా అనికుట్టీ సమాధికి దగ్గరలోనే పాతిపెట్టారు. ఆ దృశ్యాన్ని చూస్తున్నప్పుడు ఏంతోనీ కళ్లనుండి కన్నీరు బొటబొటా కారాయి.

మరుసటిరోజు మార్టిన్ జాన్‌కుట్టీని తీసుకొని ఫాదర్ చుల్లిపరంబన్‌తో ఇలా చెప్పాడు "ఈ పిల్లాడి తల్లీ, అక్కా యిద్దరూ చనిపోయారు. నేను ఇప్పుడే యిక్కడినుండి వెళ్లిపోతున్నాను."

పిల్లవాణ్ణి ఫాదర్ ఎదురుగా పడుకోబెట్టి మార్టిన్ తన గుడిసెవైపుకు నడిచాడు.

## నలభై తొమ్మిది

ఒక నెల గడిచింది.

చెరియన్ మీద కోర్టులో కేసు వాదనలు జరిగాయి. చివరకు కోర్టు తన నిర్ణయాన్ని తెలిపింది. వర్గీసును కావాలని తుపాకీతో కాల్చి చంపినందుకూ, దొంగనోట్లు ముద్రించినందుకూ ఇరవైరెండు సంవత్సరాలు కఠిన జైలుశిక్ష విధించబడింది.

ఆ కేసులో మార్టిన్‌కూడా ఓ సాక్షి.

చెరియన్‌కు బేడీలు వేసి కోర్టునుండి బయటకి తీసుకవెళ్లారు. ఏంతోనీ కన్నీరు కారుస్తూ తన బాబాయి ఎదురుగా నిలుచున్నాడు.

"మన వూరికి వెళ్లిపో." చెరియన్ తన ఇరవైరెండేళ్ల జైలు శిక్షను గుర్తుకు తెచ్చుకుంటూ అన్నాడు.

ఏంతోనీ, మార్టిన్ బస్సు ఎక్కి తమ కొండమీదికి చేరుకున్నారు.

"నేను మా వూరు వెళ్లిపోతున్నాను. మార్టిన్‌చెట్టన్ మీరు ఏమి నిర్ణయించుకున్నారు?" ఏంతోనీ మార్టిన్‌ను అడిగాడు.

"నన్ను కూడా నీవెంట తీసుకెళ్లు." మార్టిన్ బాధపడుతూ అతణ్ణి వేడుకున్నాడు.

ఏంతోనీ కొంతసేపు ఆలోచించాడు.

"పిల్లాణ్ణి వెంట తీసుకెళ్లడంలేదా?"

"లేదు, పిల్లవాడి పెంపకం పురోహితుడే చూసుకుంటాడు. వాడు ఇక్కడ వుండడమే మంచిది."

ఇద్దరూ ఏంతోనీ గుడిసె చేరుకున్నారు.

భోంచేసి వరండాలో కూర్చున్నారు. అదే సమయంలో ముగ్గురు వ్యక్తులు వచ్చారు. వాళ్లలో ఇద్దరు క్రైస్తవులు ఒకడు హిందువు.

ఏంతోనీ లేచి వాళ్లకు స్వాగతం పలికాడు.

"ఏంతోనీకి కలిగిన దుఃఖాన్ని గురించి మేము విన్నాము. చెరియన్‌కు ఇరవై రెండేళ్ల జైలుశిక్ష పడిందని తెలిసి మేమూ బాధపడుతున్నాము. మా సానుభూతిని తెలుపుదామని ఇక్కడికి వచ్చాము." అని వచ్చినవాళ్లు అన్నారు.

"మీరు తెలిపిన సానుభూతికి కృతజ్ఞతలు." ఏంతోనీ దుఃఖాన్ని ఆపుకుంటూ అన్నాడు.

"నా పేరు కుంజికృష్ణన్ నంబియార్, వీరు తరాముట్టిల్ చాకో. మేమిద్దరమూ కలిసి అక్కడ వ్యవసాయం చేస్తున్నాము. వీరు మిస్టర్ వరీతకుంజి. వీరి హోటల్ మైసూర్‌లో బాగా నడుస్తోంది."

"ఏంతోనీ తిరిగి తిరువాన్కూరు వెళ్లటానికి నిశ్చయించుకున్నాడా?"

"అంతకంటే వేరే మార్గంలేదు."

"యీ పొలమంతా యేంకావాలి?"

"పొలాన్ని జాన్‌గారు తీసుకున్నారు. మా బాబాయిగారు వారివద్ద వెయ్యి రూపాయలు అప్పు తీసుకున్నారట. దాంతోపాటు కోర్టు ఖర్చులకు కూడా కొంత అప్పు తీసుకున్నాడుట. నేను తిరువాన్కూరు వెళ్లటానికి పాతిక రూపాయలిచ్చారు."

"మార్టిన్‌చెట్టన్ పొలము?" కుంజికృష్ణన్ నంబియార్ అడిగాడు.

"యేమీ కాలేదు. యేం చేయాలో తెలీడంలేదు" చివరకు మార్టిన్‌ను కదిపారు.

పొలం మూడొందల రూపాయలకు అమ్మకం కుదిరింది. ఆఖరున కుంజికృష్ణన్ నంబియార్ మరో వందరూపాయలు ఎక్కువగా ఇవ్వడానికి ఒప్పుకున్నాడు.

ఆ తర్వాత ఆ ముగ్గురూ వెళ్లిపోయారు.

ఏంతోనీ వరండాలో కూర్చుని వున్నాడు. సాయంకాలం అయింది. సాయంకాలం తర్వాత నలుదిశలూ చీకట్లు కమ్ముకున్నాయి. ఆ తర్వాత వెన్నెల కూడా వ్యాపించింది. కానీ ఏంతోనీ హృదయంలో చీకటే మిగిలింది.

# యాభై

మూడోరోజు వుదయాన్నే ఏంతోనీ తన సామానంతా సర్దుకున్నాడు. కుంజికృష్ణన్ నంబియార్ ఏంతోనీ, మార్టిన్‌లను తీసుకవెళ్లడానికి ఎద్దులబండిని పంపించాడు. ఏంతోనీ తొండియన్ కొండ వదిలి బండిలో కూర్చున్నాడు.

అతడు అక్కడ మూడంటే మూడేళ్లు కూడా గడపలేకపోయాడు. ఆ మూడేళ్లలో అతడు సంపాదించుకొన్నది కూడా ఏమీ లేదు. అతడికి మతాచార్యుడు కావాలని చాలా కోరికగా వుండేది. కానీ ఆ వర్షం కురిసిన రాత్రి జరిగిన ఘటనతో తన లక్ష్యం నెరవేరలేదు.

కొంతసేపటికి బండి మార్టిన్ వున్న కొండ చేరుకుంది. మార్టిన్ సామానంతా బండిలోకి ఎక్కించి ఇద్దరూ బండిలో కూర్చున్నారు.

బండి మెల్లగా ముందుకు నడుస్తోంది.

ఆ బండి రోడ్డు చేరుకుంది. ఏంతోనీ ఆ అడవిని నిశ్చలభావంతో చూస్తుండిపోయాడు. ఎంత మనోహరదృశ్యం! ఈ అందమైన ప్రకృతి ఎంతమంది ప్రాణాలను బలి తీసుకుందో? ఈ సౌందర్యం అంతా ఓ పెద్ద మోసం, దగా. ఈ అందమైన ఆకర్షణీయమైన ప్రకృతిని కౌగిలించుకొని ఎంతమంది ప్రజలు ఇహలోకయాత్ర చాలించారో?

సమీపించిన వారిని తన విషంతో హతమార్చే ఈ ప్రకృతి ఓ విషకన్యతో సమానం.

ఏంతోనీ చివరగా మాధవిని కూడా గుర్తు తెచ్చుకున్నాడు. "విషతుల్యమైన ఈ ప్రకృతికి నీవు చెల్లాయివి. అందుకే నీవూ ఒక విషకన్యవే."

అత్యంత విశ్వాసంతో ఏంతోనీ ఏసుప్రభువును ప్రార్థించాడు. హే ప్రభూ! నీవే నన్ను యీ యిద్దరు విషకన్యల బారినుండి రక్షించావు. అదే విశ్వాసంతో ఏంతోనీ బైబిలు తెరిచి చదవసాగాడు.

